లుంగీ-చొక్కా కట్టుకునివచ్చింది. ఆమెనలా చూస్తుంటే నా మనసు ఏదోలాగైపోయింది.

“అలా చూడకు. నువ్వు వెళ్ళి స్నానం చేసిరా” అంది ఉష.

మంత్రముగ్ధుడిలా ఆమె ఆజ్ఞ పాలించాను.

అంతకాలం నాకు దూరంగా వుండే ఉష ఆ రోజు నా స్వంతమయింది.

“నువ్వు దేవతవి ఉషా నీ సమక్షంలో స్వర్గసుఖాలు చవిచూస్తున్నాను” అన్నాను.

ఉష నవ్వి “నాకేమనిపిస్తోందో తెలుసా మనమిద్దరమూ ఒకరికొరకు ఒకరు పుట్టామని” అంది.

శశికళ తర్వాత స్త్రీతో అనుభవం ఇదే నాకు. అప్పుడు నాకంత ఉత్సాహంగా అనిపించలేదు కానీ అనుభవంలో శరీరం దూదిపింజలా తేలిపోయింది. మనసు నిండా ఏదో సంతృప్తి ఆవరించుకుంది.

“ఉషా హఠాత్తుగా నాకు వరమివ్వాలని ఎందుకనిపించింది నీకు?”

“వరమివ్వడమేమిటి? నీ హక్కు నువ్వు సాధించుకున్నావు!”

“అదెలా?” అన్నాను గానీ ఉషకు నేనార్థికంగా సాయం చేస్తున్నానని గుర్తుకువచ్చింది.

“చెప్పానుగా మనమిద్దరమూ ఒకరికొరకు ఒకరు పుట్టామని” అంది ఉష.

“ఉషా ఇంక నేనాగలేను. మనిద్దరం పెళ్ళి చేసేసుకుందాం” అన్నాను.

“పెళ్ళి గురించి కంగారు పడవద్దు. నీ కంగారు అణ

చడం కోసమే ఈ రోజు నీ స్వంతమయ్యాను...'' అంది ఉష.

''నీ మాటలు నాకర్థం కావడంలేదు.''

''అర్థం కావడానికేముంది? ఈ వయస్సులో ఆడా, మగా పెళ్ళికి ఎందుకు తొందరపడతారు? నీ వాటం చూస్తుంటే పెళ్ళి కబుర్లు కదుపుతావనిపించింది. నువ్వు నాకన్యాయం చెయ్యవన్న నమ్మకం నాకుంది. నీమీద నాకు గౌరవముంది. నా నమ్మకాన్నీ, గౌరవాన్నీ ఈ విధంగా చూపించుకున్నాను. దయవుంచి నేను చెప్పే వరకూ నావద్ద పెళ్ళికబుర్లు తీసుకురావద్దు'' అంది ఉష.

ఉష స్వభావం నా కర్థంకాలేదు. జరిగిన దాంట్లో అన్యాయమంటూ ఉంటే ఆమెకే కానీ నాకు లేదు. కానీ ఆమెకన్యాయం చేయడం నా కిష్టంలేదు. ఖాళీ అయిపోయిన నా హృదయంలో క్రమక్రమంగా ఆమె మూర్తి రూపురేఖలు దిద్దుకుంటోంది.

ఉషను నేను మనసారా ప్రేమిస్తున్నాను.

హైదరాబాదు నించి రెండుమూడు పర్యాయాలు ఇంటికి వెళ్ళివచ్చాను. నాన్న పెళ్ళిగురించి మాట్లాడేదు. నా విముఖత చూపించేను. అమ్మ డబ్బు గురించి ఏం చేస్తున్నావని అడిగింది. నేను సమాధానం చెప్పలేదు. ఉమ సంసారం హాయిగా సాగిపోతున్నట్లు తెలిసింది. కానీ నేను వెళ్ళి చూడలేదు. ఉమ ఒకటిరెండు పర్యాయాలు ప్రయత్నించినా నేను తప్పించుకున్నాను. ఉమ యిప్పుడు ఇంటికి వస్తూపోతూ వుంటోందట. అటూఇటూ సామరస్యం కుదిరినట్లేవుంది.

ఉమమీద నాకు ప్రత్యేకమైన కక్ష ఏమీలేదు. దాని

జీవితమే మైపోతుందోనని శెంగతప్ప. ఇంటికీ ఉమకూ సామరస్యాం కుదరడం ఒక విధంగా నాకూ సంతోషం గానే వుంది. నాకూ ఉషకూ పెళ్ళయినా ఇంట్లో పెద్ద రాద్ధాంతం జరుగవచ్చు. అయితే కొంతకాలానికి సామరస్యం కుదరవచ్చునని ఉమ విషయం చూడగానే అనిపించింది.

ఎప్పుడు ఇంటికి వెళ్ళినా ఎవరిమీదా నా దృష్టి నిలిచేది కాదు. మళ్ళీ తిరిగి ఎప్పుడు వెళ్ళి ఉష ఒడిలో వాలిపోతానా అనిపించేది.

ఉషకు వలచివలపించుకోవడం బాగా తెలుసు. ఆమె నాకు ఎప్పుడు లభిస్తుందో, ఎప్పుడు లభించదో నాకు తెలియదు. ఆమె ప్రవర్తననుబట్టి నేనేమీ ఊహించలేను. నా ఊహలన్నీ ఆమె విషయంలో తప్పయిపోయేవి. ఒకోసారి ఆమె నన్నెంతగానో ఊరించి ఊరించి వదిలేసేది. ఒకోసారి అతి సామాన్యంగా నాకు లొంగిపోయేది. ఆమెముందు నేనొక పసిపాపను. నన్నెలా లాలించాలో, బుజ్జగించాలో ఆమెకు తెలుసు.

జీవితమంటే ఆసక్తి, జీవించాలన్న కోరిక నాలో చోటు చేసుకుంటున్నాయి. ఇవి ఉషచుట్టూ పేరుకుంటున్నాయి. ఎన్నోసార్లు ఉషకి చెప్పాను. "నువ్వు లేకపోతే నేను బ్రతకలేను ఉషా" అని.

ఆమెతో పెళ్ళికోసం నా మనసు తహతహలాడుతోంది. కానీ ఆమె ఆగమంది. తప్పదు ఆగాలి. ఒకటి కాదు, రెండు కాదు ఆమెకోసం అలా మూడు సంవత్సరాలు ఆగాను.

ఒకరోజు ఉష నా చేతికి ఒక కవరు ఇచ్చింది—
"లోపల ఏముందో చూడు."

చూశాను వందరూపాయల నోట్లున్నాయి. చాలానే వున్నాయి "ఏమిటిది?"

"నీకు నేను బాకీవున్నాను. అది తీర్చవద్దూ?"

"ఛా - ఉషా - నేను నీకు అప్పుగా ఇచ్చాననుకున్నావా?" అన్నాను.

"ఏమో-ఎందుకిచ్చావో-నువ్విచ్చిన డబ్బుకి శరీరంతో బాకీ తీర్చానన్న తలంపు నీలో వుండకూడదు. అందుకే నీ డబ్బు తిరిగి ఇచ్చేస్తున్నాను..." అంది ఉష.

"కానీ నువ్వు నా భార్యవైతే ఈ మాట అనగలిగి వుండేదానివి కాదు" అన్నాను.

"అవును-నిజమే."

"వద్దు ఉషా-ఈ డబ్బు నేను వెనక్కి తీసుకోను" అంటూన్న నేను ఉష కళ్ళలో నీళ్ళను చూసి ఆశ్చర్యపడ్డాను.

"నా బాధ నీకర్థంకాలేదు. సరేలే ఈ ఉషను కులటగా కాక మంచి స్నేహితురాలిగా గుర్తుంచుకో మళ్ళీ మనం కలుసుకోమనుకుంటాను."

ఉలిక్కిపడ్డాను "ఏమన్నావ్?"

"నా పెళ్ళి నిశ్చయమైంది రవీ" అంది ఉష.

ఆమె యేం మాట్లాడుతోందో అర్థంకావటానికి కాసేపు పట్టింది నాకు. ఉషకో పల్లెటూరిబావ వున్నాడట. బాగా ఆస్తిపరుడట. అతనికే ఉషమీద మోజు. ఉషకిష్టంలేదు అందుకే అతని ఆర్థికసహాయాన్ని తిరస్కరించి ఇక్కడ ఒంటరిగా ఉండి తలిదండ్రులను పోషిస్తోంది. అయితే ఇటీవల ఆమె బావ ఎలాగో ఆమె తలిదండ్రులను వశపర్చుకున్నాడట. ఆమె బావను పెళ్ళాడక

పోతే ప్రాణాలు తీసుకుంటామని బెదిరిస్తున్నారు తలి దండ్రులు. కొద్ది నెలలుగా మాథనపడి చివరికి తలిదండ్రుల మాట వినడానికి నిశ్చయించుకుంది ఉష.

"అన్యాయం, నేనేమైపోవాలి?" అన్నాను.

"ఇంకో అమ్మాయిని చూసి పెళ్ళిచేసుకో—" అంది ఉష.

"ఎంత సింపుల్ గా చెప్పావు ఉషా. నా ప్రేమనింతేనా నువ్వర్థం చేసుకున్నది."

"తలిదండ్రులపట్ల నాకున్న ప్రేమను నువ్వర్థంచేసుకోలేక పోతున్నావు."

"ఏమో. నువ్వు నా కన్యాయం చేస్తే నేనేమైపోతానో నాకు తెలియదు..."

"నీకు జరిగిన అన్యాయం ఏమిటి? నాకు సాయంచేసిన డబ్బు తిరిగిచ్చేశాను. నా సర్వస్వం నీకర్పించాను."

"నేను కోరిందది కాదు. నిన్ను నా జీవిత భాగస్వామిగా చేసుకోవాలని."

ఉష వినలేదు. వెళ్ళిపోయింది. ఆతర్వాత రెండు మూడుసార్లు ప్రయత్నించాను. ఒక స్నేహితుడ్ని పలకరించినట్లు పలకరించి ఊరుకుంది. లాభంలేదు. ఆమె నా చేయిదాటి పోతుందనిపించింది. నాలోని ఆవేశం కట్టలు తెంచుకుంది. ఒక విధంగా ఉష నన్ను మోసంచేసింది. నా జీవితంతో చెలగాట మాడింది. అందుకేదయినా ప్రతిక్రియ చేయాలి.

ఆమెకు కాబోయే భర్తను చంపేస్తే...

అందువల్ల నేను జైలు పాలవుతాను తప్పితే, ఉష జీవితానికేం నష్టంలేదు. ప్రేమనామె సులభంగా మరచి

పోగలదు. అయితే ఏం చేయాలి?

ఉష నాకుతప్ప మరెవ్వరికి దక్కకూడదు. అందుకు ఏం చేయాలి?

ఆమె ప్రవర్తన సరయినది కాదని కాబోయే భర్తకు చెబుతానన్నాను. అందుకు ఉష భయపడదని నాకు తెలి శాక ఇంకొక్క మార్గం కనపడింది.

# 10

నేను గమనిస్తూనే ఉన్నాను. చేతిలో వ్యానిటీ బ్యాగు ఊపుకుంటూ ఉష ఆ షాపులో అడుగు పెట్టింది.

షాపులోజనం బాగానే వున్నారు. వారిలో కొందరిని ఉష ఆకర్షించింది. ఉష గోళ్ళరంగు, కాటుక కొని ఇంకేదో బేరమాడుతోంది.

"హలో" అంటూ వెనుకనుంచి భుజంతట్టి పలకరించాను.

ఉష కంగారుగా ముందుకు తిరిగి నన్నుచూసి— "నువ్వా?" అంది.

"నీతో చిన్నవిషయం మాట్లాడాలి. ఒకసారి బయటకు వస్తావా?" అన్నాను.

అయిష్టంగానే నాతోకదిలి బయటకు వచ్చింది ఉష. షాపు ఎంట్రెన్సువద్ద నిలబడ్డాం ఇద్దరం. ఇటు రోడ్డు మీదా, అటు షాపులోనూకూడా కొంతమంది మాకేసి చూస్తున్నారు.

"నన్ను పెళ్ళిచేసుకుంటావా, లేదా?" అన్నాను.

"ఎన్నిసార్లు చెప్పాలి?" అంది విసుగ్గా ఉష.

"ఇదే నీ ఆఖరి మాటా?"

"ఆహా ఇదే నా ఆఖరిమాట..." అంటూ చిరాగ్గా వెను దిరిగింది ఉష.

"అయితే నిజంగానే ఇది నీ ఆఖరిమాట" అంటూ నా చేతిసంచిలోని ఇనుపగూటంతీసి బలంగా ఆమె నెత్తి మీద మోదాను. కెవ్వుమని కేక వేసింది ఉష. అంతలోనే మరింత బలంగా రెండోసారి మోదాను.

కుప్పలా నేలకూలింది ఉష.

ఒకసారి చుట్టూ చూసాను. చూసిన కొద్దిమందీ దిగ్భ్రాంతులై అలా నిలబడి ఉండిపోయారు. నేను తేరుకున్నాను. హఠాత్తుగా ఎందుకో నన్ను భయమావహించింది. చటుక్కున రోడ్డుమీదకు గెంతి కనపడిన ఆటోలో ఎక్కాను. తోచిన గమ్యం చెప్పాను ఆటో అతనికి. ఆటో కొంతదూరం వెళ్ళాక చేతిలోని గూటాన్ని ఒక మురుగు కాలవలోకి విసిరేశాను.

నెమ్మదిగా నా మనసు తేలిక పడుతోంది. నన్ను సంతృప్తి ఆవహిస్తోంది. నేను పిరికివాడినికాను. చాటుమాటు వ్యవహారాలు నాకు గిట్టవు. ఉషను పట్టపగలు నడివీధిలో అందరూ చూస్తూండగా ఇంకెవరికీ దక్కకుండా చేశాను. ఉషను చంపేశాను. ఉష చనిపోయాక నాకుమాత్రం ఈ ప్రపంచంలో పనేముంది.

ఈ మధ్యకాలంలో ఇంతటి ప్రశాంతత నాకెన్నడూ కలగలేదు.

కొంతసేపటికి నా ఆటోని చాలా వెహికల్స్ చుట్టుముట్టాయి. "ఆటో ఆపు!" అన్నాను. ఆపగానే ఆటో దిగి ఆటోవాలాకు పదిరూపాయల నోటిచ్చాను.

నా చుట్టూజనం ఉన్నారుకానీ నన్ను సమీపించడానికి భయపడుతున్నారు. నేను నవ్వుతూ నిలబడి అందరివంకా చూసి "భయపడక్కర్లేదు. నావద్ద యే

ఆయుధమూ లేదు. ఎవరికీ ఏ విధమైన హానీ తలపెట్టను"
అన్నాను.

నా దెబ్బకు ఉషతల పగిలివుండాలి. అంతటి దారుణ హత్య అనంతరం ఇంత నిర్లిప్తంగా, గుండె నిబ్బరంగా కనపడుతున్న నన్ను చూసి ఈ ప్రజావాహినికి ఆశ్చర్యంగా ఉంది. కానీ వారికి నా సంగతి తెలియదు. అనుకున్న పని చేయగలిగాక నాకుచాలా తృప్తిగా ఉంటుంది. అది యెంతటి దారుణ మారణకాండ అయినప్పటికీ, పశ్చాత్తాపం ప్రసక్తి లేదు. అదే మంచిదయింది. లేకపోతే జైల్లో ఉన్నన్నాళ్ళూ కుమిలికుమిలి చావాలి. ఇప్పుడైతే హుషారుగా రాబోయే చావుకోసం ఎదురుచూస్తున్నాను. నా హుషారు జైలు అధికారులకుకూడా ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది.

జీవితంలో ప్రేమకు నోచుకోని మనిషిని నేను. నా కోసం ఏమైనా చేయగలమనిషి ఉంటే నా జీవితం మరోలా ఉండేది. నేను ప్రేమించిన ప్రతివ్యక్తీ నన్ను మోసగించడం జరిగింది.

ఎప్పుడో అప్పుడు నేను పెద్ద నేరంచేసి జైలుపాలవు తానని నా సవతితల్లి అంటూనే ఉండేది. బహుశా స్వానుభవంవల్ల ఆమె అది గ్రహించి ఉండవచ్చు.

ప్రేమ లభించనప్పుడూ, ప్రేమపేరుతో మోసగించబడినప్పుడూ మనిషి నేరాలు చేస్తాడు. నా సవతితల్లి అటువంటి మనిషే అయుంటుంది. అందుకే నన్నూ తనలా తయారు చేయాలనుకుంది. నాకు ప్రేమ లభించకుండా చేసింది.

అయితే ఆమె చేసే నేరాలు చట్టానికి అందనివి. నేరస్తులను తయారుచేసేవి. అలాంటి వ్యక్తులకీ ప్రపంచంలో శిక్ష లేదు.

నేను చేసిన నేరం ఆమెకులాకాక బాహాటంగా చేశాను. నాపని కాగానే చట్టానికి లొంగిపోయాను. నాలాంటి వాళ్ళకీ లోకంలో స్థానం లేదు.

నేనిప్పుడేమవుతానో—ఎక్కడికి వెడతానో—అక్కడయినా నాకు నిజమైన ప్రేమ రవంతయినా లభిస్తే చాలు. ప్రస్తుతానికి అదొక్కటే నా కోరిక!

—: ఐపోయింది :—

# షో కేసుల్లో శవాలు ?

## పోలవరపు ఆనందరావు

"ఎస్, చెప్పండి!" సిగరెట్ వెలిగించుకుంటు అన్నాడు డిటెక్టివ్ ఆనంద్.

అసిస్టెంట్ రవి చేతిలో పెన్సిల్ సిద్ధంగా ఉంది.

"నా పేరు రావ్. బహుశా మీరు వినే ఉంటారు. దాదాపు ఆరు సంవత్సరాలనుండి సినీఫీల్డ్ తో టచ్ వుంది. ఇప్పటికి నాలుగు తెలుగు పిక్చర్స్ తీసాను.

రెండు సంవత్సరాల క్రితం అంటే 1975వ సంవత్సరంలో ఫ్యామిలీ ప్లానింగ్ మీద రెండురీళ్ళ డాక్యుమెంటరీ చిత్రాన్ని నిర్మించాను. ఆ డాక్యుమెంటరీని నేనే డైరక్టు చేశాను. ఆ తరువాత దానిని ఫిలిమ్స్ డివిజన్ వారికి వేసి చూపించాను. వాళ్ళకు నచ్చిందని కొనుక్కున్నారు.

పోయిన సంవత్సరం అక్టోబరు నెలలో మరొక డాక్యు మెంటరీ నిర్మాణాన్ని ప్రారంభించాను. ఈసారి దేశం లోని నీటికరువు గురించి తీస్తున్నాను. ఇప్పటికి దాదాపు రెండువేల అడుగుల ఫిల్మ్ షూట్ చేశాను. దానిని యెడి టింగ్ చేయగా తొమ్మిదివందల అడుగులు వచ్చింది. షూటింగ్ పూర్తి అయినట్లే. ఇంకొన్ని షాట్స్ కావలసి వచ్చి మొన్న పదిహేనవ తారీఖున తాంబరానికి యిరవై అయిదు కి. మీ. దూరంలోవున్న సరుగుడు తోటలదగ్గర షూటింగ్ జరిపాను.

ఆరోజు నిజంగా నా అదృష్టం! నాకు గుంపులుగా పరిగెత్తే క్లవుడ్ షాట్స్ కావాలి! నేను అనుకున్నట్లు గానేవుంది ఆ వాతావరణం. ఆ లొకేషన్ చూడటా నికి చాలా బావుంది. సరుగుడు తోటల మీదుగా గుంపు లుగా కదులుతున్న మేఘాలు! మొత్తం ఐదువందల అడు గులు ఒక బిట్ గా షూట్ చేశాను.''

రావ్ చెప్పడం ఆపి, సిగరెట్ ను అష్ట్రేలో పడేసి తిరిగి ప్రారంభించాడు.

''నేను ఎప్పుడూ సత్యవాణి లాబ్ నే ఉపయోగిస్తాను కానీ ఈసారి వాళ్ళకు ఏవో అర్జంట్ పిక్చర్స్ రిలీజు కాబోతూండటం వలనవాటి ప్రింటింగ్ జరుగుతోంది. నాపని లేట్ అవడానికి అవకాశముంది అన్నారు. కాని, నాకున్న క్యూరియాసిటీ ఆషాట్స్ ఎంత బాగా వచ్చాయో చూడాలని.

అందుకని ఫాతిమా స్టూడియోలోని లాబ్ లో నిన్న రాత్రి తొమ్మిది గంటల నలభైఅయిదు నిమిషాలకు 'నెగటివ్ డెవలపింగ్ అండ్ స్ట్రెయిట్ ప్రింట్'కు

యిచ్చాను. ఆ లాబ్ ఛీఫ్ మోహన్‌దాస్ నాకు పరిచితుడు నా ఆత్రుతను అర్థంచేసుకుని, ఈ రోజు ఉదయం పది గంటలకు ప్రింట్ డెలివరీ యిస్తాను, అని ప్రామిస్ చేశాడు.

నా పిక్చర్‌కు ఎడిటర్‌గా గణపతి అనే ఆయన పని చేస్తుంటారు. ఆయన అసిస్టెంట్ సుందరం అనే యువకుడు! సుందరం కూడా చాలా మంచివాడు. నాకు నాలుగు సంవత్సరాల నుండి తెలుసు. నా పిక్చర్స్‌కు అతనే అసిస్టెంట్ ఎడిటర్‌గా పని చేస్తుంటాడు.

ఈ రోజు ఉదయం సుందరాన్ని ఫాతిమా లాబ్‌కు అకౌంట్ సెటిల్ చేసి, నెగటివ్ దానికి సంబంధించిన ప్రింట్ తీసుకురమ్మని పంపించాను. నా కారు రిపేర్ అవడంవలన సుందరం టాక్సీలో వెళ్ళాడు. అంతే ఇంత వరకూ అంతులేడు.''

రావ్ చెప్పడం ఆపి, బలంగా ఊపిరి పీల్చుకుని మరో సిగరెట్ వెలిగించాడు.

డిటెక్టివ్ ఆనంద్ రావ్ చెప్పేది శ్రద్ధగా వింటున్నాడు.

''అతను లాబ్‌నుండి నెగటివ్ కూడా డెలివరీ తీసుకున్నాడు. అసలు అక్కడనుండి నేరుగా ఎడిటింగ్ రూమ్స్‌కు రావలసిన వాడు సాయంకాలం వరకూ రాలేదు. యేమైపోయాడో అర్థంకావడంలేదు. ఇంటిదగ్గర, అతని స్నేహితుల దగ్గర ఎంక్వాయిరీ చేశాను. ఎవ్వరూ ప్రొద్దుట్నించీ సుందరాన్ని చూడలేదు. అతను పోయాడో, ఆ నెగటివ్ యేమైందో మీరు పరిశోధించాలి! ఫీజు గురించి వెనుకాడే మనిషిని మాత్రం కాను'' చెప్పాడు రావ్.

"మిగతా నెగటివ్స్ ఎక్కడున్నాయి?" అడిగాడు ఆనంద్.

"సత్యవాణి ఫిల్మ్ లాబ్ లో."

"మీకు ఎవరిమీద అయినా, అంటే, మిగతా టెక్నిషియన్స్ మీద యేమైనా అనుమానాలు వున్నాయా? బహుశా, ఈర్ష్యతోనో, లేదా మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేయాలనో ఈ పని చేసుంటానికి అస్కారముందా?" అడిగాడు ఆనంద్.

రావ్ తల అడ్డంగా ఊపాడు.

"ఆల్ రైట్! మీ అడ్రస్, సుందరం ఇంటి అడ్రస్ యిచ్చి వెళ్ళండి! నేను రేపట్నించీ పరిశోధన ప్రారంభిస్తాను. మీకు ప్రతిరోజూ రాత్రి నా రిపోర్టు అందచేస్తాను. కేసు ముగియకుండా ఫీజు ఎంతో చెప్పలేను. అడ్వాన్స్ మాత్రం యిచ్చివెళ్ళండి," చెప్పాడు డిటెక్టివ్ ఆనంద్.

అసిస్టెంట్ రవి, రావ్ చెప్పిన అడ్రస్ లన్నీ నోట్ చేసుకుని, అతను యిచ్చిన రెండువందల రూపాయల నోట్లను జేబులో తోసాడు.

"మీరు ఈ విషయం పోలీస్ కి రిపోర్ట్ చేయలేదా?" ఆనంద్ అడిగాడు.

"లేదు. వాళ్ళు మీ అంత చనువుగా వుండరు. వాళ్ళను చూడగానే ఎటువంటి వాళ్ళుకూడా భయపడి, నిజం చెప్పే అవకాశముండదని నా అభిప్రాయం!" రావ్ నవ్వి, మరోసారి కరచాలనం చేసి బయటకు కదిలాడు.

## 2

ఆనంద్ కారు దిగాడు.

"ఎవరుకావాలి సార్?" దాదాపు పరుగెత్తుకుంటూ

అడిగాడి లాబ్ వర్కర్.

"లాబ్ చీఫ్ మోహన్‌దాస్ ఉన్నారా?" ప్రశ్నించాడు ఆనంద్.

"ఆ రూమ్‌లో ఉంటారు" చెప్పి హడావిడిగా వెళ్ళిపోయాడు లాబ్ వర్కర్.

ఆనంద్ ఆ చుట్టుప్రక్కల పరిసరాలను గమనిస్తూ ఆఫీస్ రూమ్ వైపు నడిచాడు.

ఆఫీస్ రూమ్ చాలా విశాలంగావుంది. గదిలో ఐదు బీరువాలు ఉన్నాయి. బీరువాలకు నాలుగడుగుల ముందుగా రెండు బుక్ షెల్ఫ్‌లు ఉన్నాయి. వాటి నిండుగా అరలుగా పేర్చిన ఫైల్స్ ఉన్నాయి. డోర్‌కు ఎదురుగా, గోడకు ఆనుకుని రివాల్వింగ్ ఛైర్, దానిముందు పొడుగాటి టేబిల్, టేబిల్ మీద చిందర వందరగా పడవేసిన ఫైల్స్, పేపర్స్ ఉన్నాయి.

మోహన్‌దాస్ రివాల్వింగ్ ఛైర్‌లో వెనక్కువాలి, కళ్ళుమూసుకుని ఏదో దీర్ఘాలోచనలో ఉన్నట్లుగా కనబడుతున్నాడు. స్వింగ్ డోర్ మూసుకున్న శబ్దానికి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

ఆనంద్ విష్ చేసి తన్ను తాను పరిచయం చేసుకున్నాడు.

"కూర్చోండి! నేను మీకేమైనా సహాయం..."

"చెయ్యగలరనే ఆశతోనే వచ్చాను" మధ్యలోనే అందుకుంటూ కూర్చున్నాడు.

మోహన్‌దాస్ చిరునవ్వుతో తన అంగీకారం తెలియజేశాడు.

"పదహారవ తారీఖురాత్రి తొమ్మిదిన్నరకల్లా అయినుకు మిస్టర్ రావ్ అనే ప్రొఫెసర్ తన డాక్యుమెంటరీ

చిత్రానికి సంబంధించిన అవుట్ డోర్ నెగటివ్ ఒకటి డెవలపింగ్ అండ్ ప్రింటింగ్ కు ఇచ్చారు. దాని గురించి కొంచెం ఇన్ ఫర్ మేషన్ కావాలి!'' అడిగాడు ఆనంద్.

''ఓ...! అదా! మిస్టర్ రావ్ ఈ విషయం గురించి ఇక్కడ నానాగొడవా చేసి వెళ్ళారు. ఆ మర్నాడు ప్రొద్దునే సుందరవచ్చి తీసుకెళ్ళాడు. కానీ, అతను మాయమవటం మా దురదృష్టం! అనవసరంగా రావ్ గారు మా లాబ్ పేరు రచ్చకెక్కిస్తున్నారు. ఇప్పుడు డిటెక్టివ్ నికూడా పంపారు. ఇక రేపు పోలీసులుకూడా...''

''అంత అవసరం వసుందనుకోను!...మీరు కొంచెం శ్రమ అనుకోకపోతే, డెలివరి రెసిప్టుకాపీ చూపిస్తే మా సందేహాలు తీరిపోతాయి.''

విసుగ్గా లేచాడు మోహన్ దాస్. పది నిముషాలు వెదికి, రెండు లావుగావున్న ఫైల్స్ తీసుకవచ్చి ఆనంద్ ముందు పెట్టాడు.

''ఇది డెలివరీ రెసిప్టు ఫైల్! డేట్ తెలుసుగాబట్టి, తేలిగ్గానే దొరుకుతుంది వెదకండి'' చెప్పి తానొక ఫైల్ అందుకుని చేర్ లో కూర్చొని వెదకటం మొదలుపెట్టాడు.

ఆనంద్ జాగ్రత్తగా ఫైల్ వెదకడం మొదలు పెట్టాడు.

దాస్ చెప్పినట్లు తేలికగానే కనబడింది. ఆనంద్ ఆ రెసిప్టును అతిజాగ్రత్తగా పరిశీలించాడు. అంతా కరెక్టుగానేవుంది. క్రింద ఇంగ్లీషులో సుందరం సంతకం వుంది. క్రొత్త విషయం ఏమీ కనపడలేదు.

ఆనంద్ తలపైకెత్తి దాస్ వేపు చూశాడు. దాస్ దీక్షగా ఫైల్ లోని ఒక్కొక్క పేపరు తిరగేస్తున్నాడు.

పదినిమిషాలు గడిచిపోయాయి.

"మిస్టర్ దాస్!" అసహనంగా కుర్చీలో కదులుతూ పిలిచాడు ఆనంద్.

"చెప్పండి" తలపైకెత్తి అన్నాడు దాస్.

"ఆ నెగటివ్‌ను రాత్రి ఎవరు ప్రింట్ చేసారు? ప్రింట్ చేసిన తరువాత దానిని ఎవరు చెక్ చేశారు?"

"సాధారణంగా నైట్ షిఫ్టులో నేనే ఉంటాను. ఆ రోజురాత్రి నా అసిస్టెంట్ నెగటివ్ డెవలప్ చేశారు. దానిని చెక్ చేసి, అంతా కరెక్ట్‌గా ఉండటం వలన ప్రింట్ చేశాం. ప్రింటింగ్ పూర్తయ్యేసరికి రెండున్నర అయింది."

"ప్రింట్ అయిన తరువాత చెక్ చేశారా?"

"ఆఁ... చేశాను. ముందు టేబిల్‌లో చెక్ చేసాను. ఆ తరువాత థియేటర్‌లోకూడ చెక్ చేసాను."

"ఆయన తీసిన షాట్స్ చాలాబాగా వచ్చాయట!?"

"సారీ! నేను చెక్ చేసేటప్పుడు ప్రతిషాట్‌కూ లైటింగ్ సరిపోయిందో, లేదో చూస్తానుగాని, ఆషాట్ బ్యూటీగా ఉందా, లేదా అని చూడను."

"పోనీ, అవి ఏ విధమైన షాట్స్?"

"అందులో గొప్ప విశేషమేమీ లేవు. సాధారణంగా అందరూ షూట్ చేసుకొచ్చే క్లవుడ్ షాట్స్ మాత్రమే! ఆఫ్టరాల్...దానికి ఆయనింత గొడవ చేస్తున్నారంటే అర్థంలేదు."

"ఆషాట్స్ కోసమే కాదు. సుందరంకూడ కనిపించడం లేదుకదా! అతని కోసమైనా వెదకాల్సిందే మరి."

దాస్ నిట్టూర్పు విడిచాడు.

"మిస్టర్ దాస్! మీరు అసలు థియేటర్‌లో చెక్ చేసారా?"

"వెయిట్... వెయిట్! మీరు నమ్మటం కోసమే ఈ ఫైల్ తిరగేస్తున్నాను. ఇది లాబ్ థియేటర్ ఫైల్!" అని చెప్పి, తిరిగి ఫైల్ లోని పేపర్స్ వెదకడం మొదలు పెట్టాడు.

మరో ఐదు నిముషాలు గడిచాయి.

"ఇది చూడండి! మీకే అర్థం అవుతుంది" ఫైల్ ను ఆనంద్ ముందుకు తోశాడు.

దానిలో ప్రొడక్షన్ పేరు, ప్రొడ్యూసర్ పేరు వ్రాసి ఉన్నాయి. సరిగ్గా రెండూనలభై ఐదుకు ప్రొజెక్టర్ ఆన్ అయింది. మూడుగంటల అయిదు నిముషాలకు చెకింగు ముగిసింది. క్రింద ఆపరేటర్ సంతకం ఉంది.

ఆనంద్ ఫైల్ మూసి లేచి నిలబడ్డాడు.

"మిస్టర్ మోహన్ దాస్! చాలా హెల్ప్ చేశారు. కాని, ఆ షాట్స్ గురించి కొంచెం విపులీకరించి చెప్పినట్లయితే బాగుండేది" అసంతృప్తిగా అన్నాడు ఆనంద్.

"సారీ! ముందే చెప్పానుగదా! ఫీచర్ ఫిల్మ్స్ ఐతే ఒకటికి రెండుసార్లు థియేటర్ లో చెక్ చేస్తాను. ఇది కూడా అలా చేసినట్లయితే, మీకు కొంచెమయినా చెప్ప గలిగి ఉండేవాడిని! కాని, డాక్యుమెంటరీ అవటంవలన ఒకసారికంటె ఎక్కువగా చూడలేదు. సో, ఐ కాంట్ డూ ఎనీ హెల్ప్ ఇన్ దట్ మేటర్!"

"థాంక్స్! సీ యు ఎగయిన్" షేక్ హాండ్ ఇచ్చి, బయటకు కదిలాడు ఆనంద్.

# 3

"వాడికి ఎంతపనివున్నా రోజుకు ఒక్కసారయినా వచ్చి కనపడి వెళ్ళేవాడు. ప్రతిరోజూ ఇంటివిషయాలు

స్వయంగా కనుక్కొని, చేయగలిగిన సహాయం చేసి వెళ్ళేవాడు. మాకున్నది వాడొక్కడే కొడుకు! మేమిలా బ్రతుకు నెట్టుకొస్తున్నామంటే వాడిని చూసుకోవడానికే! ఇంకో రెండు మాసాలలో పెళ్ళికూడా నిశ్చయమైంది."

గాద్గదిక స్వరంలో మెల్లిగా ఒక్కొక్కమాటే చెప్పుకుంది సుందరం తల్లి. ఆవిడ కళ్ళు కన్నీటితో నిండిపోయాయి. ఆవిడకు దాదాపు నలభై సంవత్సరాలకుపైన ఉంటాయి. శరీర పోషణలేక ఎండిపోయిన ఆవిడ శరీరం ఆ ఇంటి ఆర్థిక పరిస్థితులను విపులీకరించి చెబుతున్నట్టు అనిపిస్తోంది. నిద్రలేమితో గుంటలుపడ్డ కళ్ళచుట్టూవున్న ముడతలు కన్నీరు కార్చటంలో తమకున్న అనుభవాన్ని తెలుపుతున్నాయి.

"సుందరం నాన్నగారు ఎక్కడ?" అడిగాడు రవి.

"ఆయన పదిహేను సంవత్సరాలనుండి ఏదో ఎస్టేట్స్‌లో పని చేస్తున్నారు. ఆయన చాలా సాధు స్వభావి! మంచివారు కాబట్టే ఎంతకాలం పనిచేసినా ఆ రెండువందల జీతంకంటే ఎక్కువ అడగలేరు. ప్రొద్దున్న ఎనిమిది గంటలప్పుడనగా వెడతారు. తిరిగి సాయంత్రం ఐదు గంటలకుగాని రారు!"

"ఆయన ఏం పనిచేస్తారు అక్కడ?"

"ఏదో గుమాస్తా గిరీ."

"సరే సుందరానికి ఫ్రెండ్స్ ఎవరైనా ఉన్నారా?"

మరలా సుందరం పేరు రాగానే ఆవిడ కళ్ళలో నీళ్ళు ఉబికాయి.

"ఇంటికయితే ఎక్కువగా తీసుకురాడు గాని, వాడు

మాత్రం ఎప్పుడూ సారంగపాణీస్ట్రీట్ లో పదహారవ నెంబరు ఇంటికి వెడతాడు. వాడి ఫ్రెండ్స్ అందరూ అక్కడే వస్తారని చెబుతుండే వాడు."

"మీరేమీ దిగులు పెట్టుకోవద్దు. సుందరం ఎక్కడున్నా వెతికి తీసుకువస్తాం! అనవసరంగా బాధ పడకండి!"

ఆవిడ ఏడుస్తూనే తలూపింది. రవి ఇక అక్కడ నిలబడలేక బయటకు వచ్చి, సైకిల్ ఎక్కాడు.

నెం, 16 సారంగపాణీస్ట్రీట్ తేలిగ్గానే దొరికింది. సైకిల్ గేటుబయట స్టాండ్ వేసి, గేట్ తోసుకుని లోపలకు వెళ్ళాడు. లోపల కొంచెం ఖాళీస్థలంవుంది. ఆ స్థలానికి ఇరువైపులా ఇళ్ళు వరుసక్రమంలో వున్నాయి. అన్నీ చిన్నచిన్న పోర్షన్స్ మాత్రమే! ఖాళీ స్థలంలో చాలామంది పిల్లలు గోడవగా అరుచుకుంటూ, కొట్టుకుంటూ ఆడుకుంటున్నారు.

రవిని చూడగానే బయటకూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న ఆడవాళ్ళు లేచి వెళ్ళిపోయారు. రవి అటువైపుపోతున్న కుర్రాడిని పట్టుకుని సుందరం గురించి అడిగాడు. వాడు రివ్వున ఎడమవైపున్న వరుసలో చివరి ఇంటిలోకి పరుగెత్తాడు.

రెండు నిముషాల తర్వాత ముగ్గురు యువకులు బయటకు వచ్చారు. అందరూ దాదాపు రవి వయస్సువాళ్ళే! చూడటానికి చాలా సింపుల్ గా బాగున్నారు.

రవిని చూడగానే విష్ చేశారు.

"మీరు అడిగింది అసిస్టెంట్ ఎడిటర్ సుందరం గురించే కదా!"

రవి అవునని తలూపాడు.

"అయ్యా! సదరు సుందరంగాను కొలది దినాలుగా అదృశ్యమైపోయాడు. వివరాలేవీ యింకా తెలియరాలేదు. బహుశా పేపర్‌లో యే బహుమతో ప్రకటించినట్లయితే, తనకు తనే రెక్కలు కట్టుకుని వాలగలడే! మీరు ఆ పని చేసివుండాల్సింది!" డైలాగు చెప్పే ధోరణిలో, ఒకడుగు ముందుకు వేసి చెప్పాడు ఒకతను.

"సార్! ఇప్పుడు వాగిన కథానాయకుడి పేరు గోఖలే అతను విజయ్‌కుమార్! పోతే నా పేరు గోపీ. సెర్టింగ్ రోడ్‌లోని ఇంజనీరింగ్ కాలేజీలో చదువుతున్నాను. మీ పేరు చెప్పగలరా?"

"నా పేరు రవి! డిటెక్టివ్ ఆనంద్ దగ్గర అసిస్టెంట్‌గా పనిచేస్తున్నాను" చెప్పాడు రవి.

"మాకు డిటెక్టివ్స్ అన్నా-పరిశోధనలన్నా చాలా ఇష్టం!" అన్నాడు గోపీ.

"సుందరం చాలా మంచివాడు. మాకు భోజనం లేక పోతే ఎలాగైనా సరే అప్పుచేసి తెచ్చియిచ్చే వాడు. మేం నలుగురుమూ ఎంతో ప్రాణంగా కలిసివుంటున్నాము. వాడు కనబడకపోవటం వలన మాకు చాలా డల్‌గానే వుంది. కాకపోతే__వాడికొక దుర్గుణం మాత్రం వుంది. అదయినా ఆర్థిక పరిస్థితులవలన మాత్రమే యేర్పడింది" విజయకుమార్ చెప్పటం ఆపాడు. ఏదో ఆలోచిస్తున్నాడు.

"ఏమిటది" రవి ఆత్రంగా అడిగాడు.

"వాడు పనిచేసే పిక్చర్‌లో యేవైనా మంచి పాట్స్ అంటే ఆర్టిస్టులేకుండా వుండే పాట్స్, ప్రొడ్యూసర్ ఎక్కువుంట్స్‌లోనే ఎక్స్‌ట్రా ప్రింట్ చేయించి, దానిని

డ్యూప్ నెగటివ్‌తో సహా ఎవరికైనా అమ్మేస్తుంటాడు. మేం ఎన్నిసార్లో చెప్పాం ఆ అలవాటును మార్చుకోలేక పోయాడు" చెప్పాడు గోఖలే.

## 4

ఆనంద్ కోట్స్‌రోడ్‌లోవున్న రావ్ ప్రొడక్షన్ ఆఫీస్‌కు చేరుకునేటప్పటికి సరిగ్గా ఇరవై రెండు నిముషాలు పట్టింది.

'రావ్ ఎంటర్‌ప్రైజస్' బోర్డున్న రూమ్‌వైపు నడిచాడు. రూమ్ముందు చిన్న స్టూల్ మీద బోయ్ కూర్చునివున్నాడు.

"మిస్టర్ రావ్‌ని చూడాలి!" చెప్పాడు ఆనంద్.

బోయ్ లోపలకు వెళ్ళి, నిమిషంలో తిరిగివచ్చాడు.

ఆనంద్ లోపల అడుగుపెట్టాడు.

"కమిన్ మిస్టర్ ఆనంద్!" రావ్ ఆహ్వానిస్తూండగా రావ్‌కు ఎదురుగా కూర్చున్నవ్యక్తి తల ప్రక్కకు తిప్పి ఆనంద్‌ని చూశాడు.

ఆనంద్, రావ్ టేబిల్‌కు ప్రక్కనున్న కుర్చీలో కూర్చుని, ఆ క్రొత్తవ్యక్తిని పరిశీలగా చూశాడు.

ఆ వ్యక్తికి నలభైయేదేళ్ళుండవచ్చు! ఎఱ్ఱగా, లావుగా వున్నాడు సుమారు ఆరు అడుగుల ఎత్తుండవచ్చు. తల మీద అక్కడక్కడ కొంచెం వెంట్రుకలున్నాయి. తక్కువే అయినా నల్లగ నిగనిగలాడుతున్నాయి. మంచి ఖరీదైన సూట్‌లోవున్నాడు. కుడిచేతికి రంగు రంగుల, పెద్దవాచీవుంది. చూడగానే విలువైన మనిషని గ్రహించాడు ఆనంద్.

"ఈయన భూషణ్ ఎస్టేట్స్‌కు అధిపతి! పేరు

భూషణ్ రావ్! నాకు గత రెండేళ్ళుగా పరిచయం. ప్రస్తుతం ఈయన ఒక పిక్చర్ స్టార్ట్ చేస్తున్నారు. నన్ను డైరెక్ట్ చేయమని కోరారు.''

రావ్ ఒకరినొకరికి పరిచయం చేశాడు. ఇద్దరూ విష్ చేసుకోగానే, రావ్ టేబిల్ మీదున్న స్విచ్ నొక్కాడు. బోయ్ కాఫీ తీసుకువచ్చాడు. ముగ్గురూ కాఫీ త్రాగి, సిగరెట్స్ వెలిగించి, మాటల్లోపడ్డారు.

అరగంట గడిచిన తరువాత భూషణ్ రావు తనకు వేరేపని ఉన్నదని, క్షమాపణలు చెప్పుకుని వెళ్ళిపోయాడు.

మిగిలిన ఇద్దరూ కేసుగురించి చర్చించుకుంటూండగా ఫోన్ మ్రోగింది. రావ్ మాట్లాడం ఆపి రిసీవర్ ఎత్తాడు.

''యస్....ప్లీజ్ వెయిట్!'' ఆనంద్ వైపు తిరిగి, ''మీ అసిస్టెంట్ రవి!'' చెప్పి రిసీవర్ అందించాడు.

''హల్లో!...ఆ...గుడ్! సరే!...నేను సాయంత్రం ఆరుగంటలకు వస్తాను. ఓ కే!'' ఆనంద్ ఫోన్ పెట్టేసి, రావ్ తో విషయాన్ని టూకీగా చెప్పి, ''అర్జంట్ గా ఎడిటర్ గణపతిని పిలిపించండి!'' అన్నాడు.

రావ్ రెండుచోట్లకు ఫోన్ చేసి, గణపతివస్తే వెంటనే తన ఆఫీసుకు రమ్మనమని చెప్పాడు.

పన్నెండున్నరకు గణపతి వచ్చాడు.

''గణపతిగారూ! సుందరానికి స్టాక్ షాట్స్ అమ్మే అలవాటుందట! మీకు తెలుసా?'' అడిగాడు ఆనంద్.

''ఉందని విన్నాను గాని, నా దగ్గర పనిచేసేటప్పుడు మాత్రం ఇంతవరకూ అలాంటదేమీ చేయలేదు,'' చెప్పాడు గణపతి. అతని స్వరం కొంచెం బాధగా పలుకు

తుంది. మనిషి కంగారుపడుతున్నాడు.

ఆనంద్, గణపతిని సూటిగాచూశాడు. గణపతి యిబ్బందిగా రావ్ వైపు చూశాడు. రావ్ ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తున్నాడు.

"మిస్టర్ గణపతీ! మీ నమ్మకం దెబ్బతింది. సుందరం యిప్పుడు రావ్ గారు నిర్మించే డాక్యుమెంటరీలో కొన్ని షాట్స్ నెలక్రితం అమ్మాడట!"

ఆనంద్ చెప్పినది వినగానే మొహం ఎఱ్ఱబారింది గణపతికి.

"నేను నమ్మను" గట్టిగా చెప్పాడు గణపతి.

"మీ ఎడిటింగ్ రూమ్స్ ఎక్కడ?"

"గిరి రోడ్ లోవున్న ఓ ప్రైవేట్ ఎడిటింగ్ రూమ్‌లో చేస్తున్నాను."

"అయితే పదండి! చెక్ చేసి వద్దాం!" ఆనంద్ లేచాడు.

రావ్ అయోమయంగా చూస్తున్నాడు.

ఇద్దరూ అంబాసిడర్‌లో ఎడిటింగ్ రూమ్‌కు చేరుకున్నారు. కారు ఆగగానే గణపతి క్రిందకుదూకి రూమ్‌లోకి పరుగెత్తాడు. ఆనంద్ అనుసరించాడు.

ఎడిటింగ్ రూమ్ నిండా చాలా ఎత్తువరకూ వరుసగా పేర్చబడిన క్యాన్స్‌వున్నాయి. రూమ్ చాలా ఇరుగ్గా వున్నట్లనిపించింది. ఎడిటింగ్ టేబిల్‌కు కొంత దూరంలో కిటికీ ప్రక్కగా రివైండింగ్ టేబిల్ వుంది. దానిక్రింద కొన్ని క్యాన్స్‌వున్నాయి. గణపతి కంగారుగా వాటిని తీసి వెదికాడు.

ఆనంద్ ఫిల్మ్ వాసనపీలుస్తూ, గణపతి మొహంలోని భావాలని పరిశీలిస్తున్నాడు.

క్రమంగా గణపతి మొహం పాలిపోయింది.

"మీరు చెప్పిందే నిజం! సుందరం యింతపని చేస్తాడనుకోలేదు. మొన్న ఒకసారి వర్క్ జరుగుతూండగా ఈ క్యాన్ కనపడలేదని గొడవచేసాను. మిగతా క్యాన్స్‌తో కలిసిపోయి మిస్ అయిందనుకున్నాను" బాధగా చెప్పాడు గణపతి క్యాన్ మూత మూస్తూ. ఆ క్యాన్ ఖాళీగావుంది!

"సుందరం అమ్మిన ఎన్.డి. షాట్స్ నెగటివ్ ఎక్కడుంది?" అడిగాడు ఆనంద్.

"సత్యవాణీ స్టూడియోలాబ్‌లో వుంది."

"అసలు ఈ డాక్యుమెంటరీకి సంబంధించిన నెగటివ్ ఎన్ని లాబ్స్‌లోవుంది?"

గణపతి లేచి నిలబడ్డాడు.

"మేం ఎప్పుడూ సత్యవాణీ లాబ్‌నే ఉపయోగిస్తాం. లాస్ట్‌బిట్‌నుమాత్రం ఆ లాబ్‌కు ఏదో రిలీజ్ పిక్చర్ వుండటం వలన మా పని త్వరగా అవాలనే ఉద్దేశంతో ఫాతిమా స్టూడియోకు యిచ్చాం!"

చెబుతూనే తాను చిందరవందరగా చేసిన క్యాన్స్‌ను వరుసక్రమంలో పెట్టాడు. కర్చీఫ్‌తో మొహానికి పట్టిన స్వేదబిందువులను తుడుచుకుని భారంగా బయటకు కదిలాడు.

"గణపతి! మీరు శ్రమ అనుకోకపోతే,అలా సత్యవాణీ లాబ్‌కుపోయి ఒకసారి నెగటివ్స్ చెక్‌చేసి వద్దాం! వీలైతే ఆ ఎన్. డి. షాట్స్ ప్రింట్ ఒకటి కావాలి! ఏమంటారు?" అడిగాడు ఆనంద్.

"అలాగే పదండి."

అంబాసిడర్ పదినిమిషాలలో సత్యవాణీ లాబ్ ముందు ఆగింది. ఇద్దరూ లాబ్ రిసెప్షన్ చేరుకున్నారు.

రిసెప్షన్ చాలా సందడిగావుంది. కొందరు విలాసంగా సిగరెట్స్ త్రాగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. మరి కొందరు హడావిడిగా లోపలకు బయటకు తిరుగుతున్నారు.

రిసెప్షన్ దగ్గరున్న ఆపరేటర్ గొంతు వాళ్ళ గొడవతో కలిసిపోయి వినిపించడంలేదు. యూనిఫామ్ వేసుకున్న లాబ్ వర్కర్స్ క్రొత్త పిక్చర్ తాలూకు ఫిల్మ్ బాక్స్‌లు వరుసగా పెట్టి లెక్క చూసుకుంటున్నారు. రిసెప్షన్ టేబిల్‌కు ముందున్న కుర్చీలోని వ్యక్తులు టీ త్రాగుతూ లాబ్ వర్కర్స్‌కు ఏవో ఆదేశాలనిస్తున్నారు.

గణపతి, ఆనంద్‌ను అక్కడే వుండమని సౌంజ్ఞ చేసి, టేబిల్ వెనుకనుండి లోపలకు వెళ్ళాడు. రెండు నిమిషాలలో బయటకువచ్చి, ఆనంద్‌ని లోపలకు రమ్మని చేయి ఊపాడు.

ఆనంద్ జనాన్ని తప్పించుకుంటూ గణపతి వెంబడి లోపలకు వెళ్ళాడు. లోపల రివాల్వింగ్ చేర్‌లో ఓ నడివయస్కుడు కూర్చుని ఏవో ఫైల్స్ చూసుకుంటున్నాడు. గణపతి, ఆనంద్‌ను అవ్యక్తికి పరిచయం చేశాడు. అవ్యక్తి ఇద్దరినీ కూర్చోమని కుర్చీలు చూపించాడు.

"సార్! రావ్‌గారి డాక్యుమెంటరీకు సంబంధించిన నెగటివ్స్ కొంచెం చెక్ చేయాలి! వీలయితే ఓ త్రీఫిఫ్టీ ఫీట్ ప్రింట్ కూడా కావాలి! మీరు బిజీలో ఉన్నారని తెలిసే అడుగుతున్నాను క్షమించాలి!" గణపతి ప్రాధేయ

పూర్వకంగా చూశాడు అవ్యక్తి వైపు.

అవ్యక్తి చిరునవ్వు నవ్వాడు.

"మిస్టర్ గణపతీ! మీకంటే మీ అసిస్టెంటు చాలా స్పీడులాగుంది. ఒకవేళ మీరు మరోదారిన రాలేదు కదా?"

గణపతి రెండుక్షణాలు అయోమయంగా చూశాడు.

ఆనంద్ మొహంలో ఏవో అనుమానపు ఛాయలు అలుముకున్నాయి.

"మీరు చెప్పేదేమిటో...?" గణపతి తడుముకుంటున్నాడు మాటలకోసం.

"సారీ, గణపతి! మీ అసిస్టెంట్ సుందరం ఇంతకుముందు పదినిమిషాలయిందేమో, వచ్చి రావ్ గారు నెగటివ్ను చెక్ చేయమన్నారని చెప్పి మొత్తం ఫ్యాన్స్ అన్నీ తీసుకెళ్ళాడు."

"ఆఁ..." బ్రమ్మెపడిపోయాడు గణపతి.

"అతను నిజంగా నా అసిస్టెంటేనా?"

"యస్! సుందరం నాకు బాగా పరిచయమేకదా!"

గణపతి గగ్గోలు పెడుతూ విషయమంతా చెప్పాతున్నాడు.

"అతనివెంట ఎవరేనా ఉన్నారా?" అడిగాడు ఆనంద్ లేచి నిలబడుతూ.

"బయట సంగతి నాకు తెలియదు. ఈ రూమ్‌లోకి అతనొక్కడే వచ్చాడు. ఐయామ్ సారీ," తన బాధను వ్యక్తంచేశాడు లాబ్ చీఫ్.

లాబ్ చీఫ్‌కు థాంక్స్ చెప్పి,ఇద్దరూ నీరసంగా రిసెప్షన్ టేబిల్ దగ్గరకు చేరుకున్నారు.

"మీరు ఈ విషయం వెంటనే రావ్ గారితో చెబితే మంచిదేమో!" అన్నాడు ఆనంద్.

ఆపరేటర్ వైపు అడుగులేశాడు గణపతి దిగులుగా.

ఆనంద్, గణపతి వాలకాన్ని గమనిస్తూ కొంచెం దూరంగా సిగరెట్ వెలిగించాడు.

ఇద్దరు మాట్లాడిన తరువాత లైన్ దొరికింది కాబోలు గణపతి ఆత్రంగా అందుకున్నాడు ఫోన్. గణపతి నోరు మెదపటం కనబడుతోంది గానీ మాటలు సరిగా వినిపించటంలేదు.

లాబ్ వర్కర్ ఒకతను గబగబ నడిచి ఆనంద్ దగ్గరకు వచ్చాడు.

"సార్! మీరేనా ఆనంద్?" అడిగాడు.

ఆనంద్ తలూపాడు.

"సుందరం నాకు ఫ్రెండ్! అతను పావుగంట క్రితం వచ్చి, నెగటివ్స్ డెలివరీ తీసుకునేప్పుడు, రహస్యంగా త్రీఫ్రేమ్స్ ఫిలిమ్ ఇచ్చి, తనకోసం ఎవరయినా వస్తే యివ్వమన్నాడు. మీరు లాబ్ చీఫ్‌తో మాట్లాడుతుంటే విన్నాను" అతను బ్యాక్ పాకెట్ లో నుండి చిన్న పేపర్ లోవుంచిన త్రీఫ్రేమ్స్ నెగటివ్ ఫిల్మ్ బయటకు తీసి, ఆనంద్ చేతిలో పెట్టాడు.

"ఇదేమిటి చూశావా?" అడిగాడు ఆనంద్.

"లేదు. బహుశా ఏ బ్లూఫిల్మ్‌కో సంబంధించిన ఫ్రేమ్స్ అయివుండవచ్చు! ప్రింట్ చేసి తెమ్మంటారా?"

"వద్దు! నేను బయట ప్రింట్ చేయిస్తాను. ఈ సంగతి ఎవరితోనూ చెప్పవద్దు!" చెప్పి, జేబులోనుండి అయిదు రూపాయలనోటుతీసి ఇవ్వబోయాడు.

ఆవ్యక్తి నవ్వుతూ తల అడ్డంగా ఊపి నిరాకరించాడు.

"చాలా థాంక్స్! నీ ఉపకారానికి" చెప్పాడు ఆనంద్.

ఆవ్యక్తి తృప్తిగా తలాడిస్తూ వేగంగా వెళ్ళి, మిగతా వర్కర్స్‌తో కలిసిపోయాడు.

ఆనంద్ ఆ ఫిల్మ్ ముక్కను జాగ్రత్తగా జేబులో వేసుకున్నాడు. గణపతి ఫోన్ పెట్టేసి, ఆపరేటర్‌తో ఏదో మాట్లాడి ఆనంద్ దగ్గరకు వచ్చాడు.

# 6

"మిస్టర్ ఆనంద్! మీరు పరిశోధన మొదలుపెట్టి రెండురోజులు అయింది. ఇంత వరకూ ఎటువంటి సమాచారమూ అందించలేకపోయారు."

సంజాయిషీ చెప్పమన్నట్లు అడిగాడు రావు.

ఆనంద్ పేలవంగా నవ్వాడు.

"రావ్ గారూ! నేను రాత్రికూడ మీకు రిపోర్టుఅందజేసాను. ఎంత ప్రయత్నించినా పరిశోధన ముందుకు పోవటానికి మార్గం కనపడటంలేదు. అయినా సుందరం వలన నెగటివ్ పోయిన తరువాతకూడా మిగతా స్టూడియోల్లో మరలా అదే పొరబాటు జరక్కుండా కట్టుదిట్టం చేయలేక పోయారు" నిష్ఠూరంగా అన్నాడు ఆనంద్.

రావ్ దెబ్బతిన్నట్లు చూశాడు.

"అయితే నా నెగటివ్‌ను నేనే దాచుకుని మిమ్మల్ని తిప్పలు పెడుతున్నానంటారా?" కొంచెం కోపంధ్వనించింది రావ్ కంఠంలో.

"అది అర్థంలేని అనుమానం! మీకుబాగా తెలిసిన స్నేహితులెవరో ఈ నాటకమాడుతున్నారు. అది మీ

మీద కక్షతో కావచ్చు లేక అసూయతో కావచ్చు!''

రావ్ మౌనంగా ఉండిపోయాడు.

''ఇంతవరకూ ఎడిట్ చేసిన ప్రింట్ వుందా?''

రావ్ తలూపాడు.

''అదికూడా మాయం కాకముందే ఒకసారి థియేటర్‌లో చూస్తాను. దానికి ఏర్పాటు చేయండి.''

''గణపతిని పిలిపించి, తీసుకెడదామా?'' రావ్ అడిగాడు.

''వద్దు!''

ఇరవై నిముషాలలో ఇద్దరూ రావ్‌గారి ఫియట్‌లో పారడైజ్ థియేటర్ చేరుకున్నారు.

ఆనంద్ డాక్యుమెంటరీని పరిశీలనగా చూశాడు. రావ్ చెప్పినవి అతిశయోక్తులు కాదనుకున్నాడు మనసులో! ప్రతిషాటూ ఎంతో నీట్‌గా, వెరైటీగా కనబడింది. దేశంలోని కరువు కాటకాలమీద, వివిధ ప్రదేశాలలో కష్టపడి షూట్ చేసుకొచ్చినట్లు చాలా స్పష్టంగా కనబడుతుంది.

థియేటర్‌లో లైట్స్ వెలిగాయి. ఆనంద్ అలవాటుగా వాచీ చూశాడు. పదీనలభై అయింది. ప్రొజెక్షన్ కరెక్టుగా పదిన్నరకు స్టార్టయింది. అంటే, డాక్యుమెంటరీ రన్ అయిన టైమ్ కేవలం పదినిమిషాలన్నమాట!

అదే అడిగాడు రావ్‌ని ఆశ్చర్యంగా.

''ఎస్! ఒక నిమిషానికి తొంభయి అడుగులు రన్ అవుతుంది. ఇంతవరకూ ఎడిట్ చేసిన లెన్త్ తొమ్మిది వందల అడుగులు.''

రావ్ చెప్పింది వింటూనే వులిక్కిపడ్డాడు ఆనంద్.

మెదడులో ఆలోచనలు ఒక్కసారిగా మీద పడ్డాయి. ఆ ఆలోచనల్లో ఏదో ఒక మెరుపు మెరిసినట్లయింది.

"రావ్ గారూ! అర్జంటుగా మీ ఫియట్ కావాలి!" ఆత్రంగా అడిగాడు.

రావ్, ఆనంద్ ఆలోచనలను పసికట్టాడు.

"కేస్‌కు సంబంధించిన విషయమైతే వెంటనే తీసుకు వెళ్ళవచ్చు."

రావ్ చెప్పి చెప్పటంతోనే ఆనంద్ ఫియట్‌లోకి దూకి స్టార్ట్ చేశాడు.

కారు ఆర్కాట్ రోడ్ మీదికి ఎక్కి వేగాన్ని అందు కుంది.

ఆనంద్ ఆలోచనలు పరవళ్ళు తొక్కుతున్నాయి. తనకు ముందే ఈ విషయం తెలిసినట్లయితే కేసు యింతవరకూ సాగేదికాదు! అసలు కీలకాన్ని అక్కడే పెట్టుకొని మిగతాచోట్ల వెదికితే ఏం ప్రయోజనం?

రాస్కెల్! మోహన్‌దాస్‌గాడు ఇంత నటుడనుకో లేదు. తనకు ఎలాగు ఈ టెక్నిక్ అర్థంకాదని బోల్తా కొట్టించాడు. ఆనంద్ మెదడులో లాబ్ థియేటర్ ఫైల్ లోని పేపరు రెపరెపలాడుతోంది. రావ్ చెప్పినలెక్కన ఐదువందల అడుగుల రష్‌ప్రింట్ థియేటర్‌లో చెక్ చేయ టానికి ఆరు నిమిషాలకంటే ఎక్కువసేపు పట్టదు. అదీ గాక, మోహన్‌దాస్ దానిని ఒకేఒకసారి చెక్ చేశానని చెప్పాడు. రిసీట్టులో ఇరవై నిమిషాలు ప్రొజెక్టరు రన్ అయినట్లుగా వుంది.

మోహన్‌దాస్ ఏదో ఉద్దేశంతో తనను తప్పుదారి పట్టించాడు. కనీసం దానిని మూడుసార్లు చూసివుంటాడు.

అపరేటర్ టైమ్ కరెక్టుగా వేయబట్టి ఇప్పటికైనా దొరికి పోయాడు.

కారును వేగంగా 'ఫాతిమా స్టూడియో'లోకి తిప్పాడు లాబ్ ముందు ఆగగానే లాబ్ వర్కర్ పరిగెత్తుకొచ్చాడు.

"మోహన్‌దాస్ ఎక్కడ?" కోపంగా అరిచాడు ఆనంద్.

"ఆయన అరగంట క్రితం ఇంటికెళ్ళారు. ఇంకో గంటలో వస్తారు," చెప్పాడు.

"అడ్రస్ తెలుసా?"

లాబ్ వర్కర్ గడగడ చెప్పాడు. ఆనంద్ దానిని నోట్ చేసుకుని కారుని వెనకకు మళ్ళించాడు.

ఇరవై అయిదు నిమిషాలలో మైలాపూర్ చేరుకున్నాడు. మోహన్‌దాస్ ఇల్లు చిన్నబంగళా! బంగళాకు— గేట్‌కుమధ్య పూలమొక్కలున్నాయి. గడ్డి అందంగా కత్తిరించబడివుంది. పూలచెట్లనడుమ సన్నటి వాటర్ పైప్స్ పడవేసి ఉన్నాయి. గడ్డిమధ్యగా బంగళాకు బాట వేసింది.

ఆనంద్ బంగళాముందున్న నాలుగు మెట్లుయెక్కి హాల్ లోపలికి చేరుకున్నాడు. ఆనంద్ చెప్పుల ధ్వని వింటూనే లోపలనుండి ఒక ముసలివ్యక్తి పరుగెత్తు కొచ్చాడు.

"అయ్యగారు ఎక్కడున్నారు?" అడిగాడు ఆనంద్ పరిశీలనగా చూస్తూ.

"పైన ఆఫీస్ రూంకు ప్రక్కగదిలో వున్నారు. వచ్చి పావుగంటకూడా కాలేదు" చెప్పాడు ముసలి నౌకరు.

చకచక మెట్లెక్కి పైకి చేరుకున్నాడు. కొంచెం

దూరంలో ఎడమచేతి ప్రక్క 'ఆఫీస్ రూం' బోర్డు కనబడు తోంది దాని ప్రక్కగది తలుపులు వేసివున్నాయి.

తలుపులమీద రెండుసార్లు టకటక కొట్టాడు. లోపల నుండి ఎటువంటి సమాధానమూ రాలేదు. మెల్లిగా తలుపులు తోశాడు. లోపల గదిలో ట్యూబ్ లైట్ ప్రకాశవంతంగా వెలుగుతోంది. డబుల్ కాట్ మీద మోహన్‌దాస్ పడుకునివున్నాడు. మొహం అటువైపు తిప్పివుంది.

నిశ్చింతంగా ఫోమ్ బెడ్ మీద పడున్న మోహన్‌దాస్‌ని చూడగానే ఆనంద్‌కు కోపం ముంచుకువచ్చింది. ఇడియట్! వీడివలన యిన్నాళ్ళు అనవసరంగా శ్రమపడ వలసివచ్చింది.

మెల్లిగా ఒక్కొక్క అడుగు వేస్తూ మంచం దగ్గరకు వెళ్ళి, దాస్ భుజాన్ని పట్టుకుని విసురుగా ఇటుప్రక్కకు తిప్పాడు. అంతే! ఆనంద్ షాక్ తిన్నాడు.

దాస్ గుండెల్లో దిగి, అతని ప్రాణాల్ని తీసిన బాకును చూస్తూనే నిశ్చేష్టుడైపోయాడు డిటెక్టివ్ ఆనంద్.

ఐదునిమిషాల తర్వాత ఆనంద్ తేరుకున్నాడు. గబ గబ రూమ్ తలుపులు దగ్గరగా వేశాడు. గదంతా వెద కటం ప్రారంభించాడు.

ఐదు నిముషాలు గడిచిపోయాయి. కనీసం దాస్ డైరీ కూడా దొరకలేదు. మొహమంతా చెమటలు పట్టేసాయి. విండో కర్టెన్‌తో ఒకసారి మొహం తుడుచుకుని, మోహన్‌దాస్ వేపు చూశాడు. ఎందుకనో దాస్ తనని క్రోధంగా చూస్తున్నట్లనిపించింది.

గాఢంగా నిట్టూర్చి ఆనంద్ గదిబయటకు వచ్చాడు.

తలుపు దగ్గరగా వేసి, క్రిందకుదిగాడు. నౌకరు ఎదురయ్యాడు.

ఆనంద్ పర్సులోనుండి ఐదురూపాయల నోటు నౌకరుకు అందించి, "అయ్యగారు కోపంగా వున్నారు. ఇప్పుడే పైకివెళ్ళకు!" అన్నాడు.

నౌకరు బిక్క మొహం పెట్టాడు.

"అదిసరేగాని ఇంతకుముందు ఎవరైనా వచ్చి వెళ్ళారా?"

"ముగ్గురు వచ్చారు. కొంచెంసేపు అయ్యగారితో మాట్లాడి వెళ్ళిపోయారు."

"ఎలా ఉంటారు?"

నౌకరు తనకు తెలిసిన విధంగా వర్ణించిచెప్పాడు. అతని వర్ణనునుబట్టి ఆ వ్యక్తులు ఎవరైనదీ తెలియలేదు ఆనంద్‌కు.

ఆనంద్ ఇంటికి చేరుకునే సరికి మధ్యాహ్నం ఒకటిన్నర అయింది.

ఆఫీస్‌బోయ్ గోపి ఆఫీస్‌రూంలో కూర్చుని యేదో నవల చదువుకుంటున్నాడు. ఆనంద్‌ని చూస్తూనే లేచి నిల్చున్నాడు. అంతలో రవి వచ్చాడు అక్కడికి.

"సార్! ఫోటోప్రింట్స్ దాని నెగటివ్ తెచ్చాను" చెప్పి పెద్ద కవర్‌ని ఆనంద్ చేతికిచ్చాడు.

ఆనంద్ సిగరెట్ వెలిగించి, ఫోటోలను టేబిల్ మీద పెట్టి పరీక్షగా చూశాడు.

అది ఒక సుందరమైన దృశ్యం! దూరాన ఏవో చెట్లు దానిప్రక్కనే పెద్దచెరువు, చెట్లగుంపులు వెనకగాకొండ ఆ కొండమీద మేఘాల గుంపులు ఎవరోగొప్ప చిత్ర

కారుడు చిత్రించిన మనోహర చిత్రం లాగుంది. మూడు ఫోటోలలోనూ అదే దృశ్యం!

దాదాపు అరగంటసేపు పరీక్షగా చూసిన ఆనంద్‌కి ఏదో కనపడింది. లెన్స్‌తో చాలాసేపు చూసి తనలోనే ఏదో గొణుక్కున్నాడు. రవి ఆశ్చర్యంగా ఆనంద్ వేపే చూస్తున్నాడు. ఆనంద్ తల పంకించి, రవికి లెన్స్ ఇచ్చి చూడమన్నాడు. రవి అతి కష్టంమీద దాన్ని చూడగలిగాడు.

"ఇదెలా సాధ్యం?" రవి ఆశ్చర్యంగా అడిగాడు.

"రవీ! ఇదేమీ పెద్ద వింతకాదు! ముందుముందు మనం చూడబోయే వింతలకు నాందీ మాత్రమే! సరే! కుమార్ ఇంకా రాలేదా?"

## 7

చలిగాలి రివ్వున వీస్తోంది.

ఆనంద్ కారుదిగి చుట్టుపక్కల పరికించాడు.

కనుచూపు మేరలో అంతా సరుగుడు తోటలు! మేఘాలలోనుండి దూసుకొస్తున్న చంద్రుడి కిరణాలు మసక వెలుతురును ప్రసాదిస్తున్నాయి.

సరుగుడు తోటల్లోనుండి సీటిమీదుగా వీస్తున్న గాలి కెరటాలు చల్లగామారి రావడమేకాక, ఏవో వింతధ్వనులను కూడా మోసుకొస్తున్నాయి. విశాలంగా వున్న చెరువు క్రమంగా చిన్నదై సరుగుడు తోటల్లో కలిసిపోయింది.

"ఇక్కడే దిగిపోదాం" అన్నాడు ఆనంద్.

కారులోనుండి రవి, గోపి, గోఖలే ముగ్గురూదిగారు. గోఖలే ఆనంద్‌కు మరో అసిస్టెంటులాంటివాడు.

"మనం శత్రువులతో కంటె ముందు ఈ చలిగాలితో యుద్ధంచేయాల్సి వస్తోంది" అన్నాడు గోఖలే హుషారుగా.

అందరూ చిన్నగా నవ్వారు.

"మీ ప్లాన్ ఏమిటి?" రవి అడిగాడు.

ఆనంద్ చెప్పసాగాడు.

"ఈ వంద యెకరాల సరుగుడు తోటల్లోపల మనం వెతుకుతున్న స్థావరం వుండివుండాలి! మెయిన్ రోడ్ మీదుగా వెళ్ళాలంటే తోట గేట్ దాటి వెళ్ళాలి! అదీ గాక ఎవరయినా కాపలా ఉండివుండవచ్చు! కాబట్టి మనం ఈ చెరువులో దిగి ఈదుకుంటూ సులభంగా తోటల మధ్య భాగానికి చేరుకోవచ్చు! మనం చాలా లోపలకు వెళ్ళిన తరువాత ఎవరయినాగాని ఆ చెట్లమధ్య పట్టుకోవడం చాలా కష్టం! ఆ తరువాత మనం డాక్కుని వెదకడానికి వీలుగా వుంటుంది.

"ఇప్పుడు టైమ్ పదకొండుగంటల పదినిమిషాలు అవుతోంది. మనం పావుగంటలో చెరువుని ఈది ఆ ప్రాంతాలకు చేరుకోవాలి! సరిగ్గా పన్నెండున్నరకు ఇన్ స్పెక్టర్ చంద్రశేఖర్ మనం పంపించిన లెటర్ చదివి, తన బలగంతో ఇక్కడకి చేరుకుంటాడు. మనం యిచ్చిన పథకాన్ని అతను అమలు జరిపినట్లయితే తెల్లవారే లోపుగా ఈ కేసు ముగిసిపోతుంది" చెప్పాడు ఆనంద్.

"అయితే మనం ఇక బయలుదేరుదాం!" ఉత్సాహంగా అన్నాడు గోఖలే.

ఆనంద్ తలూపి డిక్కీలో నుండి నిండుగా గాలి

కొట్టబడిన రెండు పెద్దట్యూబ్‌లను బయటకు తీసాడు. ఒక ట్యూబ్‌కు అడుగున అందులో ఏవైనా వస్తువులు పెట్టుకునే విధంగా రబ్బరు అతికించబడివుంది. ఇంకొక ట్యూబ్ మధ్యలో ఖాళీగా మామూలుగానే వున్నది. అందరూ పైన డ్రెస్‌విప్పి రబ్బరు అతికించబడిన ట్యూబ్ మీద పెట్టారు. ఎవరి ఒంటిమీద కూడా అండర్ వేర్, బనియన్ తప్పితే ఏమీ లేవు! ఆనంద్ చిన్న చెక్క పెట్టెలో రివాల్వర్స్ నాలుగు చిన్నసైజు కత్తులు వేసి, దానిని కూడా ట్యూబ్ మీద పెట్టాడు.

తరువాత నలుగురూ ట్యూబ్‌లను మోసుకుంటూ రోడ్ మీద నుండి ఒడ్డుకు దిగి, ట్యూబ్‌లను నీళ్ళల్లో వదిలారు.

"ఎవరైనా అలసిపోయినట్లయితే రెండవ ట్యూబ్ సహాయంతో ఈదుకుంటూరండి!" చెప్పి మెల్లిగా నీళ్ళలోకి జారాడు ఆనంద్. వరుసగా అందరూ నీళ్ళలోకి జారి ఈదడం ప్రారంభించారు. చల్లటినీళ్ళు నగ్న శరీరాలకు తగిలి ప్రాణాలను జివ్వున లాగుతున్నాయి. దానికితోడు నీటిమీదుగా పరుగెత్తుకొచ్చే గాలి కెరటాలు వాళ్ళ శరీరబాధను రెట్టింపు చేస్తున్నాయి.

ఆనంద్ ఒక చేత్తో లోడ్ చేసిన ట్యూబ్‌ను తోస్తూ ఈదుతున్నాడు. ఇంకో ట్యూబ్‌ను మిగతా ముగ్గురూ మార్చిమార్చి తోసుకుంటూపోతున్నారు.

ఆ నిశీథిలో గాలిహోరుతోపాటు, నలుగురు మనుష్యులు ఒక్కసారి ఈదుకుంటూపోతున్న శబ్దం కలిసిపోయి వింతధ్వనిగా మారుతోంది.

చెరువు ఇరుప్రక్కలానున్న సరుగుడు చెట్లు ఈల

వేస్తూ భయాన్ని కలిగిస్తున్నాయి. నీటి కెరటాలు ఒడ్డుకు తగిలి శబ్దం చేస్తూ తమ శక్తిని కోల్పోతున్నాయి.

"గోఖలే! నువ్వు మరోప్రక్కగా వెళ్ళకు! ఆ నాచు ముళ్ళపొదలలో చిక్కుకుంటే బయటపడటం కష్టం! నీటిపాములు వుండవచ్చు" మళ్ళీ మధ్యలో బలంగా ఊపిరిపీలుస్తూ చెప్పాడు ఆనంద్.

నలుగురూ చాకచక్యంగా ముళ్ళపొదలను తప్పించుకుంటూ ఈదుతున్నారు.

మరో పదినిమిషాలు గడిచాయి.

"ఇక ఒడ్డుచేరుకుందాం!" అన్నాడు ఆనంద్.

నలుగురూ ఒడ్డుకేసి ఈదసాగారు. మూడునిముషాలలో ఒడ్డును చేరుకుని, రెండు ట్యూబ్స్‌ను పైకిలాగారు. ఐదు నిముషాలు అక్కడ కూర్చున్నారు. గాలి హోరుగా వీస్తూండటంవలన శరీరాలు ఆరిపోయాయి.

అందరూ డ్రెస్ చేసుకున్నారు. ఆనంద్ ట్యూబ్స్‌ను చెట్లలోకి లాగాడు. రివాల్వర్‌ని జేబులో పెట్టుకుని, ముగ్గురికీ కత్తులను ఇచ్చాడు. టార్చిలైట్ తీసుకున్నాడు. గోఖలే చెక్కపెట్టెను అందుకున్నాను. నలుగురూ శరీరాల్ని విదిలించుకుని బయలుదేరారు.

"ఎవరూ చెట్లమీద చేతులు వేయవద్దు!" హెచ్చరించాడు ఆనంద్.

గోపీ ముందునడుస్తూ లైట్‌ను చుట్టుప్రక్కలతిప్పుతూ జాగ్రత్తగా గమనిస్తున్నాడు. మిగతా ముగ్గురూ అతన్ని అనుసరిస్తున్నారు. ఎంత జాగ్రత్తగా నడుస్తున్నా కాళ్ళకు ముళ్ళు గీసుకుంటున్నాయి. తోటలోపల చంద్రుడి వెలుతురు అంతగా పడటంలేదు. అందరూ మౌనంగా నడుస్తున్నారు.

కొంచెంసేపు నడిచిన తరువాత గోపి టక్కున ఆగి పోయాడు. ఐదు అడుగుల దూరాన చెట్టుకు చుట్టుకుని ఉందొక పాము.

"ప్రక్కగా రండి!" మెల్లిగా గొణిగాడు గోపి.

గోపిమాట వింటూనే పడగ విప్పింది నల్లత్రాచు.

ఆనంద్ జేబులోనుండి రివాల్వర్ తీసాడు.

"రవీ! రెండడుగులు ముందుకువేసి లైట్ ఫోకస్ దాని మొహంమీద పడేట్టువేయి" చెప్పి, చెక్కపెట్టె అందుకుని సైలెన్సర్ బిగించాడు. త్రాచు ఎటూకదలలేక కోపంగా బుసలు కొడుతోంది.

ఆనంద్, సరిగ్గా దాని పడగకేసి గురిచూసి ట్రిగ్గర్ నొక్కాడు. ఠప్‌మని క్రిందికి జారిపోయింది త్రాచు! నలుగురూ చెమటలను తుడుచుకుంటూ తిరిగి నడక మొదలు పెట్టారు. వాళ్ళకు ప్రక్కవైపునుండ దూరంగా ఎక్కడో కుక్కలు అరుస్తున్నాయి.

"ఆగండి!" హఠాత్‌గా చిన్నగా అరిచాడు ఆనంద్. ముగ్గురూ ఆగి ఆనంద్ వేపు ప్రశ్నార్థకంగా చూశారు.

ఆనంద్ కుడిచేతి ప్రక్కగా చేత్తో చూపించాడు.

దూరాన ఎత్తుగా ఏదోలైట్ చిన్నదిగా కనబడుతుంది నలుగురూ ఉత్సాహంగా అటుకేసి నడవడం మొదలు పెట్టారు. ముందు నడుస్తున్న గోపి ఆగిపోయి, యేదో అడగబోతున్న కుమార్‌ను మాట్లాడవద్దని సైగచేసి, చెవులు రిక్కించాడు. చెట్లమధ్యనుండి రాసుకుంటూ వేగంగా వస్తూన్నగాలి హోరులో ఏవో మాటలు లీలగా వినబడుతున్నాయి.

నలుగురూ అటుకేసి వేగంగా నడవసాగారు. కొంత

దూరంలో వారికి కొన్ని ఆకారాలు కనిపించాయి. వాళ్ళలో ఒకతను ఒంగుని ఏదో చేస్తున్నాడు.

కొంచెం ఎత్తయిన ముళ్ళపొదలు ఆప్రదేశమంతా వుండడంవలన అతను ఏంచేస్తున్నాడో సరిగ్గా కనపడటం లేదు. రెండు నిమిషాలలో ఆ ఆకారాలు పూర్తిగా అదృశ్యమయ్యాయి.

ఇంకో ఐదు నిముషాలు అలాగే కూర్చుండిపోయారు అందరూ. మళ్ళీ ఆ ఆకారాలు కనబడలేదు. మెల్లిగా లేచి ఆ ప్రదేశం చేరుకుని అతి జాగ్రత్తగా పరిశీలించారు.

# 8

ఆనంద్ టార్చితో ఆ ప్రదేశాన్ని పదినిమిషాలసేపు ప్రతి అంగుళం విడవకుండా వెదికాడు. భూమిలో ఒక చోట వంకరగా పగులు కనబడింది.

చేత్తో ఆప్రదేశంలో మట్టి పక్కలకుతోసి, తడిమి చూశాడు. గట్టిగా చెక్కలా తగిలింది. టార్చి గోపి చేతికిచ్చి అతని చేతిలోని నైఫ్‌ని తీసుకుని, పగులుమధ్య పెట్టి పైకెత్తాడు. మట్టి కప్పబడివున్న చెక్క పైకిలేచింది గోపికూడా సహాయం చేశాడు. ఇద్దరూ కలిసి చెక్కను తోసి ప్రక్కన పడేసారు. లోపలకు చిన్న నిచ్చెన వుంది. ఆనంద్ లైట్ లోపలకు వేశాడు. దాదాపు పది అడుగులక్రింద ఏదో తలుపు ఉంది.

అండర్ గ్రౌండ్!

ఆ నలుగురి ఆశ్చర్యానికి అంతులేదు. తామేదో అనుకున్నారు. ఈ అడవిలాంటి ప్రదేశంలో ఇంత డబ్బుఖర్చు పెట్టి అండర్ గ్రౌండ్ ఏర్పాటు చేశారంటే ఇంతకంటే ఎన్నో రెట్లు లాభం ఉంటేగాని ఇంత కష్టపడరు! దీని

వెనుక ఏదో భయంకరమైన నిజం వుంది.

ఆనంద్ ఒకసారి అందరినీ హెచ్చరించాడు.

ముందుగా ఆనంద్ లోపలకు దిగాడు. అతని చేతి లోని రివాల్వర్ ఏ క్షణంలోనయినా నిప్పులు కక్కడా నికి సిద్ధంగా ఉంది.

ఆనంద్ ఆఖరిమెట్టుకూడా దిగి, తలుపును ముని వేళ్ళతో తోసాడు. కదలలేదు. అప్పుడు గ్రహించాడు అది ఇనుప తలుపని! అరిచేతితో కొంచెం బలం ఉపయో గించి తోసాడు. మెల్లిగా తెరుచుకుంది.

అందరూ ఆత్రుతగా పైనుండి చూస్తున్నారు. రవి నిచ్చెన పైమెట్టు మీదనుండి క్రిందకు దూకడానికి సిద్ధంగా వున్నాడు.

తలుపు పూర్తిగా తెరుచుకోక ముందే ఆ సందులో నుండి మెషిన్‌గన్ బారల్ బయటకు తొంగిచూసింది. ఆనంద్ చప్పున క్రిందకు వంగుని ఆ బారల్ వచ్చిన దిక్కును ఊహించి, చేతిని లోపలకు పోనిచ్చి ట్రిగ్గర్ నొక్కాడు. చిన్నగా మూలుగు, దానితోపాటు మెషిన్ గన్ బారల్ క్రిందకు ఒరిగిపోయింది.

ఆనంద్ రెండునిమిషాలు అలాగే కూర్చుండిపోయాడు. లోపలనుండి వినిపిస్తున్న మూలుగు ఆగిపోయింది. ఆనంద్ అందర్నీ దిగమని సైగచేసి, తలుపును బలంగాతోశాడు.

అదొక సన్నటిసందు. సందు కిరువైపులా సిమెంట్‌తో ప్లాస్టింగ్ చేయబడ్డ నున్నటి గోడలు! వాటికి వేయబడిన తెల్లటి సున్నం ట్యూబ్‌లైట్ కిరణాలకు మరింత తెల్లగా మెరుస్తోంది.

ఆనంద్ కాలితో క్రిందపడిన సెంట్రీ మొహాన్ని అటు

యిటూ కదిపి చూశాడు. అతని ఛాతీ నిశ్చలంగావుంది. దెబ్బ రెండుతొడల మధ్యన తగిలినట్లుంది. కిక్కురుమన కుండా ప్రాణం పోయింది.

ఆనంద్ తన చేతిలోని సైలెన్సర్ రివాల్వర్‌ని రవిచేతి కిచ్చి, కింద పడిన మెషిన్‌గన్ అందుకుని, తలుపుయధా ప్రకారం మూసేసి, అది తెరుచుకోకుండా సెంట్రి శవాన్ని అడ్డుగా పెట్టి ముందుకు సాగాడు.

అది దాదాపు ఇరవై అయిదు అడుగుల సన్నటిసొరంగ మార్గం! మార్గానికిపైన పది అడుగులకొక మినిట్యూర్ లైట్ వెలుగుతోంది. మార్గం చివర ఎడమవైపుగా ఒకటి కుడివైపుగా ఒకటి మార్గాలు విడిపోతున్నాయి.

నలుగురూ శబ్దం కాకుండా, అతి జాగ్రత్తగా ఊపిరి పీలుస్తూ ఆ కూడలిని చేరుకున్నారు. నోరుతెరచి యేదో అడగబోయిన రవినోటిని మూసేసాడు ఆనంద్. కుడి చేతిప్రక్కగా యెవరో వస్తున్నట్లు బూట్స్‌సౌండ్! ఆనంద్ అందర్నీ తన వెనకగా నిలబడమని చేయి ఊపి, మెల్లిగా తిరిగిచూశాడు.

ఇంకొక సెంట్రీ లైటర్‌తో సిగరెట్ వెలిగించుకుంటూ మెల్లిగా వస్తున్నాడు. ఆనంద్ మెషిన్‌గన్ పొజిషన్ లోనే పట్టుకుని, అంతలోనే యేదో ఆలోచనలో చప్పున రవి చేతిలోని రివాల్వర్ లాగాడు. ఆ సరికే సెంట్రి కూడ లిన చేరుకున్నాడు.

ఊహించని విధంగా అక్కడెవరో అపరిచితులుండ టంతో అతని కళ్ళు ఆశ్చర్యంగా విప్పారాయి. ఆనంద్ చేతిలోని రివాల్వర్ అతని మొహంలోని ఆ భావాన్ని అలాగే శాశ్వతం జేసేసింది. ఆనంద్ రివాల్వర్ పేలు

స్తూండగానే గోపి చటుక్కున ముందుకుదూకి, సెంట్రీ చావుకేక వేయకుండా నోరు మూసేశాడు. సెంట్రీ మెడకు తగిలించివున్న మెషిన్ గన్‌ను గోఖలే తీసుకున్నాడు.

"రవీ! నువ్వు ఎడమచేతి పక్కగా వెళ్ళిచూడు. గోపి ఇక్కడే కాపలా కాస్తుంటాడు. గోఖలేని కూడా నువ్వు సహాయంగా తీసుకెళ్ళు. నువ్వు వెళ్ళినవైపు విశేషం యేమీ లేనట్లయితే, నేను వెళ్ళిన దిక్కుగా రండి! గోపిమాత్రం ఇక్కడేవుండి ఎవరూ బయటకు పోకుండా కాపలా కాస్తుంటాడు" మంద స్వరంలో చెప్పాడు ఆనంద్.

రవి, గోఖలే ఆనంద్ చూపించిన దిక్కుగా బయలుదేరారు. ఆనంద్ కుడిచేతివేపు నడవడం మొదలుపెట్టాడు గోపి రెండో సెంట్రి శవాన్ని తలుపు దగ్గరకు లాక్కెళ్ళి మొదటి శవం పక్కగా పడుకోబెట్టి, తిరిగివచ్చి, తన స్థానంలో నిలబడ్డాడు.

# 9

ఆనంద్ కొంచెందూరం నడిచాడు. ఇంకో పది అడుగులలో సొరంగమార్గం కుడిచేతివైపుకు మలుపు తిరుగుతోంది. ఆనంద్ మెల్లిగా అడుగులువేస్తూ, గోడదగ్గరకు చేరుకుని మలుపులో తొంగిచూశాడు.

పదిహేను అడుగుల దూరంలో గ్రీన్ కలర్ డోర్ కనబడుతోంది!

మెల్లిగా అక్కడకు చేరుకుని డోర్‌ని తోశాడు' శబ్దంకాకుండా తెరుచుకుంది. అతని గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. మెషిన్‌గన్ గట్టిగా పట్టుకొని లోపలకు ప్రవేశించాడు.

అదొక పెద్దహాలు! దాదాపు మినీథియేటర్ వైశాల్యం కలిగివున్న ఆ హాలులో మధ్యగా పొడవాటి టేబిల్! దానిమీద వరుసగా చిన్నచిన్న షోకేస్‌లు ఉన్నాయి. వాటిల్లో...ఏమున్నదీ సరిగ్గా కనపడటంలేదు.

చుట్టుపక్కలా గోడలకు పెద్దపెద్ద ఫోటోలు, వాటికి మధ్యలో తైలవర్ణ చిత్రాలు తగిలించబడి ఉన్నాయి. హాలుకు నలుమూలలా ఎర్రటి హైపవర్ బల్బ్స్ వెలుగుతున్నాయి.

ఆనంద్ మొహంలో సంభ్రమాశ్చర్యాలు చోటుచేసుకున్నాయి. మనసు యేదో కీడును శంకిస్తోంది. స్వేద బిందువులు మొహం మీదనుండి, ఛాతీ మీదనుండి కారుతూ, నడుం దగ్గర ప్యాంట్‌ను తడుపుతున్నాయి.

తలుపును పూర్తిగా మూసేసి షోకేస్‌ల దగ్గరకు నడిచాడు. హాలు మొత్తం రెడ్ లైట్స్‌తో 'డేంజర్' అనేట్లుగా, నిప్పుల కొలిమిలా వెలిగిపోతుంది. వాటి ప్రకాశానికి ఆనంద్ శరీరం రక్తవర్ణంలోకి మారింది. అతని శరీరంమీద కారుతున్న స్వేద బిందువులు రక్తబిందువులుగా భ్రమ కలిగిస్తున్నాయి.

ఆనంద్ మొదటి షోకేస్ దగ్గరకు వచ్చాడు. దాని నిండుగా యేదో రసాయినిక ద్రవం ఉంది. ద్రవంలో...

ఆనంద్ ఉలిక్కిపడ్డాడు. కళ్ళు చిట్లించి చూశాడు నిజంగా నేనా?!

ద్రవంలో యేడాది వయసు పాప నిదురబోతూ ఉంది. రక్తపు ముద్దను మానవాకారంగా మలచినట్లుందా నిర్జీవ శరీరం!

ఆనంద్ ఆలోచిస్తూ రెండో కేస్ దగ్గరకు వచ్చాడు.

అందులో మూడేళ్ళ పసివాడి శరీరం! కాళ్ళూ చేతులు సన్నగా ఉన్నాయి. పోలియోవ్యాధి! ఇంకొకదాని దగ్గరకి వెళ్ళాడు. దానిలో ఆరేళ్ళపాప శరీరం!! శరీరమంతా పుళ్ళు! కాలు ఒకటి సన్నగా వంకరగా ఉంది. పొట్ట యెత్తుగా ఉబ్బివుంది!

ఆ టేబిల్ మీద మొత్తం పదమూడు షోకేస్‌లున్నాయి యేడాది వయసునుండి అరవైయేళ్ళ వయసువరకు గల మానవ నిర్జీవ శరీరాలు! ప్రతి శరీరంలోను యేదోవొక లోపం కనబడుతోంది. యేదోవొక వ్యాధి సోకినట్లుగా ప్రత్యక్షంగా తెలుస్తోంది. కొన్ని శరీరాలు అంతటి ఎరుపు కాంతిలో కూడా నల్లగా మసిపూసినట్లు కనబడుతున్నాయి.

ఒక్కొదాన్ని చూస్తున్నకొద్ది ఆనంద్ మెదడు మొద్దుబారిపోతోంది. షోకేస్‌లో శవాలు ప్రాణాలు పోయి కూడా ఆనంద్‌కు యేదో రహస్యం మూగగా చెబుతున్నాయి. ఆనంద్ వాటి మూగభాష అర్థం చేసుకోలేక సతమత మవుతున్నాడు.

గోడలకు తగిలించబడిన ఫోటోలను, తైలవర్ణ చిత్రాలను నిశితంగా పరిశీలించిన ఆనంద్‌కు ఆ మూగభాష అర్థం యేమిటో తెలిసిపోయింది.

ఆనంద్ ఒక్కసారిగా కంపించిపోయాడు. అతని నరనరంలోనూ భయం, ఆవేశం రక్తంతో కలసి ప్రవహిస్తున్నాయి. అతని శరీరం టైఫాయిడ్‌కు గురయిన దానిలా వొణికిపోతుంది. రక్తం వేగంగా ప్రవహిస్తూ, అతని మెదడులోకి తంతోంది. అతనిలోని ఆవేశం కళ్ళద్వారా చెవులద్వారా వేడి సెగలుగా వెలువడుతోంది.

ఆ నరరూప రాక్షసులను కండలు కండలుగా నరికితే గానీ తన ఆత్మ శాంతించదు. వాళ్ళందర్నీ సజీవదహనం చేయాలి! వాళ్ళను ఈలోకంలో జీవింప చేసినట్లయితే రోజుకు వందలమంది ప్రాణాలను చిత్రవధ జేస్తారు. ఆ విలువైన కోట్లువెనుక, ఇంపాలాకార్లు వెనుక యింత భయంకర క్రీడలు నాట్యమాడుతున్నాయని యెంతమంది అమాయక ప్రజలు గ్రహించగలరు?

క్రూరమృగాల బారిన వొకరిద్దరు పడతారు. కానీ ఈ రాక్షసుల బారినపడి మొత్తం మానవజాతే అంతులేని, ఊహించలేని అతిబాధలకు గురయ్యే ప్రమాదం ఉంది! ఈ రాత్రికి వాళ్ళ అంతుచూడందే తను ప్రాణాలతో యెవ్వరి మొహం చూడకూడదు! దృఢంగా నిశ్చయించుకున్నాడు ఆనంద్.

అతని ఒళ్ళంతా చెమటలు పట్టేశాయి. చుట్టు పక్కలా మరోసారి పరికించి చూశాడు. హాలుకు మరొక వైపు రెడ్ కలర్ డోర్ ఉంది!

ఆనంద్ అటువేపు నడచి, డోర్ నితోశాడు. మెల్లిగా తెరచుకుంది. లోపలనుండి గంభీరంగా ఇంగ్లీషులో ఉపన్యాసిస్తున్న స్వరం ఒకటి వినబడుతోంది. ఇదేనన్నమాట రహాస్యపు సమావేశం! ఆనంద్ కు ఆ స్వరాన్ని ఇంతకు ముందు ఎక్కడో విన్నట్లు అనుమానం వేసింది.

నిమిషంపాటు లోపలికి వెడదామా, వద్దా అనే సంశయంతో అక్కడే నిలబడి పోయాడు.

గదిలో వినిపిస్తున్న ఉపన్యాసం ఆగిపోయింది.

ఆనంద్ చెవులు రిక్కించాడు.

"కమిన్ మిస్టర్ ఆనంద్! వెనక్కు తిరిగిపోవాలని

ప్రయత్నించావో నీ శవంకూడా ఆ షోకేస్‌లో స్థానం చేసుకుంటుంది, మర్యాదగా మెషిన్‌గన్ డోర్ దగ్గరే వదిలేసి లోపలకురా!'' గంభీరంగా వినిపించింది గదిలో నుండి.

ఆనంద్ ఒక్క క్షణం ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

తన ఉనికిని ఎలా తెలుసుకో గలిగాడు? తనను చూడకుండానే గన్ ఉన్న సంగతికూడా పసికట్టాడు. ఇది ఎలా సాధ్యం?

ఆలోచిస్తున్న ఆనంద్ వీపుకు యేదో చల్లగా తగిలింది. అదేమిటో అరక్షణంలో గ్రహించాడు ఆనంద్. మెషిన్ గన్ బారల్! అంటే తనవెనుక రెడీగానే ఉన్నారన్న మాట! ఆ ఉన్నవ్యక్తి సొరంగ మార్గంలోనుండి వచ్చిన వాడై ఉండటానికి వీల్లేదు. ఖచ్చితంగా ఈ రూమ్‌లోనే ఉండి ఉంటాడు. అతనికి ఆ అవకాశం యెక్కడుంది? బహుశా టేబిల్ క్రింద దాక్కొని ఉండి ఉండాలి!

''మిస్టర్ ఆనంద్! డోంట్ వేస్ట్ అవర్ టైమ్! ప్లీజ్ కమిన్ క్విక్!'' అధికారంగా వినిపించిందా స్వరం.

ఆమాట వింటూనే ఆనంద్‌లోని రోషం బుసకొట్టింది.

కాలితో డోర్‌ని బలంగా తన్నాడు. అంత బరువు గల ఇనుప తలుపు విసురుగా వెనక్కి వెళ్ళి గోడకు కొట్టుకుంది.

లోపలకు ప్రవేశించాడు.

# 10

అదొక పెద్దగది! గదిమధ్యలో పెద్ద టేబిల్! టేబిల్ మీద ఫ్లవర్ వేజ్‌లు. వాటిల్లో రకరకాల అందమైన పుష్ప గుచ్ఛాలు. వాటి వెనుకగా టెలివిజన్ సెట్స్!

టేబిల్ కి ఇటువైపున కుర్చీలో ఎవరో దృఢకాయుడు కూర్చుని వున్నాడు. అతని మొహం టెలివిజన్ సెట్స్ వైపుంది. అతని వెనుక భాగం ఆనంద్ వేపు వుండటం వలన అతను ఎవరయినదీ పోల్చుకోలేక పోతున్నాడు. అతని నోటిలో పైపు నిర్లక్ష్యంగా పొగలు చిమ్ముతోంది.

టేబిల్ కు ఇరు ప్రక్కలా చిన్నచిన్న టేబుల్స్ ఉన్నాయి. వాటి వెనుకవున్న కుర్చీలలోని వ్యక్తులలో కొందరు ఇతర రాష్ట్రాలవారు, కొందరు విదేశీయులు.

అందరిముందు టేబిల్స్ మీద విస్కీ బాటిల్స్, వాటి పక్కనే ప్లేట్స్ లో ఏవో పదార్థాలు ఉన్నాయి. ఒక్క బాస్ తప్ప అందరూ ఆనంద్ నే చూస్తున్నారు.

ఆనంద్ గన్ ని ఒకమూలగా విసిరి, చుట్టు గమనిస్తూ ఒక్కొక్క అడుగేస్తూ బాస్ ని సమీపించాడు. ఆనంద్ కదలగానే ఇనుప తలుపు దబ్ మని మూసుకు పోయింది.

రివాల్వింగ్ ఛేర్ ఇటు తిరిగింది. మందహాసం చేస్తున్న బాస్ ని చూడగానే ఆనంద్ ఉలిక్కిపడ్డాడు.

"నువ్వా?..." ఆశ్చర్యం, ఆవేశం మిళితమైన స్వరంతో అరిచాడు ఆనంద్.

"యస్! అనవసరంగా ఆవేశపడకు! బి. పి. రావడానికి ఆస్కారముంది. శాంతంగానే ఏ పనయినా చక్కబెట్టాలి" అంటూ, మిగతావాళ్ళ వేపు తిరిగి, "ఇతని పేరు ఆనంద్! ఇది వరకు యస్. బి. ఐ. లో పనిచేశాడు ఇప్పుడు ప్రయివేటుగా కేస్ లు టేకప్ చేసుకుంటున్నాడు. ఇతనికి ఇప్పటికీ ఆ శాఖతో సంబంధం వుందని నా అనుమానం!" ఆనంద్ ని పరిచయం చేశాడు యింగ్లీషులో.

"కమాన్ ఆనంద్! ఇలా నా ప్రక్కన కూర్చోండి!" బాస్ ఆహ్వానించాడు. ఆనంద్ బాస్ పక్కనున్న కుర్చీ ఇవతలకి లాగికూర్చున్నాడు. బాస్ అతనికికూడా కొంచెం విస్కీ పోసి, గ్లాస్ ఆనంద్ ముందుకు తోసాడు. ఆనంద్ సంకోచంగా గ్లాస్‌లోని విస్కీని రెండు గుటకలు వేసాడు.

గొంతులోనుండి వెచ్చగా లోపలకు దిగిన విస్కీ అలసిపోయిన శరీరానికి మనస్సుకి మత్తునిస్తూ ఆహ్లాదపరుస్తోంది. జేబులోనుండి సిగరెట్ ప్యాకెట్, లైటర్ తీసి సిగరెట్ అంటించాడు.

అందరూ ఆనంద్‌ని, బాస్‌ని మార్చి మార్చి చూస్తున్నారు.

బాస్ గొంతు సవరించుకుని ఇంగ్లీషులో ఉపన్యాసం మొదలుపెట్టాడు. టి. వి. సెట్స్ ప్రక్కగా పెద్ద టేప్ రికార్డర్ ఆన్‌లో ఉండటం ఆనంద్ గమనించాడు. బాస్ ఉపన్యాసం ప్రవాహంలా సాగుతుంది.

"మైడియర్ పార్ట్‌నర్స్! మీ సలహా, సహాయాలతో నేను ఇండియాలో ఎంతో అభివృద్ధిని సాధించాను. నా పథకాలు చాలావరకు విజయవంతమవుతున్నాయి. మీరు ఇచ్చిన ప్రణాళిక ప్రకారం మొత్తం అన్ని నగరాలలోనూ ప్రొవిజన్ స్టోర్స్‌లు, మెడికల్ షాప్స్, ఫెర్టిలైజర్స్ ఏజన్సీలు నెలకొల్పాను. అన్నిటిలోనూ మన సొంతతయారీ సరుకు మూడువంతులు అమ్ముడుపోతుంది.

ముఖ్యంగా పెద్దపెద్ద హాస్పిటల్స్ ప్రక్కనే ఉన్న మన మెడికల్ షాపుల్లోని సరుకు బాగా పని చేస్తోంది. పోతే, మిఠాయిలకు వేసే రంగులలోకూడా మన ప్రయత్నం విజయవంతమయింది. ముఖ్యమైన సిమెంట్

స్టాకిస్ట్స్, ఆయిల్ మిల్ ఓనర్స్ మనచేతుల్లో కీలుబొమ్మ లయ్యారు.

పెద్ద పెద్ద కంపెనీల లేబిల్స్ సీల్స్ తయారు చేయ డంలో మనవాళ్ళు మంచి ప్రావీణ్యం సంపాదించారు. చంటి పిల్లలకు పోలియోడ్రాప్స్‌కు బదులుగా మనం తయారుచేసే స్లోపాయిజన్ సప్లయి అవుతుంది.

ఇకపోతే మొన్నీమధ్య మీరు తెచ్చిన మందులతో పంటలను సమూలంగా నాశనం చేయడానికి యెనలేని కృషి జరుగుతోంది. వాటిలోకూడా సక్సెస్ అయ్యే సమయం ఆసన్నమవుతోంది. మన తరువాత ప్రయత్నం బాటిల్స్‌లో పాలిథిన్ బ్యాగ్స్‌లో సరఫరా అవుతున్న పాలనుకూడా స్వాధీనం చేసుకోవడమే!''

బాస్ చెప్పడం ఆపి గ్లాసులోని విస్కీ రెండుగుట కలు వేసాడు.

విదేశీయులలో ఒకడు షార్టుహాండ్‌లో బాస్ ఉప న్యాసం నోట్ చేస్తున్నాడు.

''మిస్టర్! భూషణ్‌రావ్!... ఈ కల్తీ ప్రపంచాన్ని స్థాపించడంలో మీ ముఖ్యోద్దేశ మేమిటో?'' గంభీరంగా అడిగాడు ఆనంద్.

భూషణ్ ఎస్టేట్స్ ఓనరు అయిన భూషణ్‌రావ్ నవ్వాడు. పెద్దగా నవ్వాడు.

''ఈ కల్తీప్రపంచాన్ని నా స్వార్థంకోసం స్థాపించాను ఇది కేవలం నా ప్రయోగశాల మాత్రమే! మేం తయారు చేసే కల్తీమందులు, ఆహారపదార్థాలు కొంతమంది మీద ప్రయోగిస్తున్నాము. ఈ ప్రయోగాల వలన కల్తీడోసేజ్ సరిపోతుందా లేక ఇంకా కలపాలా అని నిర్ణయిస్తాము.

ఒక్కోసారి డోసేజ్ ఎక్కువై ఇమ్మిడియేట్ ఎఫెక్ట్ చూపడం వలన చస్తుంటారు. అలా చచ్చినవాళ్ళ శవాల్నే నువ్వు యిందాక షోకేస్‌లో చూశావు! వారిలో నీవు వెదికే సుందరం శవంకూడావుంది. నాలాంటి వృక్షాన్నుండి ఎన్నో బలమైన వేరులు ఈ సంఘంలో పాతుకు పోయి ఉన్నాయ్. వాటిని సమూలంగా పెకిలించడం నీలాంటి వ్యక్తుల వలన ఆయేపని కాదు.''

ఎంతో గర్వంగా చెప్పుకుంటూపోతున్న భూషణ్ రావ్ ఆనంద్ కళ్ళకు ద్రాక్ష్యలాలా కనబడుతున్నాడు.

''ఒకచిన్న అనుమానం...'' నోట్సు వ్రాస్తున్నతను అడిగాడు.

''ఏమిటి?'' అడిగాడు భూషణ్‌రావ్.

''నేను ఎన్నో ఇన్‌వెస్టిగేషన్స్ గురించి విన్నాను, చదివాను. చూసాను. కాని మిస్టర్ ఆనంద్ ఈ కేస్‌లో ఇంతవరకూ ఎలా రాగలిగారో ఊహించలేక పోతు న్నాను. ఆయనకు అభ్యంతరం లేకపోతే కొంచెం మా సందేహాలను తీర్చగలరు'' వినయంగా, నమ్రతగా అడిగా డతను.

ఆనంద్ ఒకనిముషం మౌనంగా ఉండిపోయాడు. అతనికళ్ళు టేప్‌రికార్డర్‌నే తీక్షణంగా చూస్తున్నాయి. అది తిరుగుతూనే వుంది. ఆనంద్ ఆలోచించాడు.

తన పరిశోధన వివరాలు చెప్పడం మంచిది. ఇప్పుడు చెబితేనే అవిగూడా టేప్ అవడానికి అవకాశముంది. తాను చంద్రశేఖర్ వచ్చేసరికి ప్రాణాలతో ఉండక పోవచ్చు. అతను ఎలాగూ వీళ్ళందర్నీ వదిలిపెట్టడు. ఈ కేస్ గురించి అతనికి స్టేట్‌మెంట్ తన శవం యివ్వ

లేదు. కాబట్టి వాళ్ళకు వివరాలు తెలియడానికి ఈ టేప్ రికార్డర్ చాలా ఉపయోగపడుతుంది.

ఈ నిశ్చయానికి వచ్చిన ఆనంద్ గ్లాసులో మిగిలివున్న విస్కీనికూడా గొంతులో పోసుకొని, మరో సిగరెట్ వెలిగించి, కళ్ళుమూసుకుని, కేసు మొదటినుండి సింహావలోకనం చేసుకుంటూ చెప్పడం ప్రారంభించాడు:

"మిస్టర్ రావ్ మొదట ఈ కేస్ గురించి చెప్పినప్పుడు చాలా చిన్న కేస్ అనుకున్నాను. నేను మోహన్‌దాస్‌ని కలుసుకున్నప్పుడు కూడా అతనిని అనుమానించ లేక పోయాను. బహుశా సుందరం బ్లాక్ మెయిల్ చేయడానికి ఈపని చేశాడా అనే అనుమానం కూడా రాక పోలేదు.

కానీ, సుందరం చేసిన తెలివయిన పని ఒకటివుంది. మీరు అతన్ని అవుట్ డోర్ నెగటివ్ తోసహా మాయం చేసి, ఇక్కడకు తీసుకురాగానే సుందరం, ఆ నెగటివ్‌ని బాగా పరీక్షించి దానిలో ఉన్న వింతను కనిపెట్టి సమయస్ఫూర్తిగా, ఆ నెగటివ్ లోనుండి మూడు ఫ్రేములు కట్ చేసి దాచుకుని లాబ్ లో మిగతా నెగటివ్స్ తీసుకెళ్ళడానికి ఆ ఫ్రేమ్స్‌ని మీ మనుష్యులు చూడకుండా అతని ఫ్రెండ్ అయిన లాబ్ వర్కర్‌కు ఇచ్చి, నాకు అందజేయమన్నాడు.

మీరు యింతగా కష్టపడి మనిషితో సహా మాయం చేసిన ఆ అవుట్ డోర్ నెగటివ్ లో ఏముందో అప్పటి వరకూ ఎంతగా ఆలోచించినా ఊహించలేక పోయాను.

ఆ ఫ్రేమ్స్‌ని ప్రింట్‌కు ఇచ్చాను.

ఆ తరువాత నేను రావ్ తో డాక్యుమెంటరీ ప్రొశె

క్షన్ చూడగానే ఫ్లెమింగ్ సెన్స్‌తో మోహన్‌దాస్ నాకు చూపించిన ప్రాజెక్షన్ రిపోర్టులో కూడా ఉన్నట్లుగా అనుమానమేసి, అతన్ని కలుసుకోబోయాను. కాని నన్ను వెంబడిస్తున్న మీ మనుష్యులు ఆ విషయం గ్రహించి, నేను అతన్ని కలుసుకోకముందే హత్యజేసారు.

అప్పటివరకూ నేను ఈ కేసులో నేరస్థుడు సుందరం ఒక్కడే అనుకున్నాను. కాని, మోహన్‌దాస్ నన్ను మభ్యపెట్టడం, ఆ రహస్యం తెలుసుకునే లోపుగానే అతను చావడం వలన ఇందులో ఇంకా చాలా చేతులు న్నాయని గ్రహించాను.

ఈలోగా సుందరం యిచ్చిన త్రీఫ్రేమ్స్‌కు ప్రింట్ వచ్చింది. దానిని మేగ్నిఫైయింగ్ లెన్స్‌తో అతిదీక్షగా పరీక్షించగా ఇంత కథకు మూలకారణం ఏమిటో తెలిసి పోయింది.''

ఆనంద్ చెప్పడం ఆపి, రెండు నిముషాలు కళ్ళుమూసు కుని, కుర్చీలో వెనక్కు జారగిలపడ్డాడు.

అందరూ ఆసక్తిగా ఆనంద్‌నే చూస్తున్నారు. టేప్ రికార్డర్ తిరుగుతూనే ఉంది. ఆనంద్ మరో సిగరెట్ వెలిగించి చెప్పసాగాడు.

''ఆ ఫ్రేమ్స్‌లోని దృశ్యం చాలా మనోహరంగావుంది మేఘాలు గుంపులు గుంపులుగా ఉన్నాయి. వాటిక్రింద కనుచూపు మేరవరకూ ఎటుచూసినా సరుగుడు తోటలు. ఆ తోటల్లో ఎక్కడో దూరంగా అతి చిన్నగా కనబడు తున్న చిన్న విమానం!...'' ఆనంద్ చెప్పడం ఆపి, భూషణ్‌రావ్ మొహంలోకి చూసి నవ్వాడు.

భూషణ్‌రావ్ కళ్ళనిప్పులు రాలుస్తున్నాయి. బాగా

ౖగా ఉండడం వలన అవి జ్యోతుల్లా వెలుగుతున్నాయి ఆనంద్‌ను కళ్ళతోనే భస్మం చేసేట్లుగా క్రూరంగా చూస్తున్నాడు.

"చాలా సుందరంగావున్న ఆదృశ్యమే భూషణ్‌రావ్ పాలిటశని అయింది. ఆ చిన్న విమానాన్ని ప్రొడ్యూసర్ రావ్‌గాని, షూటింగ్‌లో పాల్గొన్న బృందంగాని చూడ లేదు.

మోహన్‌దాస్ దానిని ప్రింట్ చేసి, ఆ దృశ్యాలు తన మేనమామ అయిన భూషణ్‌రావ్ ఎస్టేట్స్‌కు సమీ పంలో తీసిన షాట్స్ గనుక క్యూరియాసిటీతో థియేటర్ లోనే రెండుమూడుసార్లు వేసి చూశాడు. మోహన్‌దాస్ చిన్న వయసులో ఈ ఎస్టేట్స్‌లోనే ఉండేవాడట! ఆ ఇంటరెస్ట్ వలన, తాను ఆ ప్రదేశాలను చూసి చాలా కాలం అవడం వలన, ఆ ఫిల్మ్‌ప్రింట్‌ను యెక్కువసార్లు థియేటర్‌లో వేసి చూశాడు.

అయితే ఫిల్మ్‌లో అతిచిన్నగా కనపడే ఆ విమానం స్క్రీన్ మీద చాలా స్పష్టంగా కనపడింది. అతనికి మామగారు చేసే ఈ కత్తిప్రపంచాల బిజినెస్ తెలిసే ఉంటుంది. ఆ అనుమానం మీద భూషణ్‌రావ్‌కు చూపిం చాడు.

ఆ ప్రదేశంలో విమానాశ్రయం ఏమీలేదు. ఎయిర్ ఫోర్స్‌కు సంబంధించిన ట్రయినింగ్ సెంటర్స్ కూడా లేవు! అక్కడసలు న్యూస్‌పేపర్ ప్లేన్‌గాని, పోస్టల్ ప్లేన్‌గాని లాండ్ అయే అవకాశంలేదు! ఐతే అక్కడా ప్లేన్ ఎందుకు దిగింది?

ఎన్నో అనుమానాలను రేకెత్తించే ఆ విమానాన్ని సెన్సార్‌లో తప్పకుండా గమనిస్తారు. లేకపోతే ఫిలిమ్స్

డివిజన్‌లో తమనించి ఆరాతీస్తారు. అప్పుడిక డొంకంతా కదులుతుంది. ఈ భయంతోనే భూషణ్ రావ్ సుందరాన్ని, నెగటివ్‌ని మాయం చేశాడు.

ఆ ప్రదేశంలో ప్లేన్ ఉండటానికి కారణం ఏమిటోనని నాకూ అనుమానం వచ్చింది. నా అసిస్టెంట్స్‌తో వివరాలు లాగాను. చాలా విషయాలు తెలిసాయి. ప్రదేశం తెలిసిన తరువాత ఆ విమానం ఈ సరుగుడు తోటల్లో ఎందుకు దిగిందో ఊహించ గలుగుతున్నాను. కల్తీలలో ఉపయోగపడే మందులను భారీ యెత్తున ఆ విమానంలో ఇండియాకు విదేశాలనుండి సప్లయి చేస్తున్నారని కనిపెట్టాను'' ఆనంద్ చెప్పడం ఆపాడు.

అప్పటివరకూ మౌనంగా వింటున్న నాయకులు చిన్నగా కరతాళ ధ్వనులు చేశారు.

''మిస్టర్ ఆనంద్‌ది సూపర్ బ్రెయిన్! ఒక్క చిన్న క్లూ పట్టుకుని ఇంతవరకూ పరిశోధించుకుంటూ వచ్చాడంటే చాలా అభినందించాలి! మిస్టర్ రావ్! ఆనంద్ లాంటి వాళ్ళు మనపథకంలో చాలా ఉపయోగపడే అవకాశం ఉంది. ఎంత డబ్బయినా ఆఫర్ చేద్దాం! అతను మన కాంట్రాక్టుకు అంగీకారం తెలిపినట్లయితే, నేను మా దేశంలోవున్న ఇతర సభ్యులతో మాట్లాడి ఇమ్మిడియెట్లీ అపాయింట్ చేద్దాం!'' ఉత్సాహంగా అన్నాడొక విదేశీయుడు.

భూషణ్ రావ్ సూటిగా ఆనంద్ మొహంలోకే చూస్తున్నాడు.

ఆనంద్ ఏ భావమూ కనబరచకుండా, మౌనంగా కళ్లుమూసుకుని ముందు ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాడు.

అందరూ అతను తాము అడిగిన దానిగురించి ఆలోచిస్తున్నాడనుకుని చిన్నగా నవ్వుకొని, గ్లాసుల్లోని విస్కీ చప్పరిస్తున్నారు. మూడు నిమిషాలు గడిచిపోయాయి. టేప్ రన్ అవుట్ అయింది.

రావ్ రికార్డర్‌ను ఆఫ్ చేసి టేప్‌ను ప్లాస్టిక్ పేపర్‌లో వేసి టేబిల్ పక్కగా తోశాడు.

ఆనంద్ శరీరం కొంచెం మొద్దుబారింది. మెదడును మత్తుస్వాధీనం చేసుకుంటోంది. గుండెల్లో ధైర్యం, ఏదో తెలీని తెగింపు పరవళ్ళు తొక్కున్నాయి. ఇక త్రాగడం ఆపివేస్తే మంచిదనుకున్నాడు. ఆ లిమిట్ దాటితే తను చేయవలసిన కార్యానికి మోసం వస్తుందనే ఆలోచన అతన్ని విస్కీకి దూరంగా తోస్తుంది.

ఆనంద్ నోరు తెరచి ఏదో చెప్పబోయాడు.

అంతలోనే ప్రక్కగది తలుపులు తెరుచుకుని భూషణ్‌రావ్ కుడిభుజమైన డాక్టర్ పటేల్ లోపలకు ప్రవేశించాడు. అతని చేతిలో లావుపాటి ఫైల్ వుంది. అతను డోర్‌ను మూసి, భూషణ్‌రావ్ దగ్గరకు వచ్చి, ఫైల్‌ను అతని ముందున్న టేబిల్ మీద పెట్టాడు. అప్పుడు చూశాడు ఆనంద్‌ని! ఆశ్చర్యంతో అతని నొసలు పైకిలేచాయి.

"బాస్! ఈయనెవరు?" అడిగాడు ఆనంద్‌ని పరీక్షగా చూస్తూ.

భూషణ్ మొహంలో భావాలు మారడం ఆనంద్ గమనిస్తూనే వున్నాడు.

"ఈయన పేరు ఆ...నంద్! మన శ్రీ ప్రపంచం మీద చాలా పెద్ద రిపోర్టు తయారుచేశారు. ప్రస్తుతం మన

ఆతిధ్యాన్ని గౌరవిస్తున్నారు" వెటకారంగా ఒక్కొక్క మాటే చెప్పాడు భూషణ్.

పటేల్ నమ్మనట్లుగా చూస్తున్నాడు.

"మిస్టర్ పటేల్! నీవు వెళ్ళి వెంటనే మన బల గాన్ని తీసుకురా క్విక్!"

పటేల్ జేబులోనుండి రివాల్వర్ తీసి, దాన్ని ఒక సారి ఎగురవేసి పట్టుకుని తలుపువైపు నడవబోయాడు.

"ఆగు!" భూషణ్ రావ్ కోపంగా అరిచాడు.

"తెలివితక్కువగా ప్రవర్తించబోతున్నావు. ఆ దారి వెంబడి వెడితే నువ్వు ఈ అండర్ గ్రౌండ్ నుండి పైకి వెళ్ళడం సంగతి అటుంచి, సరాసరి ఈ లోకాన్నుండే పైకి పోతావు!" భూషణ్ రావ్ అతన్ని దగ్గరకు రమ్మని పిలిచి, టెలివిజన్ స్విచెస్ ఆన్ చేశాడు.

ఆ టి.వి. గ్లాస్ మీద నాలుగు కెమేరాల నుండి ఒకే సారి ప్రసారమవుతున్న దృశ్యాలు కనబడుతున్నాయి. ఫ్రాన్స్‌నుండి తెప్పించిన సెట్ అది! ఆ గ్లాస్‌ని నాలుగు భాగాలుగా విభజించినట్లు నాలుగురకాల దృశ్యాలు ప్రసారమవుతున్నాయి.

మొదటి దృశ్యంలో మెషిన్ గన్ పుచ్చుకుని అతి జాగ్రత్తగా అటూఇటూ చూస్తున్న గోప్ కనబడు తున్నాడు. ఇంకొకదానిలో రవి, గోఖలే గదిగోడలను పరీక్షిస్తూ కనబడ్డారు. దానిక్రింద దృశ్యంలో రెడ్ లైట్ ఫోకస్ చేస్తున్న హాలు కనబడుతోంది. దానికి ప్రక్కగా కనబడేదానిలో ఒక పెద్ద హాలులో కత్తిమందుల లాబొరేటరీ!

పటేల్ ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. కోపంతోనో,

భయంతోనో అతనరాలు వుబ్బాయి. కళ్ళల్లో ఆందోళన స్పష్టంగా కనబడుతోంది.

"పటేల్! యింకొకదారిన వెళ్ళు! పని త్వరగా చేసుకురా!" భూషణ్ రావ్ ఆజ్ఞాపించాడు.

పటేల్ దాదాపు పరుగెత్తినట్లుగా ఆ హాలుకు మరో ప్రక్కనున్న డోర్ తెరుచుకుని వెళ్ళిపోయాడు.

# 11

"గోఖలే! ఈ రూమ్‌ని చూస్తే నీకేమనిపిస్తోంది?" అడిగాడు రవి సీలింగ్‌ని పరీక్షగా చూస్తూ.

"కారణం ఊహించలేకపోతున్నాను గానీ, ఈరూమ్ చాలా చల్లగావుంది. ఎయిర్‌కండిషన్డ్ మాత్రం కాదు" అన్నాడు గోఖలే.

రవి తలూపి, సీలింగ్‌ని చేత్తో తడిమాడు. కొంచెం చెమ్మగావుంది. పగులు ఎక్కడైనా కనబడుతుందేమోనని వెదికాడు. కనబడలేదు!

"ఈ రూమ్‌పైన తప్పకుండా చెరువు వుండివుంటుంది. నాకు ఒక ఐడియా వచ్చింది. నువ్వు ముందు ఈ తలుపులన్నీ తెరుచుకుంటూ వెళ్ళి, ఈ మార్గం ఎక్కడకు వెడుతుందో చూసిరా!" చెప్పాడు రవి.

గోఖలే తలూపి, ఉత్సాహంగా రూమ్‌కు మరో ప్రక్కనున్న తలుపు తెరిచాడు. సన్నటి సొరంగమార్గం! చాలా దూరం నడుచుకుంటూ రెండు మలుపులు తిరిగి, మార్గం చివరకు చేరుకున్నాడు. అక్కడొక ఇనుపతలుపు! బలమంతా ఉపయోగించి లాగాడు. భారంగా కదిలిందా తలుపు!

తలుపు తెరిచిచూచిన గోఖలే ఆశ్చర్యపోయాడు.

అక్కడ కూడా నిచ్చెన ఒకటివుంది. పైన చెక్క తీసేసి నట్లుంది. బహుశా, ఇది యింకొక మార్గం అయివుంటుంది ఈ ప్రదేశం నాలుగు భవనాలకు వెనుకగా వుండివుండాలి! ఆలోచిస్తున్న గోఖలే పైనుండి ఏవో అరుపులు, తుపాకీ శబ్దాలు లీలగా వినబడుతున్నాయి. సెంట్రీలు ఇటు వేపు వస్తూండివుండవచ్చు.

ఈ ఊహ కలగ్గానే కుమార్, తలుపు మూసి వేగంగా వెనక్కు తిరిగి రవి దగ్గరకు పరుగెత్తి, తన అనుమానం వెలిబుచ్చాడు.

"నువ్వు చెప్పినట్లుగానే జరగడానికి అవకాశముంది. ఈ రూమ్‌లోనుండి యిప్పుడు నువ్వు బయటకు వెళ్ళిన తలుపులు మూసేసిరా!" చెప్పి, రివాల్వర్ తీసి, సీలింగ్ దగ్గరగా పెట్టి, రెండుసార్లు కాల్చాడు రవి! సీలింగ్ చెక్కలు వూడి, సన్నగా నీరు కారసాగింది. రవి సంతోషంగా ఆ రంధ్రానికి ప్రక్కగా మరో రెండుసార్లు కాల్చాడు. రంధ్రం పెద్దదయి లావుపాటి ధార శబ్దం చేస్తూ పడుతోంది.

కుమార్ రెండోమార్గం తలుపేసేసి రవిదగ్గరకు వచ్చి, ఆశ్చర్యంగా నీటి ధారనిచూస్తూ నిలబడ్డాడు.

"కుమార్! మనం యిప్పుడు చాలా జాగ్రత్తగా ప్రవర్తించాలి. మనం వచ్చినదారినే గోపీదగ్గరకు వెడదాం! మనం వెళ్ళేదారికున్న తలుపును మాత్రం ఏమాత్రం సందులేకుండా మూయాలి! ఇటువంటి పరిస్థితుల్లోకూడా ఆ తలుపును ఎవరూ తీయకుండా జాగ్రత్త వహించాలి! రెండోమార్గం నుండి వచ్చే సెంట్రీలకు తప్పకుండా జలగండం వుంది. మనం వెళ్ళే దారికూడా నీళ్ళమయం

అయినట్లయితే అందరం యింకోమార్గం లేకపోవడంవలన ఈ అండర్ గ్రౌండ్ లోనే చావాల్సివస్తుంది'' చెప్పి, ఆ రంధ్రానికి ప్రక్కగా మరో రెండుసార్లు కాల్చాడు రవి.

నీటి ఒత్తిడికి రంధ్రం క్రమంగా పెద్దదౌతోంది.

రవి, గోఖలే తలుపువేసి, నాలుగైదుసార్లు బలంగా లాగి, నీరు ఆవైపు రాదని నిర్ధారణ చేసుకుని, గోపీ కాపలా కాస్తున్న ప్రదేశం వేపు పరుగెత్తారు.

# 12

''మైగాడ్! ఈ వెధవలు అనుకున్న పని చేశారు. సెంట్రీలు వచ్చే రెండో మార్గాన్ని నీటితో బ్లాక్ చేసే శారు. ఆ వెధవలు తప్పకుండా ఇందులో ఇరుక్కుంటారు మనం ఇప్పటికైనా మొదటి మార్గాన్నుండీ బయట పడాలి!'' భూషణ్ రావ్ లేచి నిలబడ్డాడు.

అప్పటివరకూ ఫోకసెస్ గమనిస్తున్న గోపీ కెమెరాకు అందకపోవడం వలన టి. వి. లో కనబడటంలేదు. భూషణ్ రావ్ టేబిల్ సొరుగులోనుండి రివాల్వర్ తీసి, ద్వారంవేపు తిరిగాడు.

తలుపులు తెరుచుకుని గోపీ లోపలకు ప్రవేశించాడు. అతని చేతిలోని మెషిన్ గన్ సూటిగా భూషణ్ రావ్ కు గురిపెట్టబడివుంది.

విదేశీయులు భయంగా భూషణ్ రావ్ నే తదేకంగా చూస్తున్నారు.

''బాస్! ముందా రివాల్వర్ ఇటు విసిరేయ్! మీలో ప్రతి ఒక్కరి దగ్గరా రివాల్వర్ వుందని నాకు తెలుసు! త్వరగా యిటు విసిరేయండి! లేదా నేనొక రౌండ్

కాల్చాల్సి వస్తుంది'' గర్జించాడు గోపీ.

భూషణ్ మొహం కందగడ్డలా మారింది. గోపీ ఆజ్ఞ, ఆనంద్ చిరునవ్వు అతనికి మరింత కారాన్ని రాస్తున్నట్లనిపించింది.

''ఆ రూమ్‌లో కాపలాకాసే వెధవ లాబొరేటరీకి తగలబడ్డాడులావుంది'' కసిగా గొణుక్కుంటూ విధిలేక రివాల్వర్‌ని గోపీ కాళ్ళవైపు విసిరాడు. బాస్ విసరగానే మిగతా వాళ్ళందరూ తమ ఆయుధాలనుకూడా విసిరారు. గోపీ రెప్పవేయకుండా బాస్‌నే చూస్తూ, కాలితో క్రిందపడిన రివాల్వర్స్‌ని ఒక ప్రక్కగా తోస్తున్నాడు.

టి. వి.నే చూస్తున్న ఆనంద్ ఉలిక్కిపడ్డాడు. లాబొరేటరీ నుండి ఫోకస్ రూమ్‌కున్న తలుపులు తెరుచుకుని ఒక వ్యక్తి లోపలకు ప్రవేశిస్తున్నాడు.

''గోపీ! నీ వెనకగా వచ్చేవాడిని కాల్చెయి!'' అరిచాడు ఆనంద్.

ఆనంద్ మాట పూర్తికాకముందే గోపీ వెనక్కి తిరిగి అప్పుడే లోపలకు వచ్చినతన్ని కాల్చేసాడు. అతను చావుకేక వేస్తూ విరుచుకుపడిపోయాడు.

గోపీ వెనక్కి తిరగ్గానే బాస్ ఒక్కవూపులో క్రింద పోగుచేసిన రివాల్వర్స్ దగ్గరకు వెళ్ళి ఒకదాన్ని అందుకున్నాడు. అది గమనించిన ఆనంద్ విసురుగా వెళ్ళి నడుం మీద బలంకొద్దీ తన్నాడు. బాస్ బోర్లా పడిపోయాడు.

మిగతా వాళ్ళంతా ఒక్కుమ్మడిగా ఆనంద్ మీద పడ్డారు. గోపీకి వాళ్ళను కాల్చడానికి అవకాశం లేకుండా పోయింది. తానొక రౌండ్ కాల్చినట్లయితే ఆనంద్ కూడా గాయపడే ప్రమాదముంది.

ఆనంద్ శక్తినంతా చేతుల్లోకి తెచ్చుకొని విజృంభించాడు. తనకు అందుబాటులో నున్న ఇద్దరిని మొహంమీద గుద్దాడు. భూషణ్ రావ్ వెనుక నుండి ఆనంద్ జుట్టుపట్టుకుని వెనక్కి వంచాడు. ఇద్దరు ఆనంద్ మొహంమీద గుద్దు తున్నారు. ఇంకొకడు కాలితో ఆనంద్ డొక్కలో తన్నాడు. ఆనంద్ కు ఊపిరి ఆడడంలేదు. మొహంమీద దెబ్బలు పడటంవలన కళ్ళముందు మెరుపులు మెరుస్తు న్నట్లయింది. కడుపులో పోటు పుడుతోంది. బలంగా జుట్టుపట్టుకుని లాగుతూండటం వలన నిలద్రొక్కుకోలేక పోతున్నాడు.

అందరూ కలిసి ఆనంద్ ని కొట్టడం చూస్తూనే గోపీ పిచ్చిఆవేశంతో మెషిన్ గన్ తో ఒకడి తలపగులగొట్టాడు. వాడు అరుస్తూ క్రిందపడిపోయాడు.

మిగతావాళ్ళు ఆనంద్ ని కొడుతూనేవున్నారు.ఆనంద్ నోటిలో నుండి విపరీతంగా రక్తం కారుతోంది. పళ్ళు కదిలిపోయాయి. గెడ్డం, పెదాలు చితికిపోయాయి. వెంట్రుకలు కుదుళ్ళతో ఊడివస్తున్నాయి.

ఆనంద్ అతికష్టంమీద దెబ్బలు సహిస్తూనే వెనక్కి తిరిగి భూషణ్ రావ్ కళ్ళమీద గుద్దాడు. ఊహించని ఈ దెబ్బకు భూషణ్ రావ్ ఆనంద్ జుట్టును వదిలేశాడు. ఆనంద్ లోని రక్తం సలసల కాగిపోతోంది. ఏదో తెలీని చావుబలంతో అందినవాళ్ళను బాదుతున్నాడు.

గోపీని వెదుక్కుంటూ వచ్చిన రవి, గోఖలే జరుగు తున్న యుద్ధం చూస్తూనే లోపలకు దూకి, ఆనంద్ డొక్కల్లో గుద్దుతున్న ఒకడిని పట్టుకుని ఇవతలకు లాగి, రివాల్వర్ మడమతో గెడ్డంక్రింద కొట్టాడు.

అరుపులతో ఆ అండర్ గ్రౌండ్ మార్మోగిపోతోంది.

గోపీ, గోఖలే కూడా అందినవాడినల్లా పట్టుకుని బాదుతున్నారు.

రవి, గోఖలే రావడంతో ఆనంద్‌కు క్రొత్త శక్తి వచ్చింది. తనమీదకు రాబోతున్న భూషణ్ రావ్‌ని ఎగిరి గుండెలమీద తన్నాడు. భూషణ్ రావ్ ఆ ఊపుకు వెనుకనున్న టేబిల్ మీద పడ్డాడు.

ఆనంద్ టేబిల్ మీద పడిన భూషణ్ రావ్ గొంతు పట్టుకుని, నొక్కుతున్నాడు. అతని దృష్టి హఠాత్‌గా టి.వి. మీద పడింది. తాము వచ్చిన అండర్ గ్రౌండ్ మార్గంలోనుండి సెంట్రీలు రావడం కనిపిస్తోంది. రవి చెరువుకు గండిపెట్టిన రూమ్‌లో ఏమీ కనబడటంలేదు. రూమ్ నీటితో నిండిపోయి వుంటుంది.

"రవీ! సెంట్రీలు వస్తున్నారు" రావ్ గొంతు నులుముతూనే అరిచాడు ఆనంద్.

రవి తనమీదకు రాబోతున్నవాడిని వెనక్కుతోసి గోపీదగ్గరకు దూకి, అతని చేతిలోని మెషిన్‌గన్‌ని అందుకుని, తనమీదకు రాబోతున్న వాడిని షూట్ చేసి, షోకేస్ రూమ్‌లో నుండి సొరంగమార్గంలోకి పరుగెత్తాడు. మలుపులో నిలబడి కాల్చడం మొదలుపెట్టాడు. అండర్ గ్రౌండ్‌లోకి దిగిన సెంట్రీలు కూడా మలుపులో నిలబడి కాలుస్తున్నారు.

ఆనంద్, భూషణ్ రావ్‌ని బాదుతున్నాడు.

గోపి, గోఖలే మిగతావాళ్ళతో యుద్ధం చేస్తున్నారు.

భూషణ్ రావ్ రాక్షసుడిలా తనమీదపడి కొడుతున్న ఆనంద్ దెబ్బలకు బాధగా అరుస్తున్నాడు. అతని ఒంటి

మీద విలువైన దుస్తులు చిరిగిపోయాయి. మొహమంతా పగిలిపోయింది.

భూషణ్ రావ్ ఇక తాను ఆ దెబ్బలను భరించలేనట్లుగా రెండు చేతులెత్తాడు. గోఖలే క్రిందపడిన రెండు రివాల్వర్స్ తీసుకుని, ఆనంద్ కు ఒకటి యిచ్చి, రవి దగ్గరకు పరుగెత్తాడు.

విదేశీయులు లొంగి పోయినట్లుగా చేతులెత్తి నిలబడ్డారు. భూషణ్ రావ్ క్రింద చతికిలబడి టేబిల్ కు ఆనుకుని కళ్ళు మూసుకున్నాడు.

టి.వి.లో చూస్తున్న ఆనంద్ కు సెంట్రీల వెనుక నుండి కాల్పులు సాగిస్తూ అండర్ గ్రౌండ్ లోకి ప్రవేశిస్తున్న పోలీసులు కనబడుతున్నారు. ఆనంద్ రివాల్వర్ ని విదేశీయులకు గురిపెట్టి, సూట్ కేస్ ను పట్టుకుని నిలబడలేక అక్కడే నేలమీద కూర్చుండి పోయాడు.

ఒక వేపునుండీ రవీ, కుమార్, మరొక వేపునుండి పోలీసులు సాగిస్తున్న కాల్పుల్లో సెంట్రీలు ఎక్కువసేపు నిలబడలేరని తెలుసు ఆనంద్ కు.

మరో పదినిముషాలకు బూట్స్ చప్పుడు చేసుకుంటూ పోలీసులు ఆ రూమ్ లోకి ప్రవేశించారు.

ఇన్స్పెక్టర్ చంద్రశేఖర్ ఆనంద్ ని లేవనెత్తి, ఆప్యాయంగా కౌగలించుకున్నాడు.

ఆనంద్ అంతబాధలో కూడా మందహాసం చేశాడు.

"డియర్ ఫ్రెండ్! ఈ సూట్ కేస్ లోవున్న టేప్ స్టేట్ మెంట్ కు ఉపయోగపడుతుంది. ఫైల్స్ లో కల్తీ మందులు ఎక్కడెక్కడ సప్లయి అవుతున్నాయో వివ

రంగా వుంటాయి...పోతే_ఈ విదేశీయులను అరెస్టు చెయ్యి...లాబొరేటరీని స్వాధీనం చేసుకో!...చెరువు లోని నీరు ఈ ప్రదేశాన్ని ఆక్రమించకుండా కట్టుదిట్టం చేయి!''

''ఆనంద్! ఇంకెక్కువగా మాట్లాడకు! అవన్నీ నేను చూసుకుంటాను'' ప్రేమగా మందలించాడు ఇన్‌స్పెక్టర్ చంద్రశేఖర్.

పోలీసులతో ఆ రూమ్ నిండిపోయింది.

ఆనంద్ ఇద్దరు పోలీసుల సహాయంతో అండర్ గ్రౌండ్‌లోని శవాలను దాటుకుంటూ పైకివచ్చాడు.

చల్లటిగాలి హోరుగా వీస్తోంది. ఆ గాలికి చెమట ఆరిపోయి శరీరానికి ఏదో హాయిని కలిగిస్తోంది. చంద్రుడి వెలుగు తగ్గిపోతోంది.

ఎక్కడో దూరంగా కుక్కలు అరుస్తున్నాయి. సరుగుడు తోటలు తమ ఈలపాటను హోరుగాలితో కలిపి వినిపిస్తూనే వున్నాయి.

——: ఐపోయింది :——

# అదృశ్య దీవి!

అజీజ్

''మిమ్మల్ని ఎస్. పి. గారు పిలుస్తున్నారు సార్!''
అన్నాడు డేవిడ్ లోనికి వచ్చి.

సిగరెట్ ఏష్‌ట్రేలో నొక్కి లేచాను. ఏదో ముఖ్య విషయం లేనిదే ఆయన నన్ను పిలవడు.

స్ప్రింగ్ డోర్స్ తోసుకుంటూ లోన అడుగుపెట్టి, సెల్యూట్ కొట్టేను. ఆయన ప్రతివాదంజేసి ''ప్లీజ్ టేక్ యువర్ సీట్!'' అన్నాడు.

క్యాప్ తీస్తూ కుర్చీలో చతికిలబడ్డాను.

ఆయన సిగరెట్ అంటించి ప్రారంభించాడు. ''నగరంలో అక్కడక్కడా వ్యాపించివున్న మన ప్రత్యేక నిఘా విభాగంవారు ఈమధ్య ఓ కొత్త రిపోర్టు పంపారు, నాకు.

ఆ రిపోర్ట్‌లోని విషయాలు చాలా ఆసక్తికరంగానూ, అనుమానాస్పదంగానూ ఉన్నాయి. అందుకే నిన్ను పిలిపించాను—త్వరణ్ణంగా నీచేత దర్యాప్తు జరిపించాలని!

ఈమధ్య సోమసుందరంపిళ్ళై వీధిలో ఓ ప్రయివేట్ సంస్థ తాలూకు 'అజన్మ యవ్వన కార్పొరేషన్' అనే కొత్త ఆఫీసు తెరవబడిందిట. ఆ పేరులోనే ఏదో అసహజత్వం కనిపిస్తోంది కదూ?

దాని యజమాని పేరు ప్రదీప్‌కుమార్ చక్రబర్తి.

కానీ, అతను తెరిచిన, ఆ కొత్త ఆఫీసులో, యీ మధ్య ఇక్కడ పేరుమోసిన రౌడీలు కొందరు వెళ్ళి వస్తూండటం మనవాళ్ళ కంటబడింది. తక్షణం రిపోర్టు పంపారు.

ముందే అనిశ్చితమైన యీనాటి రాజకీయ గొడవలతో తలమునకలౌతున్న మన ప్రజలకు ఆ వెధవలవల్ల మరేదయినా సంకటస్థితి దాపురించబోవటం లేదుకదా?

ఆ ప్రదీప్‌కుమార్ చక్రబర్తికి రౌడీలతోనూ, గుండాలతోనూ ఏమిటిపని? అతను చేసే వ్యాపారం యేమిటి? అజన్మ యవ్వన కార్పొరేషన్ యేమిటి? మొదలయిన సందేహాలకి నాకు సమాధానాలు కావాలి. నీవు వెంటనే రంగంలోకి దిగి, నిగూఢమైన విషయాలేవయినా తెలుస్తాయేమో కనుక్కొని నీ రిపోర్ట్ అందజెయ్యి" అన్నాడు.

నేను తలూపి—"ఓ.కే. సర్!" అంటూ లేచాను.

## 2

సోమసుందరంపిళ్ళైవీధి మొదట్లో జీప్ ఆపి, రిష్టువాచీ చూసుకున్నాను. ఆరు గంటలు! వీధిలో అట్టే జనసంచారంలేదు. అక్కడక్కడా లైట్లు వెలుగుతున్నాయి.

జీప్ దిగి, వీధికిరుపక్కలావున్న ఇళ్ళు చెక్ చేసుకుంటూ నడవసాగాను. ఇప్పుడు యూనిఫాం వేసుకోలేదు.

ఓ ఇంటి మెయిన్ గేట్ పక్క, పిట్టగోడకి తగిలించి ఉంది సైన్ బోర్డు.

'ఆజన్మ యవ్వన కార్పొరేషన్!'

నా గమ్యం అదే! ఆగి ఓమారు అటూయిటూ చూసేను జాగ్రత్త కోసం. అప్పుడప్పుడూ వీధిగుండా వెళుతున్న జనంలో ఎవ్వరూ నన్ను పట్టించుకోడం లేదని రూఢి అయ్యేక, మూసివున్న మెయిన్ గేటు కొక్కి తీసి తోసేను.

కిర్రుమంటూ తెరుచుకుంది. కంపౌండ్ లో మసక చీకటి. అది చిన్నడాబా ఇల్లు. తలుపుకి తాళం వేసి వుంది. గబగబ తలుపుని సమీపించాను. గడియకి వేలాడు తున్నది సామాన్యమైన తాళం. జేబులోంచి మారు తాళం చెవుల గుత్తితీసి క్షణంలో తెరిచాను తాళాన్ని.

తలుపుతోసి, లోన అడుగుపెట్టాను. చీకటి! లైటు వెలిగించకూడదు. తలుపుమూసి, టార్చి వెలిగించాను.

అగది కుడిపక్కనే మరోగది ఉంది. గుమ్మానికి 'మేనేజర్' అనే బోర్డు బిగించివుంది.

అటు నడిచాను. తలుపుకి తాళం వేసుంది. అటు వంటి తాళాలు తెరవడం నాకు కష్టంకాదు. తెరిచి, తలుపు తోసేను.

గోడవారగా గోద్రేజ్ టేబిల్. టేబిల్ పైన పేపర్ వెయిట్ టెలిఫోన్, ఇంక్ బాటిల్, కలాలూ, రెండు మూడు ఫైళ్ళు సర్ది ఉన్నాయి. టేబిల్ నాలుగువైపులా నాలుగు ఈజీఛెయిర్స్. ముందు టేబిల్ సొరుగు లాగి

చూసేను. ఆ కార్పొరేషన్ పేరు ముద్రించివున్న లెటర్ పేడ్ కనిపించింది పైన. దాన్నితీసి లోపలి వస్తువులు చూద్దామని పేడ్ అందుకున్నాను.

అప్పుడు పడింది దృష్టి, పేడ్ మొదటి పేజీమీద. అంతక్రితం దాని పైపేజీమీద బాల్ పెన్‌తో ఒత్తుగా ఏదో రాయడంవల్ల, ఈ పేజీపై గుర్తులు పడ్డాయి. టార్చి వేసి పరీక్షగా చూసేను.

ఐదారు పంక్తుల ఉత్తరంలా ఉంది. స్పష్టంగా కని పించడంలేదు అక్షరాలు. టేబిల్‌మీది పెన్సిల్, బ్లేడ్ అందుకుని, బ్లేడ్‌తో పెన్సిల్ కార్బన్ని గీరి, పౌడర్‌గా ఆ అక్షరాలమీద చల్లేను.

తరవాత మెల్లిగా పౌడర్ని ఊదేను. పైన ఉన్న కార్బన్ ఎగిరిపోయి, మిగతా కార్బన్ అక్షరాల సందుల్లో నిలిచిపోయింది. ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తు న్నాయి అక్షరాలు.

చదివేను.

'మిస్టర్ వేలాయుధం!

ఈ రాత్రి సరిగ్గా పది గంటలకు బొంబాయినించి వచ్చే బోయింగ్ విమానంలో, జనప్రియ వస్తున్నట్టునాకు ఇన్‌ఫర్మేషన్ అందింది. ఆమె ఇక్కడి పోలీస్ అధి కార్లని ఎట్టి పరిస్థితిల్లోనూ కలుసుకోకూడదు.

అందుకే, మనం ఆమెని విమానం దిగిన తక్షణం కిడ్నా పింగ్ చెయ్యాలి. నీ మనుషులతో వెంటనే వచ్చి నన్ను కలుసుకో. ప్లాన్ వివరిస్తాను.

చక్రవర్తి!'

ఉత్తరం పూర్తిచెయ్యగానే, నా కనుబొమలు ముడి

వచ్చాయి. ఎస్. పి. గారి అనుమానం పొరపాటు కాదన్న మాట. ఇక్కడ నిజంగా ఏవో రహస్య కార్యకలాపాలు జరుగుతున్నాయి.

జనప్రియ ఎవ్వరు? ప్రదీప్ కుమార్ చక్రబర్తి వేలాయుధం సహాయంతో ఆమెని దేనికి అపహరించా లనుకుంటున్నాడు?...

వేలాయుధం మద్రాసు నగరంలో పేరుమోసిన రౌడీ! వాడు చెయ్యని నేరంలేదు. వెళ్ళని జైలు లేదు.

ఐతే, ఆ జనప్రియ పోలీస్ అధికార్లని కలుసుకో కుండా వాళ్ళు దేనికి అపహరించాలనుకుంటున్నారు? ఆమె వద్దనున్న రహస్యం ఏమిటి? తీవ్రంగా ఆలోచిస్తూ చేతి గడియారం చూసుకున్నాను.

ఆరున్నర. విమానం రావడానికింకా చాలా టైం ఉంది. ఆలోగా, ఈ ఫైల్స్ కథేమిటో చూడాలి. టేబిల్ మీది ఫైల్ అందుకున్నాను. అందులో రాసి వున్న వివరాలు చదివి నివ్వెరబోయేను!

అనుమానం తీరక, మొదటినించీ మళ్ళీ క్షుణ్ణంగా పరిశీలించేను. అందులో, నగరంలోని లక్షాధికార్ల పేర్లూ, చిరునామాలూ, వయసులతోసహా అన్ని వివరాలూ స్పష్టంగా ఉన్నాయి. ముఖ్యంగా అవి ఏభై అరవై ఏళ్ళమధ్యఉన్న వయోవృద్ధ లక్షాధికార్లవే అయుండటం గమనార్హం!

నా ఆలోచన్ని తుంచివేస్తూ, హఠాత్తుగా టేబిల్ మీది టెలిఫోన్ మోగింది. క్షణం దానివైపు చూచి రిసీవర్ అందుకున్నాను.

కొద్దిగా కంఠం మార్చి "ఎవ్వరు?" అడిగేను.

"జనప్రియా, నుంగంబాకం వీధిలోని మూడవసందులో

నెంబర్ 146-వ ఇంట్లో వుంది. తక్షణం బైలుదేరి రండి''

''ఆదేమిటి? ఆమె రాత్రి పది గంటలకు బొంబాయి నించి విమానంలో వస్తోంది కదా?''

''అది రాంగ్ మెసేజ్! ఆమె ఇక్కడే వుంది. వెంటనే బైలుదేరండి'' అవతల క్లిక్ మంది.

అరంతాక అయోమయంలో పడిపోయేను. ఏం చెయ్యాలిప్పుడు? ఫోన్ చేసిన వ్యక్తి ఎవ్వరు? పేరడిగే వ్యవధి కూడా ఇవ్వకుండా డిస్కనెక్ట్ చేశేడు. అతను నా పేరుకూడా అడగకపోవడం గమనార్హం!

అంటే, ఈ సమయంలో, ఈ ఆఫీసులో ప్రదీప్ కుమార్ చక్రబర్తి ఉంటాడనుకున్నాడా? ఇప్పుడేం చెయ్యాలి? అతను చెప్పిన ఇంటికెళ్ళి ఆ జనప్రియ విషయం కనుక్కోవాలా?

అలోచిస్తూ క్రైంబ్రాంచి హెడ్ క్వార్టర్స్‌కి రింగ్ చేసేను. ఆపరేటర్ పలగ్గానే, లైన్‌లోకి సార్జంట్ డేవిడ్‌ని పిలవమని చెప్పేను. ఐదు నిమిషాల తరవాత వచ్చేడతను లైన్‌లోకి.

అతనికి విషయం చెప్పి, ''డేవిడ్! నీవక్కణ్ణించి తిన్నగా నుంగంబాకంలోని మూడవ సందులో ఉన్న నెంబర్ 146-వ ఇంటికి వచ్చెయ్. నేనక్కడే ఉంటాను'' అని రిసీవర్ దించేను.

ఆ ఇంటికి యధాతథంగా తాళాలు బిగించి, వీధి మొదట్లో ఆపిన జీప్ ఎక్కి బైలుదేరేను.

## 3

నుంగంబాకం వీధిలో మూడవ సందు మలుపు దగ్గర జీప్ ఆపి దిగేను. సందులో మసక చీకటి. ఇరుపక్కలా

ఇళ్ళు కట్టిఉన్నాయి. అడుగులో అడుగు వేసుకుంటూ, ఇళ్ళని పరీక్షగా చూసుకుంటూ ముందుకు నడిచేను.

నెంబర్ 146 ఇల్లు అదే!

తలుపు మూసివుంది. అరుగు ఎక్కి తలుపుకి చెవి ఆనించేను.

నిశ్శబ్దం!

తట్టబోయేను. చెయ్యిపడగానే కిర్రుమంటూ తెరుచు కుంది కొద్దిగా! దేనికైనా మంచిదని, పిస్తోలు తీసి తలుపు తోసేను.

చీకటి!

లోన అడుగుపెట్టేను. అంతే!

మాడు పగిలేలా పడింది దెబ్బ! కళ్ళల్లో చుక్కలు మెరిసేయి. తేరుకునే లోపల మరోటి పడింది తల వెనక. కాండం నరికిన చెట్టులా కింద కూలేను.

తిరిగి కళ్ళు తెరిచి చూస్తే ఓ గది నేలమీద పడు న్నాను. చేతులు వెనక్కి విరిచి కట్టివున్నాయి. గూట్లో కొవ్వొత్తి వెలుగుతోంది. నా ఎదురుగా నిల్చున్న వ్యక్తిని చూసి నివ్వెరబోయేను.

అతని వయసు ఎంతో అంచనా వెయ్యడం దుర్లభంగా ఉంది. ఎన్నో ఏళ్ళనించి క్షవరం చేసుకోక, జడలు జడలుగా అతుక్కుపోయిన తెల్లని శిరోజాలు! అటు వంటిదే బొడ్డువరకూ ఎదిగిన చింపిరి గెడ్డం!

అంతేకాదు, కనుబొమలూ, కనురెప్పలూ కూడా పండిపోయినట్టు తెల్లగా ఉన్నాయి. ఆ వెంట్రుకలూ, గడ్డమూ చూసి అతనికి ఏ ఎనభై ఏళ్లుంటాయో అను కుంటారెవ్వరైనా!

ఐతే, అతని శరీర దారుఢ్యం మాత్రం ముఫ్ఫైఏళ్ళ వ్యక్తికి మల్లే బలంగా కనిపిస్తోంది. ఒంటిమీద నిక్కరు తప్ప మరేంలేదు. మెలి తిరిగిన తొడలు. బలిష్టమైన పిక్కలు. బాడీబిల్డర్ లా కండలు తిరిగిన చేతులు. విశాలమైన ఛాతీ.

మొహంలో వృద్ధాప్యం! ఆకారంలో దృఢత్వం!!

ఏమిటి విచిత్రం?

ఆ గదిలో అతను తప్ప మరెవ్వరూ లేరు.

"ఎవరు నువ్?" అడిగేను ఆశ్చర్యంగా.

"నీవు చక్రబర్తి మురావాడివైతే, నేనెవ్వరో నీవు తప్పక తెలిసుండాలి!" అన్నాడు అతను తీక్షణంగా చూస్తూ.

అతని భాషలో విచిత్రమైన యాసవుంది. ఫోన్ లో నేను విన్న కంఠం అదే! "జనప్రియ ఇక్కడుందనీ, వెంటనే రమ్మనీ నీవేకదా ఫోన్ చేసింది?" అడిగేను.

"ఔను! మిమ్మల్నిక్కడికి పిలిపించి మక్కలిరగ తందామనే అలా చేసేను. ఇప్పుడు చెప్పు, ఎవరు నువ్? చక్రబర్తి ఎక్కడున్నాడు?" అడిగేడతను.

ఇంతవరకూ అతనే చక్రబర్తి మురావాడయుంటాడనుకుంటున్నాను. ఇతను వాళ్ళ ప్రత్యర్థన్న మాట! తేలికపడింది మనసు.

"నేనతని మురావాణ్ణి కాను. పోలీస్ ఇన్ స్పెక్టర్ని. వాళ్ళ అజన్మయవ్వన కార్పొరేషన్ ఆఫీసు తనిఖీ చేస్తుండగా, నీ ఫోన్ కాల్ వచ్చింది..."

అతను ఒక్క క్షణం ఆశ్చర్యంగా చూసి "ఐతే, జనప్రియ ఈ రాత్రి బొంబేనించి వస్తున్నట్లు నీకెలా తెలుసు?" అన్నాడు.

''నీ ప్రశ్నకి తరవాత జవాబు చెబుతాగానీ, ముందు నా సందేహం తీర్చు.''

''ఏమిటి?''

''నీ వయసెంత?''

అప్పటివరకూ సీరియస్‌గా వున్న అతను, పకపక నవ్వేడు. ''చెబితే నమ్ముతానా! ఐనా, అడిగేవు గనక చెబుతా విను. నా కిప్పుడు నూటానలభై ఏళ్ళు!''

దిగ్భ్రాంతితో క్షణంపాటు నా నోట మాట పెగల్లేదు.

''నూటానలభై ఏళ్ళా? అసంభవం!''

''ఔను. దైవసృష్టి రీత్యా అసంభవం! కాని, నేను దాన్ని సంభవం చేశాను. నీవు నమ్మినా, నమ్మకపోయినా నాకు నష్టం లేదు.''

''ఇంతకీ ఎవరు నువ్?''

అతని కంఠం గంభీరమైంది. ''నేను సుందరరాజన్ని! నా కిప్పుడెన్నేళ్ళో తెలుసుకోవాలనుకుంటే, తిన్నగా, షిప్పింగ్ ఆఫీస్‌కెళ్ళి పాత రికార్డ్స్ చెక్ జెయ్. అందులో జలతరంగ అనే ఒక ఓడ...'' మాటలింకా అతని నోట్లోనే వుండిపోయేయి.

హఠాత్తుగా గది తలుపు భళ్ళున తెరుచుకుంది.

ఇద్దరం ఉలిక్కిపడి అటుచూశాం! తలుపు మధ్య డేవిడ్ నిల్చునున్నాడు. అతని చేతిలో పిస్తోలు!

''ఏయ్ ముసలీ! చేతులు పై...'' డేవిడ్ మాటలింకా ఇవతలికి రానేలేదు.

ఆ వృద్ధుడు మెరుపుకన్నా వేగంగా, తలుపువరకూ ఎగిరి డేవిడ్ డొక్కలో ఒక్క తన్నుతన్ని, మాయ మయ్యేడు.

అరక్షణంలో జరిగిపోయిందిదంతా.

అతను తన్నిన తాపుకి అమాంతం విరుచుకుపడ్డ డేవిడ్, వెంటనే లేచి నిల్చున్నాడు. అప్పటికి ఆ వృద్ధుడి ఛాయలు కూడా లేవక్కడ.

"అతని వెనక పరిగెత్తడం వృధాప్రయాస. ముందిటొచ్చి నా కట్లు విప్పు!" అన్నాను.

"వాడు ముసలాడా? పర్ర వహిల్వానా? ఖడ్గమృగం కన్నా బలంగా కుమ్మేడు రాస్కెల్!" డొక్క సలుపుకుంటూ వచ్చి కట్లు విప్పేడు డేవిడ్.

అంతవరకూ జరిగిన సంఘటనలన్నీ క్లుప్తంగా అతనికి వివరించి—"నీవిలా సడన్‌గా రాకుండా వుంటే, అతని వల్ల అనేక విషయాలు తెలిసేవి...డోంట్ వర్రీ, ఇప్పుడు వెంటనే షిప్పింగ్ ఆఫీస్ కెళ్ళి మిగతా విషయాలు తెలుసుకుందాం పద!" అన్నాను లేస్తూ.

## 4

షిప్పింగ్ ఆఫీస్ అధికార్లకి నా ఐడెంటిఫికేషన్ కార్డు చూపించి, అక్కడి పాత రికార్డ్సులో 'జలతరంగ' అనే ఓడ గురించిన వివరాలు వెలికి తీయమని కోరేను.

అరగంట పట్టింది ఆ పాత ఫైలు కనుక్కోడానికి.

అందులోని వివరాలు నన్ను చకితుణ్ణి చేశాయి! నూరేళ్ళ క్రితం 'జలతరంగ' అనే ఆ ఓడ మద్రాసు రేవు నించి ఆస్ట్రేలియాకు బైలుదేరింది. విచిత్రం ఏమిటంటే ఆ ఓడ కెప్టెన్ పేరు సుందరరాజన్!

సముద్ర మార్గాన బైలుదేరిన ఆ ఓడ, అటు ఆస్ట్రేలియా చేరలేదు. ఇటు తిరిగి రాలేదు. దానికోసం వెతికి వేసారిన ఆ నాటి బ్రిటిష్ ప్రభుత్వం, అది సముద్రంలో

ఎక్కడో మునిగిపోయివుంటుందని నిర్ణయించి, దాని సంగతి మరచిపోయింది.

దీన్నిబట్టి ఆ వృద్ధుడు చెప్పింది నిజమేననిపిస్తోంది. ఎందుకంటే, ఓడ కెప్టెన్ గా అప్పుడతని వయస్సు నలభై సంవత్సరాలుంటుంది. అది సముద్రంలో అదృశ్యమై వందేళ్ళవుతోంది. ఆ లెక్కన ఇప్పుడా వృద్ధుడికి నూట నలభైఏళ్ళు!

నూరేళ్ళక్రితం ఓడతో సముద్రంలో మాయమైన కెప్టెన్ సుందరరాజన్ ఇన్నేళ్ళ తరవాత, మళ్ళీ మద్రాసులో ఎలా ప్రత్యక్షమయ్యేడు? ఇంతకాలం ఎక్కడున్నాడు? అతని అవతారం అలా దేనికుంది? ఇంత వయసులోనూ అతని శరీరం నవయువకుల కన్నా బలిష్టంగా ఎలా వుండగలిగింది.

ప్రదీప్ కుమార్ చక్రబర్తితో అతనికేమిటి పగ?

జనప్రియ ఎవ్వరు? బొంబాయి నించి రాబోతున్న ఆమెని ప్రదీప్ కుమార్, రౌడీల సహాయంతో దేనికి అపహరించాలనుకుంటున్నాడు. ఆమెకీ, సుందరరాజన్ కూ ఏమిటి సంబంధం?

ప్రశ్నలు, అన్నీ ఎడతెరిపిలేని ప్రశ్నలు. మనసును కల్లోలితం చేస్తున్నాయి. రిస్టువాచీ చూసుకున్నాను.

పావు తక్కువ పది. బొంబే ప్లేన్ వచ్చే టైం అవుతోంది. షిప్పింగ్ ఆఫీస్ అధికార్లకి థాంక్స్ చెప్పి, డేవిడ్ తో బైలుదేరాను, ఏర్ పోర్ట్ కు!

అప్పటికే, బొంబే విమానం కిందికి దిగదానికి ఆకాశంలో సర్కిల్స్ కొడుతోంది. లౌంజ్ లో ఎందుకోగానీ జనం విపరీతంగా కనిపించేరు. పత్రికా విలేఖర్లు ఫ్లాష్

కెమెరాలతో సిద్ధంగా ఉన్నారు.

అంటే, ఆ విమానంలో ప్రముఖవ్యక్తి ఎవ్వరో వస్తున్నారన్న మాట. అదే అడిగేను ఓ ప్రెస్ రిపోర్టర్ని.

నన్ను ఎగా దిగా చూసి—"బహుశా మీరు సినిమా పత్రికలు చదవరనుకుంటాను" అన్నాడు.

"సినిమా పత్రిక తిరగేసే తీరిక వుండదు నాకు. ఐతే, మీరా విమానంలో సినీ పరిశ్రమకి చెందిన వ్యక్తి రాక కోసం ఎదురు చూస్తున్నారన్న మాట!" అడిగేను నవ్వుతూ.

"మామూలు వ్యక్తి అయితే దేనికి వస్తాం? ఆమె సినీ ఫీల్డులో సంచలనం సృష్టించిన గొప్ప నటి! ఈ మధ్యే కొత్తగా మద్రాసు చిత్ర పరిశ్రమలో అడుగు పెట్టి, తన అసమాన నటనాకౌశలంతో, మూడవ చిత్రంతోనే 'ఊర్వశి' బిరుదును చేజిక్కించుకుంది.

ఢిల్లీలో జరిగిన బిరుదు ప్రదానోత్సవంలో పాల్గొని, అట్నించి, బొంబే స్టూడియోలో ఓ షూటింగ్ అటెండ్ జేసి, ఇప్పుడు మద్రాసు తిరిగివస్తోంది. అందుకే, సినీ ప్రెస్ రిపోర్టర్లమంతా ఇక్కడ పోగయ్యాం!"

"ఆమె పేరు?"

"జనప్రియ!"

ఆశ్చర్యంతో నా కళ్ళు విప్పారేయి. ఏ జనప్రియనైతే కిడ్నాప్ చెయ్యడానికి పథకం వేయబడిందో, ఏ జనప్రియకోసం నేనిక్కడికి వచ్చేనో ఆమె సినిమా తారా?

ఇంతలో, విమానం రన్‌వే మీద దిగింది.

డేవిడ్ వైపు తిరిగేను. "జనప్రియ ఈ మధ్యే సినిమా రంగంలో ప్రవేశించిన కారణంగా, మనకు సినిమాలు చూసే తీరుబడి లేనికారణంగా, జనప్రియ ముఖ పరిచయం లేదు మనకు. అందుకే నువ్వు విడిగావుండి విమానంలోంచి దిగేవాళ్ళని కనిపెట్టు!"

డేవిడ్ తలూపి జనంలో కలిసిపోయేడు.

# 5

విమానంలోంచి జనం దిగడం ప్రారంభించేరు. బైట నిల్చున్నవారి తోక్కిసలాట ఉధృతమయింది.

సరిగ్గా ఆ క్షణంలో "రక్షించండి...రక్షించండి... చంపేస్తున్నారు...బాబోయ్!" అన్న కేకలు విని, ఉలిక్కిపడి అటు చూసేను.

నలుగురు వస్తాదుల్లాటి మనుషులు కలసి, ఓ వ్యక్తిని చితక బాదుతున్నారు. విమానం వైపు తోసుకొస్తున్న జనం, ఇప్పుడా స్టంట్ మాస్టర్ల చుటూ గుమిగూడ సాగేరు.

అటు దౌడు తీసేను. గుంపును చీల్చుకుంటూ లోనికి దూరేను. చుట్టూనిల్చుని తమాషా చూస్తున్న వారిమీద ఒళ్ళు మండిపోయింది నాకు.

"నలుగురు కలసి ఓ వ్యక్తిని చితక తంతోంటో, రక్షించడం పోయి, తమాషా చూస్తారా?" అంటూ బూటుకాలితో ఓ వస్తాదు డొక్కలో ఈడ్చితన్నేను.

వాడు ఎగిరి అవతల పడ్డాడు. అంతే!

మరుక్షణం అక్కడ పెద్దదొమ్మీ ప్రారంభమయింది. ముష్టిఘాతాలూ, తన్నులూ కురవసాగేయి. ఎవరుఎవర్ని తంతున్నారో పాలుపోవడంలేదు.

కొద్ది సేపట్లో స్థానిక పోలీసులువచ్చి పరిస్థితిని అదుపు లోకి తెచ్చారు. ఇప్పుడా వస్తాదులు నలుగురూ, నేల మీదపడి మూలుగుతున్నారు. అంతక్రితం వాళ్ళ చేత తన్నులుతిన్న వ్యక్తి, కింద కూర్చొని దెబ్బలు సలుపు తుంటున్నాడు.

"మిస్టర్! ఎవరు మీరు? ఈ వెధవలు దేనికి దాడి జేసారు మీమీద?" అడిగానతన్ని.

"తెలీదండీ! నా పేరు సూర్యారావు. ఓ సినిమా పత్రిక రిపోర్టర్ని. ఈ బ్రూట్స్ అన్యాయంగా చితగ్గొట్టేరు నన్ను" అన్నాడతను రుద్ధకంఠంతో.

కింద పడున్న ఓ రౌడీని సమీపించి కాలర్ పట్టి కూర్చోబెట్టేను. "చెప్పు! అతన్నెందుకు కొట్టారు? నిజం చెబితేసరి. లేదా బూటు కాలితో తన్ని తన్ని నీ పక్కటెముకలు విరగ్గొడతాను."

నా బెదిరింపు పనిచేసింది. "ప్రదీప్‌కుమార్ అనే వ్యక్తి మమ్మల్నిక్కడికి తెచ్చాడు. నలుగురికీ చెరో వంద ఇచ్చి, విమానం రాగానే గుంపులో ఈ వ్యక్తిని చూపించి, తన్నమని పురమాయించేడు..."అన్నాడతను బెదురు చూపులు చూస్తూ.

అప్పుడర్థమైంది నాకా నాటకం ఏమిటో?

అప్పటికే ఆలశ్యం జరిగిపోయింది. సార్జంట్ డేవిడ్ రొప్పుతూ వచ్చి "సార్, మనం పప్పులో కాలేశాం! ఇక్కడీ గొడవ ప్రారంభమవగానే, గుండాల మరో దళం అటు జనప్రియను ఎత్తుకెళ్ళారు. ఆమెతో బాటు మరో యువతిని తీసుకెళ్ళారు. జనప్రియతో వున్న ఆమె బిజినెస్ మేనేజర్ని వాళ్ళు మూర్ఛపోగొట్టేరు. చూస్తూ

చూస్తూనే జరిగిపోయిందిదంతా!" అన్నాడు.

"ఆ మేనేజర్ ఎక్కడున్నాడిప్పుడు?"

"రండి చూపిస్తాను" అంటూ గుంపులోంచి బయట పడ్డాడు డేవిడ్.

రాడీలను స్థానిక ఇన్‌స్పెక్టరుకు అప్పగించి, అతన్ని అనుసరించాను. ఓచోట మరోగుంపు గుమికూడివుంది.

"జనప్రియ బిజినెస్ మేనేజర్ మీరేనా?" అడిగేను. అప్పుడే స్పృహలోకి వచ్చిన అతను చుట్టూ అయోమయంగా చూస్తూ తలూపేడు.

"ఆ గుండాలు జనప్రియతోబాటు మరోయువతినీ ఎత్తుకు పోయేరట. ఎవ్వరామె?"

"ఆవిడ పెర్సనల్ సెక్రటరీ, శశికళ."

"మీ పేరు?"

"విక్రమ్!"

"నేను సిటీ క్రయింబ్రాంచి ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డిని! మా వెంట రండి. పోలీస్ హెడ్‌క్వార్టర్సులో మీ వాఙ్మూలం తీసుకోవాలి" అంటూ అతని భుజంపట్టి నిలోబెట్టేను.

ముగ్గురం జీప్ ఎక్కాం!

# 6

నేనే డ్రయివ్ చేస్తున్నాను. విమానాశ్రయం ఏరియాదాటి, చీకట్ని చీల్చుకుంటూ నగరంవైపు పరుగెడుతోంది జీపు.

ఓచోట హఠాత్తుగా సడన్ బ్రేక్ వెయ్యవలసివచ్చింది హెడ్‌లైట్స్ కాంతిలో రోడ్డుమధ్య ఓయువతి నిల్చుని చేతులెత్తి ఆపమని సైగ జేస్తోంది. ఆమె దుస్తులకూ చేతు

లకూ మొహానికి దుమ్మూ ధూళీ అంటుకునుంది.

"జనప్రియ ఆమే!" అన్నాడు విక్రమ్ దాదాపు అరుస్తూ.

ఆశ్చర్యంతో నాకళ్ళు పెద్దవయ్యేయి. ఆమె సినిమా నటిలాకాక, సాదా చీరలో సామాన్యమైన యువతిలా కనిపిస్తోంది. ఎటువంటి తళుకూ బెళుకూ లేకుండా!

అంతలో ఆమె గబగబ జీపును సమీపించి, "అరె, విక్రమ్‌గారా! ఎక్కడికెళ్తున్నారు?" అడిగింది ఆశ్చర్యంగా.

"మీగురించి పోలీస్ హెడ్‌క్వార్టర్సులో రిపోర్టివ్వడానికి. వీరు క్రయింబ్రాంచి ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డిగారు" అన్నాడు విక్రమ్ నన్ను చూపిస్తూ.

"ఎంత విచిత్రం! మద్రాసు చేరిన మరుక్షణం నేను మిమ్మల్నే కలుసుకోవాలనుకున్నా ఇన్‌స్పెక్టర్ గారూ!" అంది జనప్రియ ఫ్రంట్‌సీట్లో కూర్చుంటూ.

"మిమ్మల్ని గుండాలు కిడ్నాప్ చేశారుకదా! ఇంత త్వరగా వారి బారినుండి ఎలా తప్పించుకోగలిగారు?" అడిగాను ఆశ్చర్యంగా.

జనప్రియ నవ్వి "అదికూడా యిలాగే కాకతాళీయంగా జరిగిపోయింది. బహుశా, వాళ్ళు నన్నింతవరకూ చూసి ఉండరు. అందుకే నాతోబాటు నా సెక్రటరీ శశికళనూ బలవంతంగా లాక్కెళ్ళి వారి కార్లలో కుదేసారు.

నా సెక్రటరీకాస్త ఎక్కువ మోతాదులో అలంకరించుకునుంటుంది. ఆ గుండాలు ఆమెనో కార్లో, నన్నో కార్లో కుదేసి ఈదారిన బయలుదేరారు. నావెంట వున్న రౌడీలను బట్టి నన్ను వాళ్ళెరగరని తెలిసిపోయింది.

అప్పుడే నాకో ఉపాయం తట్టింది. జనప్రియముందు వెళుతున్న కార్లో వుందనీ, నేనామె సెక్రటరీననీ చెప్పేను వాళ్ళకి. అంతే! డోర్ తెరచి నన్ను ఒక్క తోపు తోసిపోయేరు'' అంది.

''మీ సమయస్ఫూర్తిని అభినందించాల్సిందే! మీరు ప్రదీప్ కుమార్ చక్రబర్తి అనే బెంగాలీని యెరుగుదురా?''

''లేదు. ఎవ్వరతను?''

''సరే, ఆజన్మయవ్వన కార్పొరేషన్ పేరు విన్నారా ఎప్పుడయినా?''

''లేదే! ఎక్కడుందది?''

''ఆశ్చర్యంగా ఉందే! వాళ్ళగురించి ఏమీ తెలియని, మిమ్మల్ని వాళ్ళు దేనికి అపహరింప బూనేరు? సరే, తన వయసు నూటానలభయ్యేళ్ళని చెప్పుకునే వృద్ధుడు సుందర రాజన్ తెలుసా మీకు?''

జనప్రియ నిట్టూర్చి ''తెలుసు!'' అంది.

''ఎలా తెలుసు?'' అడిగాను ఆతృతగా.

''ఆయన మా ముత్తాత!''

''ఆ వృద్ధుడు మీ ముత్తాత?''

''ఔనుట! నేనింతవరకూ అతడ్ని చూళ్ళేదు. ఢిల్లీలో బిరుదు ప్రదానోత్సవంలో పాల్గొని, అట్నించి బొంబే వెళ్ళాను ఓ షూటింగ్‌లో పాల్గోడానికి.

అక్కడి స్టూడియోలో షూటింగ్ కార్యక్రమంలో మునిగి తేలుతున్న నాపేర ఓ ఉత్తరమూ, పెద్దపార్శిలూ వచ్చాయి ఇక్కణ్నించి. సంతకం చేసి తీసుకొన్నాను. ఆ పార్సెల్ లోపల రేకుపెట్టె వున్నట్టుంది. పైన

కేన్వాస్ గుడ్డతో చాలా పకడ్బందీగా పేక్ జేసి, జాగ్రత్తగా సీలువేసి వుంది. ముందు ఉత్తరాన్ని చదివి తెల్లబోయాను.

ఓ పట్టాన నమ్మ బుద్ధి కాలేదు అందులోని విషయాలు. చాలా అసహజంగా ఉన్నాయి.

ఆ ఉత్తరం రాసిన వ్యక్తి పేరు సుందరరాజన్ట! ఆయనకిప్పుడు నూటనలభయ్యేళ్ళట. నేనాయన ముని మనుమరాలి కూతుర్నిట. కొన్ని చిత్రమైన పరిస్థితుల్లో ఆయన ఇన్నాళ్ళూ మమ్మల్ని కలుసుకోలేక పోయేడుట.

అనుకోకుండా మద్రాసుచేరి తన వంశజుల గురించి ఆరాతీస్తే మిగిలింది, ఇప్పుడావంశంలో మిగిలి వున్నది నేనొక్కర్తినే అని తెలిసిందిట. సమయానికి నేను మద్రాసులో లేనందువల్ల, తనని కొందరు దుష్టులు వెన్నాడుతున్నందువల్ల, తన దగ్గిరున్న ఒక అమూల్యమైన పాకెట్‌ను నాకు పార్శిల్ జేస్తున్నాననీ, తనని దాన్ని నా ప్రాణంకన్నా ఎక్కువగా చూసుకోమనీ రాసేడు.

నాకెందుకో ఆ ఉత్తరం వఠి బూటకమనిపించింది. మనిషి నూటానలభయ్యేళ్ళు జీవిస్తాడా ఎక్కడైనా? అతను నిజంగా నా ముత్తాతే అయితే, రెండు తరాలు గడిచిపోయే వరకూ ఎక్కడున్నాడు?

ఎన్నడూ లేనిది నేను సినిమా నటిసైస్వల్ప వ్యవధిలోనే పేరు ప్రఖ్యాతులు సంపాదించుకుంటున్న సమయంలో, హఠాత్తుగా ఎక్కణ్నించి ఊడిపడ్డాడు? అంతా నాటకమనిపించింది.

కొత్తగా ఫీల్డులో ప్రవేశించిన నేను, ఇంత త్వరగా

తారాపథాన్ని అధిగమించడాన్ని ఓర్వలేక, యెవ్వరో ఆ పార్శిల్లో నాకు నష్టం కలిగించేదేదో పెట్టి పంపివుంటారనీ, దాన్ని తెరవకుండా నా పేరుమీదే మద్రాసుపంపి, బొంబేలో షూటింగ్ పూర్తయ్యాక ఇక్కడికి వచ్చి, దాన్ని విడిపించుకొని, పోలీసు అధికార్లను కలుసుకోవాలని అనుకున్నాను.

ఊహించని విధంగా ఇప్పుడీ సంఘటన జరిగింది. దీనితో నా అనుమానం వట్టి అనుమానం కాదని తేలిపోయింది.''

''ఇప్పుడా పేకట్ ఎక్కడుంది?'' అడిగాను.

''ఇక్కడి జనరల్ పోస్టాఫీసులోనే ఉండివుంటుంది. ఎందుకంటే నేను దాన్ని బొంబేనుంచి నాలుగురోజుల ఇక్కడి నా అడ్రస్పై, నాపేరు మీదే పంపేను.

నా సంతకం లేనిదే దాన్నెవరికీ ఇవ్వలేదుకదా. డిస్పాచ్ కాకుంటే, ఏడు రోజులవరకూ అది పోస్టాఫీస్లోనే పడుంటుంది.''

''మీ సెక్రటరీని తీసికెళ్ళిన ఆ గుండాలు ఈపాటికి తాము తెచ్చింది మిమ్మల్ని కాదనీ, మీ సెక్రటరీననీ గ్రహించి ఉంటారు. ఆమెను హింసించి ఆ పార్సెల్ ఎక్కడుందోకూడా కనుక్కునుంటారు.

మనం వెంటనే జనరల్ పోస్టాఫీసునుండి దాన్ని తెప్పించుకోవాలి. నగర కమీషనర్ గారితో మాట్లాడి నేనా ఏర్పాటు చేస్తాను. అంతవరకూ మీరు మా హెడ్ క్వార్టర్లో సురక్షితంగా ఉండండి!'' అన్నాడు.

ఆమెనీ, ఆమె మేనేజర్ని హెడ్క్వార్టర్లో వదలి, సార్జంట్ డేవిడ్తో హుటాహుటిన వెళ్ళి కమీషనర్

గార్ని కలుసుకున్నాను. ఆయనకు విషయమంతా విపులీ కరించి, నా పథకాన్ని వివరించాను.

ఆయన తక్షణం పోస్టాఫీస్ అధికార్లకు ఫోన్ చేసి, నలుగురు కానిస్టేబుళ్ళతో కూడిన వ్యాన్ను పంపారు పోస్టాఫీసుకు. అలాగా నేను సార్జంట్ డేవిడ్ కు కొన్ని సూచనలిచ్చి విడిగా పంపేను.

## 7

జనరల్ పోస్టాఫీసులో రాత్రింబవళ్ళు పని జరుగు తుంటుంది. నగరం నడిబొడ్డున, నాలుగురోడ్ల కూడలిలో వుంది నాలుగంతస్తుల పోస్టాఫీసు భవనం. దానికొక్క స్త దూరంలో, కీనీడలో జీప్ ఆపి చూస్తూ కూర్చున్నాను.

అప్పటికే పోస్టాఫీసు ప్రాంగణంలో కమీషనర్ గారు పంపిన పోలీసువ్యాన్ వచ్చి ఆగివుంది. బహుశా, కాని స్టేబుళ్ళు పార్శిల్ తీసుకోడానికి లోని కెళ్ళుంటారు.

రాత్రి పన్నెండు గంటలవుతోందిప్పుడు.

లోనికెళ్ళిన కానిస్టేబుళ్ళు బయటికివస్తూ కనిపించారు. ఒకతని చేతిలో పెద్దపాకెట్ వుంది. నలుగురూ వ్యాన్ ఎక్కి బయలుదేరారు. వాళ్ళని ఫర్లాంగుదూరం పోనిచ్చి స్టార్ట్ చేశాను.

ఆ వ్యాన్ దృష్టిలోంచి తప్పిపోకుండా జాగ్రత్తగా ఫాలో అవసాగాను. పోస్టాఫీస్ కూ, పోలీస్ హెడ్ క్వార్టర్ కూ మధ్య ఒకచోట నిర్మానుష్య ప్రదేశం వస్తుంది. నేనేదయితే ఊహించానో, సరిగ్గా అదే జరి గిందక్కడ.

ముందు వెళుతున్న వ్యాన్, ఆ నిర్మానుష్య ప్రదేశం చేరగానే సడన్ గా ఆగిపోయింది. నేనూ వెంటనే జీప్

ఆపి, హెడ్ లైట్స్ ఆఫ్ చేసి, చూస్తూ కూర్చున్నాను.

వ్యాన్ లైట్లు ఇంకా వెలుగుతున్నాయి. ఆ కాంతిలో దానికెదురుగా రోడ్డుకడ్డంగా రెండు కార్లు ఆగివున్నాయి. అందుకే, వ్యాన్ డ్రైవర్ విధిలేక వ్యాన్ ఆపేడు.

వ్యాన్ ఆగిన మరుక్షణం చీకట్లోంచి నలుగురైదుగురు వ్యక్తులు వచ్చి, బలవంతంగా వ్యాన్ తలుపులు తెరిపించేరు. అందులో ఒకడి దగ్గిర స్టెయిన్ గన్ కూడావుంది. లోపలున్న కానిస్టేబుళ్ళని ఇవతలికి లాగి, వారివద్దవున్న ఆ పాకెట్ లాక్కుని, కార్లలో దూరి దూసుకుపోసాగేరు.

జీప్ స్టార్ట్ చేశాను. రివ్వున ముందుకు పోనిచ్చాను.

వ్యాన్ పక్కనించి పోతూ "మీరు వెళ్ళిపోండి!" అన్నాను కానిస్టేబుళ్ళతో.

దుండగుల కార్లు చాలా వేగంగా పోతున్నాయి ముందుకు. నేనూ అదే స్పీడ్ ప్రిపేర్ అవుతూ, వారికి ఫర్లాంగు యివతల వుండి ఫాలో అవుతున్నాను హెడ్ లైట్స్ వెలిగించకుండా!

నగర పొలిమేరలు దాటాం!

ఆ కార్ల హెడ్ లైట్స్ కాంతి తప్ప, చుట్టూ చిరుచీకటి. మెయిన్ రోడ్ వదలి కుడివైపు తిరుగుతున్నాయి కార్లు.

రాళ్ళూ రప్పలూ దాటుకుంటూ దాదాపు మైలు దూరం వెళ్ళి శిథిలమైవున్న ఓ యింటి దగ్గిర ఆగేయి కార్లు. చిన్న చిన్న పొదలతో నిండివుంది ఆ ప్రదేశం. ఒక పొద పక్కన జీప్ నిలిపి, ఇంజన్ ఆఫ్ చేశాను.

ఆ నలుగురూ కార్లలోంచి దిగి, గబగబ శిథిలాల్లో అదృశ్యమయ్యేరు. జీప్ దిగి, అటు నడిచేను. శిథిలాల్లో

ప్రవేశించి చుట్టూ కలయచూసేను.

ఓ చోట గదిలాంటిది కనిపిస్తోంది. జీర్ణదశలో వున్న చెక్క తలుపు మూసివుంది. దాని పక్కనే మూసివున్న ఊచల కిటికీ కనిపిస్తోంది. లోపలినించి సన్నగా మాటలు వినిపిస్తున్నాయి.

పిస్తోలు తీసి, సవ్వడికాని అడుగులతో అటు నడిచేను. సందుల్లోంచి, లోపల కొవ్వొత్తి వెలుగుతున్నట్లు కాంతి కనిపిస్తోంది గుడ్డిగా.

సందుమధ్య కన్నుపెట్టి చూసేను లోనికి. పాకెట్ తెచ్చిన నలుగురు వ్యక్తులూ నిల్చున్నారు లోపల. గళ్ళ లుంగీ, చారల బనీను వేసుకున్న ఓ అజానుబాహుడు ఓ మూల రాతిమీద చతికిలబడున్నాడు.

వెంటనే గుర్తుపట్టేను వాణ్ణి. వాడే వేలాయుధం!

వారిమధ్య ఫుల్‌సూటులో వున్న ఓ నడివయసు వ్యక్తి నిల్చునున్నాడు. ఇప్పుడా పాకెట్ అతని చేతిలో వుంది. బహుశా, ప్రదీప్‌కుమార్ చక్రబర్తి అతనే అయ్యుంటాడు.

అతను వాళ్ళతో అంటున్న మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి నాకు.

"...ప్రపంచపు ధనరాసి అంతా నా చేతిలోవుంది. ఇందులోవున్న వస్తువుకోసం కోటీశ్వరులూ, అధికార్లూ తమ యావదాస్థిని పణంగా పెట్టమన్నా పెట్టగలరు!" అంటున్నాడు చక్రబర్తి మెరిసే కళ్ళతో ఆ పాకెట్‌ని చూస్తూ.

"ఐతే, మాకేమిస్తావ్?" అడిగేడు మూల కూర్చున్న వేలాయుధం.

"డబ్బు విషయమంటారా? నా సహచరులైన మిమ్మల్ని కొద్దిరోజుల్లో కుబేరుల్ని చేస్తాను. అంతేకాదు, మీ కెవ్వరూ యివ్వజాలని ఒక అమూల్యమైన బహుమతి కూడా యిస్తాను. చూడండి ఆ బహుమతి యీ పెట్టె లోనే వుంది" అంటూ పాకెట్ మీద కేన్వాస్ కవర్ లాగేడు చక్రబర్తి.

లోపల అల్యూమినియం పెట్టె వుంది. బటన్ వత్తి పెట్టి తెరిచేడు. అంతే! అతని ముఖం రంగులు మారింది.

పెట్టిలో గులకరాళ్ళూ, చిత్తుకాగితాలూ తప్ప మరేం లేవు!

"మోసం! ద్రోహం!! వేలాయుధం...మనం చిత్తుగా మోసపోయాం ఇది ఆ పెట్టెకాదు. ఎవ్వరో మార్చేశారు" అన్నాడు అరుస్తూ.

"ఆ ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి, ఆవులిస్తే పేగులు లెక్కపెట్టే పిండం! వాడి సంగతి నాకు తెలుసు. జిత్తులమారి నక్క! వాడే చేసుంటాడీపని!"

ప్రదీప్‌కుమార్ పళ్ళు పటపట కొరికి "అల్‌రైట్! వాడా పేకట్ చేజిక్కించుకున్నంత మాత్రాన సరికాదు. ఆ పేకెట్‌లో వస్తువు ఎందుకుపయోగపడుతుందో, అందులోని మహత్యం ఏమిటో వాడికి తెలియాలిగా!

ఇప్పుడు మనమిక్కడుండటం కుద దండగ. తక్షణం బంబోసా వెళదాం. అక్కడ ఆ వస్తువు కోకొల్లలుగా దొరుకుతుంది. కాస్త కష్టపడాలి. అంతే" అన్నాడు.

"బంబోసా ఏమిటి?" అడిగేడు వేలాయుధం అర్థం కాక.

"చెబుతాను. వివరంగా చెబుతాను. మీరంతా నా

వెంట రావడానికి సిద్ధంగా ఉన్నారా?''

''ఒకవేళ అక్కడ నీకావస్తువు దొరికితే మాకూ ఇస్తావా?'' అడిగేడు వేలాయుధం.

''నేను మీకిచ్చే ప్రత్యేక బహుమతి అదేమరి!''

''ఐతే, వస్తాం! ఇంతకీ ఏర్‌పోర్ట్ నుంచి మనం యెత్తుకొచ్చిన అమ్మాయిని ఏం చేద్దామంటావ్?''

''దానితో మనకిప్పుడు పనిలేదు. వదిలెయ్యండి!''

''వేలాయుధం! ఎవ్వరో బయట వున్నారు. మనల్ని గమనిస్తున్నారు. వెళ్ళండి పట్టుకోండి.'' అరిచేడు చక్రబర్తి ఉన్నట్లుండి.

వేలాయుధంతోపాటు మిగిలిన రౌడీలు తలుపువైపు పరిగెత్తారు.

మరుక్షణం నేను మెరుపులా చీకట్లోకి గెంతాను.

''అదుగో,ఎవ్వరో పారిపోతున్నారు'' అరిచాడొకడు.

''ఢాం...ఢాం...'' మంటూ పిస్తోళ్ళు పేలసాగాయి.

గుళ్ళు రయ్‌మంటూ నా పక్కలనుంచి దూసుకు పోతున్నాయి.

పరిగెత్తుతూనే పిస్తోలు వారివేపు గురిపెట్టి పేల్చసాగేను. దాంతో వాళ్ళు ముందుకు రాకుండా అక్కడే నిలబడి పోయేరు. పిక్కబలం కొద్దీ దౌడుతీస్తూ, జీపు దగ్గరకి జేరుకుని, క్షణాల్లో స్టార్టుజేసి బయలుదేరాను.

ఐదునిమిషాల్లో మెయిన్‌రోడ్డు మీదికెళ్ళి, మద్రాసు వైపు తిప్పాను. ఒకే ఒక విషయం నా బుర్రలోగింగురు మంటోంది.

'బంబోసా!'

ఎక్కడో ఎప్పుడో చదివినట్టుంది ఆ పేరు.

ఎక్కడ?

ఎంత ఆలోచించినా సమయానికి గుర్తువచ్చి చావడం లేదు!

# 8

మా హెడ్‌క్వార్టర్స్ ఆవరణలో జీప్ ఆపి దిగాను. మెట్లగుండా పైకెళ్ళి నా ఆఫీస్‌లో అడుగు పెట్టేను. అక్కడ విక్రమ్, జనప్రియ, డేవిడ్ నాకోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు.

టేబిల్‌మీద డేవిడ్ పోస్టాఫీస్‌నించి తెచ్చిన ఆ పార్సిల్ సురక్షితంగా వుంది.

కుర్చీలో చతికిలబడి, అంతవరకూ జరిగిన సంఘటనలు వారికి వివరించి "పోస్టాఫీస్‌లో ఆ పాకెట్లు మార్పించింది నేనే. వారి బందీగా వున్న మీ సెక్రటరీద్వారా, ఆ పాకెట్ పోస్టాఫీస్‌లో ఉందని వాళ్ళు కనుక్కుంటారని ఊహించి, కమీషనర్‌గారి చేత పోస్టల్ అధికార్ల సహాయంకోరి డేవిడ్‌ను ముందుగా విడిగాపంపి పార్శిళ్ళు మార్పించాను. కాని స్టేబుళ్ళు నకిలీ పాకెట్‌తో వ్యాన్‌లో బయలుదేరారు. డేవిడ్ అసలు పాకెట్‌తో ఇటొచ్చేశాడు. ఇప్పుడిందులో ఏముందో విప్పిచూద్దాం!" అంటూ పాకెట్ అందుకొని విప్పాను.

లోపల రేకుడబ్బా వుంది. దాన్ని తెరచి నివ్వెర బోయాం! ఏ మహత్తర వస్తువో వుంటుందనుకున్న ఆ పెట్టెలో, కేవలం ఆకుపచ్చరంగు చూర్ణంవుందినిండుగా.

ఆ చూర్ణంమీద మడతపెట్టిన ఓ కాగితంకూడావుంది. ముందు చిటికెడు చూర్ణంతీసి వాసన చూసేను. ఏదో ఆకును ఎండబెట్టి, దంచి చూర్ణం చేసినట్టుంది. విచిత్రమైన వాసన!

కాగితం అందుకుని మడత విప్పేను.

అది అరేబియా సముద్రపు మ్యాప్!

దిశలతో సహా, డిగ్రీలతో సహా, ద్వీపాలతో సహా గీసివుంది పెన్సిల్‌తో. ఓచోట ఎర్రసిరాతో యింటు మార్కు వేసి, దానిచుట్టూ గుండ్రంగా గీతగీసి 'బంబోసా' అని రాసివుంది.

"బంబోసా ఏమిటి?" అడిగేడు డేవిడ్ అర్థంకాక.

"స్టూడెంట్ లైఫ్‌లో నేను పుస్తకాల పురుగుని! ముఖ్యంగా సైన్సు గ్రంథాలమీదా, హిస్టరీ జాగ్రఫీ మీదా ఆసక్తి మెండుగా వుండేది. 'వరల్డ్ హిస్టరీ అండ్ జాగ్రఫీ' అనే గ్రంథంలో 'బంబోసా' గురించి చదివినట్టు జ్ఞాపకం వస్తోంది!

"బంబోసా, అరేబియా సముద్రంలోవున్న ఒక దీవి పేరు" అన్నాను సిగరెట్ అంటిస్తూ.

"ప్రపంచ మ్యాప్‌లో, సముద్రమందలి అతి చిన్న దీవులనుకూడా పొందుపరచడం జరిగింది. నాకు తెలిసినంత మటుకు ఆదీవిపేరు వరల్డ్ మ్యాప్‌లో యెక్కడా లేదే!" అన్నాడు విక్రమ్ ఆశ్చర్యంగా.

"నిజమే! ఆదీవి ప్రపంచ మ్యాప్‌లో మీకెక్కడా కనిపించదు. దాన్ని మ్యాప్‌లోంచి తొలిగించడం జరిగింది!"

"ఎందుకు?"

"అది అదృశ్యదీవి గనక!"

ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచారు ముగ్గురూ!

"అరేబియా సముద్రంలో ఒకచోట, సూర్యకిరణాలు ఒక విచిత్ర పరిణామానికి గురై వంగిపోతాయి, ఇంగ్లీషు

అక్షరం 'ఎల్' ఆకృతిలో! ఉదాహరణకి, నీళ్ళు నిండిన ఓ గాజుగ్లాసులో స్పూన్ వేసి చూడండి.

మన కంటికి స్పూన్ వంగిపోయినట్లు కనిపిస్తుంది. బంబోసాదీవి ప్రాంతంలో సూర్యకిరణాలు, సరిగ్గా ఇటు వంటి పరిణామానికే గురి అవుతాయి.

ఆ పరిణామం అక్కడ సంవత్సరానికి ఆరునెలలే ఉంటుంది. తరువాత సూర్య కిరణాలు మళ్ళీ యధాస్థితికి వస్తాయి. అంటే, నిటారుగా పడతాయన్నమాట! ఈ కారణంగా ఆదీవి ఆరునెలలు అదృశ్యమైపోతుంది!

అంటే, సూర్యకిరణాలు ఆరునెలలపాటు నిటారుగా పడటంవల్ల అది మనకంటికి కనిపించి, ఆరునెలలు వంగి పోవడంవల్ల కనిపించకుండా పోతుందన్నమాట! సముద్రంలో దీవిమాత్రం ఉన్నచోటే ఉంటుంది.

దీనికొక దృష్టాంతంకూడా ఉంది. ఒక చైనా యాత్రికుడు 1753 వ సంవత్సరం అక్టోబర్ నెలలో, అరేబియా సముద్రం మీదుగా ప్రయాణిస్తూ ఆ దీవిని చూసేడు. మొట్టమొదట అతను తన మ్యాప్‌లో అక్కడ దాని ఉనికిని తెల్పుతూ గుర్తులు పెట్టుకున్నాడు.

ఆరునెలల తరవాత, అతను మళ్ళీ ఆ దారినే తిరిగి వస్తే ఆ దీవి కనిపించలేదు!

ఆ తరవాత, 1768 మార్చి నెలలో, ఇంగ్లాండ్‌కు చెందిన రాబర్ట్ బ్రూస్ అనే నావికుడు సముద్ర దీవులను మ్యాప్‌లో పొందుపరచడానికి, అరేబియా సముద్రంలోకి ప్రవేశించేడు. అప్పుడతనికా దీవి కానవచ్చింది. మళ్ళీ ఆరునెలల తరవాత ఆ చుట్టుపక్కలకి వస్తే దీవి అదృశ్యం!

ఆనాటినించీ, ఆ మార్గాన ఓడల ప్రయాణాలను నిషేధించేరు. ఎందుకంటే ఆ దీవి అదృశ్యమై ఉన్న సమయంలో, ఆ మార్గాన ఓడలు ప్రయాణిస్తే దీవి గట్టుకు గుద్దుకుని తునాతునకలయ్యే ప్రమాదముంది మరి!

బహుశా నూరేళ్ళక్రితం, మద్రాసు రేవునించి ఆ సముద్రంమీదుగా ఆస్ట్రేలియాకు ప్రయాణమైన సుందర రాజన్ ఓడ తుపాను తాకిడికి గురై, బంబోసా దీవివైపు వెళ్ళి, దాని గట్టుకు గుద్దుకుని తునకలై ఉంటుంది.

అదృష్టవశాత్తూ అతను బ్రతికి బైటపడి, ఆ దీవిలో ప్రవేశించి ఉంటాడు. అటువంటి విచిత్రమైన దీవిలో జన సాంద్రత ఉండే ప్రసక్తి లేదు. సుందరరాజన్ ఒక్కడే అక్కడి ఆకులలములు తింటూ, ఆ దారిన ఓడ లేవైనా వస్తాయేమోనని కాచుకునుంటాడు.

సముద్ర యానంలో ఆ మార్గం నిషేధించబడినప్పుడు, అతనికి సహాయం ఎట్లాఅందుతుంది? నిరీక్షణలోనే అతనా దీవిలో వందేళ్ళు గడిపివుంటాడు...''

''ఐతే, మళ్ళీ ఇక్కడికెలా జేరుకోగలిగేడు? ఇంత వయసు మీరినా, అంత బలంగా ఎలా వున్నాడు?'' అడిగేడు డేవిడ్.

''ఈ ప్రశ్నలకి సరైన జవాబులు అతనే ఇవ్వాలి. మనపరంగా ఆలోచిస్తే, అతనా దీవిలో ఆకులలములు తింటూ, స్త్రీ సాంగత్యంలేక ఏకాకిగా బ్రతికేడు. స్వచ్ఛమైన వాయువు పీల్చేడు.

అంతేగాక, ఆ దీవిలో మామూలు ప్రపంచంలో లేని చెట్లూ చేమలూ ఉండివుంటాయి. వాటిలో మనిషిని

దీర్ఘాయుష్కుడిగానూ, నిత్యయవ్వనుడిగానూ ఉంచే ప్రకృతిసిద్ధమైన రసాయనాలేవో నిండివుంటాయి.

నిత్యం వాటిని భుజించిన సుందరరాజన్, ఇప్పటికీ ఇలా చెక్కుచెదరకుండా ఉండివుంటాడు. పోతే, అతనిక్కడికి మళ్ళీ ఎలా రాగలిగేడు? ప్రదీప్ కుమార్ చక్రబర్తితో అతనికెలా పరిచయమైంది? మొదలైన ప్రశ్నలు ఊహాతీతంగా ఉన్నాయి."

"కొంపదీసి, ఈ పెట్టెలోని చూర్ణమే అతని దీర్ఘాయుస్సుకూ, నిత్య యవ్వనానికీ కారణం కాదుకదా?"

"ఔను. నాకూ అలాగే తోస్తోంది. లేకుంటే దీని కోసం వాళ్ళింత ఆర్భాటం దేనికి చేస్తారు? పరిస్థితులు తారుమారైన దృష్ట్యా ఇప్పుడు ప్రదీప్ కుమార్ చక్రబర్తి, తన సహచరులతో బంబోసా వెళ్ళబోతున్నాడు, ఈ చూర్ణంకోసం! మనం వెంటనే వెళ్ళి అతన్ని అతని ముఠాని పట్టుకోవాలి" అన్నాను లేస్తూ.

# 9

"అదుగో, బంబోసా!" అన్నాను షైనాక్యులర్స్ లోంచి కింద, సముద్రం మధ్య కనిపిస్తున్న దీవిని చూస్తూ.

నా పక్కనే, కాక్ పిట్ లో కూర్చున్న డేవిడ్ తొంగి చూసేడు కిందికి. దీవిపైన ఎగురుతోంది మా విమానం!

పైనించి దీవిమీద పచ్చనిచెట్లూ, ఇసుక తిన్నెలూ కొండరాళ్ళూ కనిపిస్తున్నాయి.

దీవి మొత్తంమీద, మనిషిమాత్రుడు కానరావడం లేదు.

"సార్! అటు చూడండి!" అన్నాడు డేవిడ్.

బైనాక్యులర్స్‌లోంచి చూసేను ఆవైపు. కొండరాళ్ళ నడుమ ఓ ఇసక తిన్నెమీద ఆగివుంది ఓ విమానం! నా అనుమానం నిజమే అయింది. చక్రబర్తి ముఠాను మేము పట్టుకోవడానికి వెళ్ళేలోగా వాళ్ళు తమస్వంత విమానంలో పరారయ్యారు. అనుమానంపై మేమూ ఈ దీవికి బయలుదేరాము.

"అది వాళ్ళ విమానమే అయుంటుంది. పైలెట్! మన ప్లేన్ని దీవి ఒడ్డున సముద్రంలో దింపెయ్" అన్నాను.

పైలెట్ తలూపి, దీవి చుట్టూ ఓ రౌండ్ కొట్టించి మెల్లిగా దింపసాగేడు సముద్రంమీద.

ఐదు నిమిషాల తరవాత మా విమానం మోటర్ బోట్‌లా నీటిమీద తేలసాగింది. నైలాన్ తాళ్ళతో విమానానికి గట్టుమీది రాళ్ళతో లంగరువేసి, అవసరమైన వస్తువులు తీసుకుని, దీవిమీద అడుగుపెట్టాం.

చిత్రమైన థ్రిల్!

దూర దూరంగా ఎటుచూసినా నిర్మానుష్యం. అది వరకూ మేమెన్నడూ చూడని విచిత్రమైన చెట్లూ, చేమలూ కనిపిస్తున్నాయి. మాకు చేరువలోనే, కొండ రాళ్ళు కొరివి దెయ్యాల్లా నిలిచివున్నాయి.

"సార్! అటు మాడండి" అన్న డేవిడ్ కంఠం విని ఉలిక్కిపడి అటు చూసేను.

కొండరాళ్ళ మధ్య ఎవ్వరో కదులుతున్నట్లు లీలగా కనిపిస్తోంది. బైనాక్యులర్స్‌లోంచి పరీక్షగా చూసేను.

సుందరరాజన్!

అరచేతుల్ని గుండ్రంగా చుట్టి, కళ్ళదగ్గర పెట్టుకుని, బైనాక్యులర్స్‌లోంచి చూస్తున్నట్టు మమ్మల్ని చూస్తున్నాడు. అతను ఇక్కడ ఎందుకున్నాడో నాకు అంతు బట్టలేదు.

"ఢాం!" మన్న చప్పుడుతో కొండరాళ్ళు మారుమోగేయి.

మరుక్షణం, సుందరరాజన్ లేడిలా గెంతుతూ రాళ్ళలో మాయమయ్యేడు. ఆ చప్పుడు వినిపించినవైపు చూసేను. ఓ రాయి చాటున ప్రదీప్‌కుమార్ చక్రబర్తి ఒదిగి కనిపించేడు. అతని చేతిలో పిస్తోలు!

బహుశా, అతనే సుందరరాజన్ మీదికి పిస్తోలు పేల్చి ఉంటాడు. సుందరరాజన్ గురి తప్పి పారిపోవడంతో, ప్రదీప్‌కుమార్ మావైపు చూసి, మరుక్షణం రాళ్ళల్లో అదృశ్యమయ్యేడు.

"డేవిడ్! నువ్వు పైలెట్‌తో కలిసి, సుందరరాజన్ను వెతకండి. నేను ప్రదీప్‌కుమార్ని, అతని అనుచరుల్ని చూసుకుంటాను" అంటూ అటు పరుగుతీసేను.

ఓ బండ చాటున నక్కి, ఎక్కడైనా ఏ అలికిడైనా వినిపిస్తుందేమోనని చెవులు రిక్కించేను. నిశ్శబ్దం!

అడుగులో అడుగు వేసుకుంటూ ప్రదీప్‌కుమార్ పారిపోయినవైపు నడిచేను. కొద్ది దూరం వెళ్ళగానే ఎవ్వరో తగ్గుస్వరంలో గుసగుసలాడుకుంటున్నట్టు వినిపించి, చటుక్కున ఆగిపోయేను.

చుట్టూ రాళ్ళు అడ్డంగా ఉన్నాయి. కుడివైపునించి వినిపిస్తున్నాయి మాటలు. పిస్తోలు రెడీగా పట్టుకుని పిల్లిలా అడుగులు వేస్తూ అటు నడిచేను. ఎత్తైన రెండు రాళ్ళ నడుమ, మనిషి పట్టేంత ఇరుకు సందుంది!

ఆ సందుగుండా అవతలికెళ్ళానో లేదో, ప్రదీప్ కుమార్, వేలాయుధం కనిపించేరు! పరస్పరం మాట్లాడు కుంటున్నారు. సడన్ గా ప్రదీప్ కుమార్ దృష్టి నా మీద పడింది. మరుక్షణం అతని పిస్తోలు పొగలు కక్కింది. గుండు రయ్యిమంటూ నా పక్కనించి దూసుకు పోయింది.

ఫైర్ చేశాక అతను మెరుపులా ఓవైపు దౌడు తీసేడు. అరక్షణంలో రాళ్ళమధ్య అదృశ్యమయ్యేడు ప్రదీప్ కుమార్!

వేలాయుధం పరిగెత్తుతూ, పరిగెత్తుతూ హఠాత్తుగా చేతులు పైకెత్తి, గావుకేక పెడుతూ అమాంతం నేలలో దిగిపోయేడు. ఆ దృశ్యం చూసి నిర్ఘాంతపోయేను. చూస్తూ చూస్తూనే చెట్టంత మనిషి అమాంతం నేలలో ఎలా మాయమయ్యేడు? అక్కడ రాతినేలతప్ప గొయ్యి లాటిదేమీ లేదే?

గబగబ అటు నడిచేను. పరీక్షగా చూసేను నేలని. అతను కూరుకుపోయిన చోట వెడల్పాటి గుండ్రని రాయి మిగతా రాతికంటే కాస్త ఎరుపు రంగులో కని పించింది.

సడన్ గా ఆలోచన వచ్చి చుట్టూ కలయచూసేను. చాలా బరువున్న ఓ రాయి అందుకుని, వేలాయుధం మాయమైన చోట ఎత్తేసాను. అంతే! రాయి అమాంతం నేలలోకి వెళ్ళిపోయింది. ఆ లిప్తపాటు వ్యవధిలో, ఆ చోట గుండ్రని పెద్ద సొరంగంలాటిది కనిపించి తిరిగి మూసుకుపోయింది.

నేను వేసిన రాయి బరువుతో అది కిందికెళ్ళి తిరిగి

మూసుకుంటున్నప్పుడు దానికింద బాగా చిలుముపట్టిన స్ప్రింగులున్నట్టు కిర్రుమనే చప్పుడు వినిపించింది!

మానవమాత్రుడు నివసించలేని ఈ అదృశ్యదీవిలో ఇటువంటి భూసొరంగాలుండటం ఎంత విచిత్రం!

ఇప్పుడు వేలాయుధం లోపల ఏమయ్యేడో చూడటం కన్నా ప్రదీప్‌కుమార్‌ని వెదికి పట్టుకోవడం ముఖ్యం!

అంతక్రితం అతను పరిగెత్తినవైపు నడిచేను.

ఓ చోట బండలమధ్య చిన్న సెలయేరు పారుతోంది. నీటిలో తడసిన బూట్సు ముద్రలు అవతలివైపు వెళుతున్నాయి.

ఒక్క జంపులో అవతలి గట్టుమీదికెళ్ళాను. ఆ గుర్తుల్ని చూసుకుంటూ ముందుకి నడిచేను. కొద్ది దూరం వెళ్ళి అడుగుజాడలు ఆగిపోయేయి. అక్కడ సరిగ్గా వేలాయుధం పడిపోయిన చోట ఉన్నట్టే వెడల్పాటి గుండ్రని ఎరుపురాయి కనిపిస్తోంది.

అంటే, అటువంటి సొరంగ మార్గమే అక్కడకూడా వుందన్నమాట! కింద కూర్చుని పరిశీలిస్తున్నాను. వెనక ఏదో చప్పుడైంది. గిరుక్కున వెనుదిరిగాను.

సుందరరాజన్!

"ఈ సొరంగ మార్గాలు నిర్మించింది నేనే ఇన్‌స్పెక్టర్! ఇప్పుడు నాకు మీ సహాయం కావాలి. ఆ నీచుడు ప్రదీప్‌కుమార్ని, వాడి అనుచరుల్ని నేనొక్కణ్ణే లొంగదీయలేననిపిస్తోంది" అన్నాడు చాలా నింపాదిగా. అతని చేతిలో పిస్తోలు వుంది.

నవ్వేను. "నువ్వు ముందే మాతో చేతులు కలిపి వుంటే పరిస్థితి ఇంతదూరం వచ్చేదికాదు మిస్టర్ సుందర

రాజన్! ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు.

నాకు అర్థంకాని విషయమల్లా మీకూ, ప్రదీప్ కుమార్ కూ పరిచయమెలా కలిగింది? వందేళ్ళు ఇక్కడ గడిపిన మీరు హఠాత్తుగా మద్రాసెలా చేరుకున్నారు?" అడిగేను.

సుందరరాజన్ చిన్నగా నవ్వి "అదొక కథ! ప్రదీప్ కుమార్ ఇంటర్నేషనల్ స్మగ్లర్ అని మీకు తెలుసుగా? ఒక సారతను తన విమానంలో ఈ దీవి మీదుగా వెళుతూ విమానం ఇంజన్ ట్రబులివ్వడంవల్ల దిక్కుతోచక విమానాన్ని దీవిలో దింపేసేడు.

నూరేళ్ళనించీ అటువంటి సంఘటనకోసమే తహ తహలాడుతున్న నాకు, అతన్ని చూడగానే పట్టరాని ఆనందం కలిగింది. రెండు మూడు రోజులు నాతో బా టతనిక్కడే గడిపేడు.

ఈ దీవిలో ఒక విచిత్రమైన ఆకు వుందనీ, దాన్ని తినడంవల్లే నేనిలా ఉన్నాననీ, నన్ని దీవినించి మద్రాసు చేరిస్తే అతనికా ఆకు చూర్ణం కొంత ఇస్తాననీ, దాన్ని ధనవంతులకమ్మి కుబేరులం కావచ్చనీ చెప్పేనతనికి.

దానికతను వెంటనే ఒప్పుకున్నాడు. ఇద్దరం కలిసి విమానాన్ని బాగుచేసుకుని, పెద్ద మొత్తంలో ఆ ఆకు చూర్ణాన్ని మూటగట్టుకుని మద్రాసు చేరుకున్నాం.

అక్కడికెళ్ళగానే వాడిలో దురాశ మొలకెత్తింది. ఆ చూర్ణాన్ని అంతా కాజేసి తానొక్కడే డబ్బు చేసు కోవాలని ప్లాన్ వేసేడు. నేనతని దురుద్దేశాన్ని వెంటనే పసిగట్టి చూర్ణాన్ని డబ్బాలో ప్యాక్ చేసి బొంబాయి వెళ్ళిన నా ముని మనమరాలు జనప్రియకు పంపేను..."

"ఇప్పుడు తీరింది నా సందేహం! రండి ప్రదీప్ కుమార్ ఈదారినే కిందికెళ్లుంటాడు. ఆలస్యం చెయ్యకూడదు. వాణ్ణి పట్టుకోవడానికిదే మంచి అవకాశం!" అంటూ కిందున్న పలకరాతిని గట్టిగా వత్తేను.

రాయి కిర్రుమంటూ కిందికెళ్ళింది. మెట్లు కనిపించేయి. జాగ్రత్తగా లోనికి దిగేను. నా వెనుకే సుందరరాజన్ దిగివచ్చేడు. లోపల చిమ్మచీకటి!

"ఎంత చీకటున్నా ఈ మార్గాలు నాకు కొట్టిన పిండి! రండి నా వెనక!" అంటూ ముందుకు నడిచేడు సుందరరాజన్.

తడుముకుంటూ అతన్ననుసరించేను. ఓ చోట మలుపుంది. మలుపు తిరగబోయాం, అంతే! మా తలలమీద "ఠక్, ఠక్" మంటూ పడ్డాయి దెబ్బలు.

మొడలు నరికిన చెట్లలా కిందకూలాం!

# 10

తిరిగి కళ్ళు తెరిచిచూస్తే, ఓ గుహలాంటి గదిలో నేలమీద పడున్నాను. లోపల కొవ్వొత్తి వెలుగుతోంది. చేతులు వెనక్కి విరిచి కట్టివున్నాయి. నా పక్కనే సుందరరాజన్, డేవిడ్, పైలెట్ కూడా పడున్నారు అదే స్థితిలో.

మా చుట్టూ ప్రదీప్ కుమార్, వేలాయుధం అతని అనుచరులూ నిల్చున్నారు ఆయుధాలు పట్టుకుని. మేము కళ్ళు తెరవగానే ప్రదీప్ కుమార్ కంఠం ఖంగుమంది.

"మిస్టర్ సుందరరాజన్! నీవీ గుహల్లో దాచిన ఆ చూర్ణాన్ని మర్యాదగా మా కప్పగించు మిమ్మల్ని విడిచిపెడతాను. లేదా చిత్ర హింసలు పెట్టి ఇక్కడే చంపేస్తాం!"

సుందరరాజన్ పలకలేదు. కాసేపు ఆలోచించి, ఏమనుకున్నాడో ఏమో, సాలోచనగా తలూపేడు. "సరే మీ చేత చిత్రహింసలు పడేకంటే దాన్నిచ్చేసి, ప్రాణాలు దక్కించుకోడమే మేలు. ఈ గుహ కుడివైపు వెళితే నాలుగో గుహ వస్తుంది. అందులో ఒక రహస్య గది వుంది. ఆ గదిలో దాచేను ఆ చూర్ణాన్ని!"

"వెరీగుడ్! మా వెంటవచ్చి చూపించు ఆ రహస్య గది ఎక్కడుందో? లేవండి మీరంతా!" అన్నాడు ప్రదీప్ కుమార్ మమ్మల్ని ఆదేశిస్తూ.

లేచి నిల్చున్నాం అందరం!

"సుందరరాజన్! నువ్వు ముందుండి దారి చూపించు" అన్నాడు ప్రదీప్ కుమార్ టార్చిలైటు వెలిగిస్తూ.

సుందరరాజన్ మౌనంగా గుహ ద్వారంవైపు నడిచేడు. మా అందరి చేతులూ వెనక్కి విరిచి కట్టివున్నాయి. మౌనంగా సుందరరాజన్ని అనుసరిస్తున్నాం. ప్రదీప్ కుమార్ అనుచరులు ఆయుధాలతో మమ్మల్ని అనుసరిస్తూ రాసాగేరు.

ఇరుకైన దారిగుండా రెండు మూడు మలుపులు తిప్పి ఓ చోట ఆగేడు సుందరరాజన్. అక్కడ దారి సమాప్తం కాని, గోడలో రాతి తలుపు మూసివున్నట్టు కనిపిస్తోంది. ఆ తలుపు కడ్డంగా పొడవాటి ఇనప వస్తువేదో బిగించివుంది గోడలో.

"ఆ ఇనప కడ్డీ తొలగించి కొక్కెంపట్టి లాగితే, రాతి తలుపు తెరుచుకుంటుంది. ఆ గదిలోనే వున్నాయి చూర్ణం రాసులు!" అన్నాడు సుందరరాజన్.

"ఆల్ రైట్! ఇహ మీరు వెనక్కి జరగండి"

అంటూ టార్చి లైటు వేలాయుధం చేతికిచ్చి మమ్మల్ని తప్పుకోమంటూ ఆ తలుపుని సమీపించేడు ప్రదీప్ కుమార్. అందరం కాస్త వెనక్కి జరిగి చూస్తూ నిల్చున్నాం.

ప్రదీప్ కుమార్ తలుపు కడ్డంగా బిగించివున్న ఆ పొడవాటి ఇనపవస్తువు మీద చెయ్యివేసి లాగేడు. అంతే!

“ఖణేల్!” మన్న చప్పుడు.

ప్రదీప్ కుమార్ చక్రబర్తి తల ఎగిరిపోయింది! తలలేని మొండెంలోంచి ఫౌంటెన్ లా విరజిమ్మసాగింది రక్తం!!

కలలో కూడా ఊహించని ఆ సంఘటనకు నిశ్చేష్టుడనయ్యేను. ప్రదీప్ కుమార్ మొండెం మొదలు నరికిన చెట్టులా దభీమంటూ పడిపోయింది కింద! చేతులు టపటప లాడిస్తూ.

పక పక నవ్వుతూ మావైపు తిరిగేడు సుందరరాజన్.

“ఆ చూర్ణం రక్షణకోసం నేను జేసిన ఏర్పాటే ఇది! కత్తివంటి పదునైన ఇనపచట్టాను స్ప్రింగుల సహాయంతో బిగించేను తలుపు కడ్డంగా. దాన్ని లాగిన మరుక్షణం ఖడ్గంలా రివ్వునవచ్చి తలని ఎగరగొడుతుంది! ఈ నీచుడు తన దురాశకు తగ్గ ఫలితం అనుభవించేడు” అంటూ వేలాయుధం వైపు తిరిగేడు సుందరరాజన్.

ప్రదీప్ కుమార్ చక్రబర్తి గతి కళ్ళారా చూసిన ఆ రౌడీలు, అప్పటికే చమట్లు కక్కుతూ, గజ గజ వణుకుతున్నారు.

“వేలాయుధం! నీ బాస్ గతి చూశావుగా? నేనీ సొరంగాల్లో ఇటువంటి ఏర్పాట్లెన్నో చేసివుంచాను. మీకు ప్రాణాలమీద ఆశవుంటే మా కట్లు విప్పి, సుర

క్షేమంగా మాతో మద్రాసు రావచ్చు లేదా ఇక్కడే ఉక్కచావు చావండి!" అన్నాడు సుందరరాజన్ కటువుగా.

వేలాయుధం విధిలేక "వారి కట్లువిప్పండి!" అన్నాడు తన అనుచరులతో.

మరుక్షణం మమ్మల్ని బంధవిముక్తుల్ని జేశారు వాళ్ళు. సుందరరాజన్ గోడలోవున్న ఆ రాతి తలుపు తెరిచేడు లోపల చిన్న చిన్న రాసులుగా పేర్చివుంది ఆకు పచ్చని చూర్ణం!

ఆ చూర్ణాన్ని లాబొరేటరీలో పరీక్షలు జరిపించడానికి మా వెంట కొంత తీసుకుని సొరంగ మార్గాలగుండా బైటికి వచ్చాం. దీవి ఒడ్డున సముద్రంలో తేలుతున్న విమానం ఎక్కాం.

విమానం పైకెగురుతున్న కొద్దీ, కింద సముద్రం నడుమ ఒంటరిగా ఏకాంతంగా వెలవెలబోతూ కనిపించ సాగింది ఆ అదృశ్యదీవి!

—: ఐపోయింది :—

# మృత్యు తాండవం!

కె. బి. యస్. కుమార్

సినిమాకి టైం కావడంతో చంద్రం గబగబా నడిచి థియేటరు చేరుకున్నాడు.

'క్యూ' అప్పటికే రావణాసురుడి సభలో హను మంతుడి తోకంత పొడవుంది! ఆడవాళ్ళు గుంపులు గుంపులుగా వస్తోన్నారు!!

ఎలాగైనా సినిమా చూడాలి.

చటుక్కున ఓ అయిడియా తోచిందతనికి. నెమ్మదిగా అప్పర్ క్లాస్ బుకింగ్ వేపు నడిచాడు.

మరో అమ్మాయికూడ బుకింగ్ వైపే నడుస్తోంది.

''ఏమండీ...'' పిలిచాడు. ప్రశ్నార్థకంగా వెను దిరిగింది.

"...ఓ చిన్న సాయం చెయ్యగలరా?"

"ఏమిటది?" అనుమానంగా చూసిందామె.

"...ఏమీ లేదు. ఓ టికెట్ కావాలంటే" నసుగుతోన్నట్టు అన్నాడు.

ఏమనుకుందో, "...సరే యివ్వండి" అందామె.

చంద్రం ముఖం సంతోషంతో విప్పారింది. మూడున్నర ఆమె చేతిలో పెట్టాడు.

నిమిషం గడిచింది.

"...తీసుకోండి" టికెట్టు చంద్రం చేతి కందించిందామె.

"చాల థాంక్సండీ—మీ మేలెన్నడూ మర్చిపోలేను" కృతజ్ఞతగా అన్నాడు చంద్రం.

విన్పించుకోలేదామె వెళ్ళిపోయింది.

జేబులో పావలా మాత్రం మిగిలింది. ఓ విల్స్‌ఫ్లేక్ సిగరెట్టూ పదిపైసల మంగళూరు బీడీలు కొన్నాడు చంద్రం. బీడీ వెలిగించాడు. యింటర్వెల్‌లో టీ త్రాగటానిక్కూడ డబ్బుల్లేవు.

న్యూస్ రీల్ అయిపోవచ్చే వరకూ ఎవరేనా ఫ్రెండు కన్పిస్తాడేమో ఓరూపాయి అడిగి యిప్పించుకుందామని బయటే వెయిట్ చేశాడు చంద్రం. కాని ఒక్కడూ అగపడలేదు.

చేసేది లేక ఆడిటోరియంలోకి అడుగుపెట్టాడు.

పావుగంట గడిచింది.

సినిమా చూస్తోన్న చంద్రం వులిక్కిపడ్డాడు.

తన చెయ్యిపై ఎవరిదో మరో చెయ్యి పడింది. ప్రక్కకి తిరిగి కూర్చుని వుండటంతో ఎవరైందీ కనపట్టం లేదు. పొరపాటుగా పడిందేమోననుకొని మళ్ళీ పిక్చర్

చూడ్డంలో నిమగ్నుడైపోయాడు.

కాని ఆ చెయ్యి తన చేతిమీద బిగుసుకు పోతోంది. వుండివుండీ మళ్ళీ మృదువుగా మారి తన చేతిని సుతారంగా నలుపుతోంది. అక్కణ్నుండి మెల్లిగా పైకి ప్రాకుతోంది పాములా...

ఆడ చేష్టలు చేసే కొందరు మగాళ్ళుంటారని చంద్రం కొన్ని పుస్తకాల్లో చదివున్నాడు. ఒకవేళ అలాంటి వ్యక్తి...

ఆ వూహ కలిగేసరికి చంద్రం శరీరం గగుర్పొడిచింది. జుగుప్సతో శరీరంమీద రోమాలు నిక్కబొడుచుకున్నాయి.

ఆ చెయ్యిని విదిలించుకోడానికి విసురుగా వచ్చిన చంద్రం రెండో చేతికి రెండు బ్యాంగిల్స్ తగిలాయ్! దాంతో గగుర్పాటు కాస్తా పులకింతగా మారిపోయింది!! అప్పుడు తెలిసింది చంద్రానికి, తన చేతిమీద పోరాడుతోన్న ఆ చెయ్యి కోమలంగా వుందని...

ఎవరీమె? అంత చనువుగా వుండే ఆడవాళ్ళు తనకి పరిచయమే లేదే! క్రొత్త మనిషైతే ఈ ప్రవర్తన ఏమిటి?

...ఏది ఏమైనా చంద్రానికి చాల సంతోషంగా వుంది. ఓ అమ్మాయి తనని కోరుకుంటోంది!...

నెమ్మదిగా తన చేతిని ఆ చేతిమీదికి పోనిచ్చాడు చంద్రం. వెంటనే అవతలి చేతివ్రేళ్ళు చంద్రం చేతి వ్రేళ్ళమధ్య సందుల్లో చొచ్చుకుపోయాయి. మళ్ళీ విడిపోయి షేక్‌హ్యాండ్ యిస్తోన్నట్టుగా తనచేతిలో చెయ్యి వేసి నొక్కిందా చెయ్యి!

'...సందేహంలేదు. ఈమెకి తను కావాలి!' ఆ వూహతో చంద్రం శరీరంలోని రక్తం లావాద్రవం అయిపోయింది. అతని శరీరం వేడెక్కింది. కళ్ళలోంచి, చెవుల్లోంచి ఆవిర్లు రాసాగాయి. నెమ్మదిగా తన చేతిని ఆమె ఒళ్ళో వేశాడు.

ఆమె అభ్యంతరం చెప్పలేదు!

దాంతో చంద్రం మనసు కళ్లెంలేని గుర్రమైంది. నెమ్మదిగా తన చేతినలాగే పైకి పోనిచ్చాడు. ఆమె పరువపు సిరులు గట్టిగా-మృదువుగా-వెచ్చగా తగిలాయి పయ్యెద మీదుగా.

చంద్రానికి అనుభవం కొత్తగా, మత్తుగా వుంది! తెరపై బొమ్మలు కన్పించటంలేదు. మాటలూ విన్పించటంలేదు.

...ఇంటర్వెల్‌కి సూచనగా బెల్ మ్రోగటంతో ఉలిక్కిపడి యిద్దరూ సర్దుకున్నారు.

లైట్లు వెలిగాయి. ఆమెని చూసి ఆశ్చర్యపోయాడు చంద్రం. తనకి టికెట్ తెచ్చిచ్చిన అమ్మాయి!

చిలిపిగా నవ్విందామె. ఏదోలా అయిపోయాడు చంద్రం.

ఇంటర్వెల్ తర్వాతకూడ అతను పిక్చర్ చూడలేకపోయాడు.

## 2

పక్కమంచంపై పడుకొని తనలో తను కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు విశ్వనాథం. యిప్పుడతను మత్తులో లేడు. అందుకే ఏడుస్తున్నాడు!

ఎదురుగా కటిక నేలపై పడుకొని అమాయికంగా

నిద్రపోతోంది మాణిక్యమ్మ.

...తన మాణిక్యం! నిజంగా మాణిక్యమే! ఎంత సమానమూర్తి?! ఆ స్థానంలో ఈ పరిస్థితుల్లో మరో ఆడదే వుంటే ఈపాటికి వురేసుకు చచ్చిపోయి వుండేది!

కుటుంబ భారంతో ఆమె ముఖం ముడుతలు పడింది. కనురెప్పలక్రింద నల్లటి చారలేర్పడ్డాయి. తల ముప్పావు భాగానికిపైగా నెరిసిపోయింది.

"...మణీ! నిన్ని స్థితికి తెచ్చిన నిర్భాగ్యుణ్ని నేనే మణీ!... నేనే!" అతని కళ్ళలోంచి ధారావాహికంగా కారిపోతున్నాయి కన్నీళ్ళు. బీడీ వెలిగించుకొని కొడుకు చంద్రం మంచంవేపు చూశాడు. మంచం ఖాళీగా వుంది.

తనని చూసి వాడు చెడిపోతున్నాడు. చెడిపోయాడు లేకపోతే పదకొండయినా యింటికి రాకపోతే మరేమను కోవాలి?

తను వాణ్ని ఏమని మందలించగలడు? 'నాకు నీతులు చెప్పేముందు నీ సంగతి చూసుకో' అనే వయసు వాడి కొచ్చేసింది. అదే మాట అంటే...? తండ్రిగా వాడికి తనపట్ల వుండే ఈమాత్రం భావంకూడ తుడిచి పెట్టుకు పోతుంది.

మరో ప్రక్క పదిహేడేండ్ల పెద్దకూతురు మాలతి, పదేండ్ల రెండో కూతురు లత నిద్రపోతున్నారు. యిది వరకట్లో 'బుజ్జీ' అంటే చాలు. పరుగున దగ్గరికొచ్చేది లత. యిప్పుడు చూస్తే చాలు. భయపడుతుంది. పెద్దమ్మాయి భయపడదు. కాని దగ్గరకు రాదు. తనిప్పుడు జూదరి, త్రాగుబోతు మరి!

తను తన వారందరికీ దూరమైపోయాడు. తనకి తనే దూరమైపోయాడు. దీనికి కారణం ఎవరు? ఎవరు?

'విశాలి! విశాలి!! విశాలి...!!!'

హృదయంలోంచి మేఘ గర్జనతో దూసుకు వచ్చింది జవాబు!

ఆ పేరు గుర్తుకి రాగానే తుప్పుక్కున నోట్లో బీడీని వూశాడు విశ్వనాథం. తలక్రింద చేతులు పెట్టుకొని శూన్యంలోకి చూస్తూ పడుకున్నాడు.

అతడి కళ్లెదుట శూన్యంకాదు...ఆనాటి సంఘటన సినిమా రీలులా తిరగసాగింది.

## 3

విశ్వాసానికి మారుపేరుగా పదిహేనేళ్ళుగా విశ్వేశ్వరరావు దగ్గర పనిచేస్తోన్నాడు విశ్వనాథం. విశ్వేశ్వరరావు ఎస్టేటుకీ, వందెకరాల ద్రాక్షతోటకీ మేనేజరతను.

విశ్వేశ్వరరావు తర్వాత అంతటివాడిగా గౌరవించబడేవాడు విశ్వనాథం. అతని ఎస్టేటులోనే అన్ని సౌకర్యాలూ వున్న ఓ యింట్లో కాపురముండేవాడు. రోజులు ఎంతో ప్రశాంతంగా హాయిగా గడచిపోతున్నాయి.

నాలుగేళ్ళక్రితం విశ్వేశ్వరరావు భార్య స్వరాజ్యలక్ష్మి క్యాన్సర్ వ్యాధితో చనిపోయింది. దాదాపు తన వయసుగల విశ్వేశ్వరరావు మిత్రుల ప్రోద్బలంతో యిరవయేళ్ళ విశాలిని వివాహం చేసుకున్నాడు.

విశాలి కాస్త నలుపైనా ఆమె ముఖం ఎంతో కళతో తొణికిసలాడుతోండేది.

సరిగ్గా సంవత్సరం క్రితం...ఆనాడు...

ఏవో అర్జంటు కాగితాలమీద విశ్వేశ్వరరావు సంతకం కోసం వాళ్ళ బంగళాకి వచ్చాడు విశ్వనాథం. అతనికి ఆ భవనంలో అన్నివిధాలా స్వేచ్ఛవుంది. ఆ స్వేచ్ఛని పురస్కరించుకొని నేరుగా విశ్వేశ్వరరావు ప్రయివేటు గదివేపు దారితీశాడు.

ఆ సమయంలో అతను ఆ గదిలో విస్కీ త్రాగుతూ విశ్రాంతిగా కూర్చొనివుంటాడు. ఆ సమయంలో భార్యని కూడ లోనికి రానివ్వడు, ఒక్క విశ్వనాథాన్ని తప్ప.

"సార్..." అంటూ చొరవగా తలుపు తెరచిన విశ్వనాథం కొయ్యబారిపోయాడు.

ఎదురుగా...

విశ్వేశ్వరరావు పడకపై విశాలి మరో యువకుడి చేతుల్లో మెలికలు తిరుగుతోంది! యిద్దరూ పూర్తిగా నగ్నంగా వున్నారు!

తనని చూడగానే యిద్దరూ ప్రక్కలో బాంబుపేలినట్టు అదిరిపడ్డారు. విశ్వనాథం శరీరంపై తేళ్ళూ జెఱ్ఱులూ పాకుతున్నట్టు అనుభూతి కలిగింది. చటుక్కున యివతలి కొచ్చేశాడు.

తరవాత తెలిసింది, విశ్వేశ్వరరావు వూళ్ళో లేడని. ఒక్కసారిగా విశాలిపై అమితమైన అసహ్యం కలిగింది.

'ఎంతకి తెగించింది? భర్తని మోసం చేస్తూ ఎంత నీచమైన పని చేస్తోంది? ఈ విషయం తన యజమానికి తెల్సా?'

విశ్వేశ్వరరావు ఆమెని శారీరకంగా సుఖపెట్టడం లేదా? లేక అది చాలలేదా? తను ఈరోజు చూశాడు. యిది ఎన్నాళ్ళబట్టి సాగుతోందో! విశాలికి భర్తంటే

అభిమానం, ప్రేమ లేదా? కేవలం ఆ స్త్రీకోసమే అతన్ని వివాహమాడిందా? ఆ స్త్రి కాజెయ్యటానికి ప్రయత్ని స్తోందా? ఆ యిద్దరూ కల్సి తన యజమాని కేదైనా ముప్పు తలపెడితే...?'

'అమ్మో...!' ఆ ఊహకూడ భరించలేకపోయాడు విశ్వనాథం. తను విశ్వేశ్వరరావుగారి ఉప్పు తింటో న్నాడు. ఈ సంగతి ఆయనకి తెలియజెయ్యకపోతే తన మనసుకి శాంతి వుండదు. విశాలివల్ల రేప్పొద్దున ఆయన కేదేనా జరిగితే అజ్ఞాతంగా తనూ బాధ్యుడవుతాడు.

విశ్వేశ్వరరావు పూర్నుండి తిరిగొచ్చాక ఈ విషయం ఎలా చెప్పాలా అని ఆలోచిస్తోన్న విశ్వనాథానికి ఆ రాత్రి నిద్రే పట్టలేదు.

ఆ మరురోజు ద్రాక్షతోటలో కొమ్మలు కత్తిరించే కార్యక్రమం మొదలవుతుంది. ఉదయాన్నే కూలీలని తీసుకొని తోటకెళ్ళాడు. తోట బంగళాలో కూర్చొని కూలీలతో పనిచేయిస్తున్నాడు.

ఫోను మ్రోగింది. ఎత్తాడు.

వంట నాయర్ ఫోన్ చేస్తూ అయ్యగారొచ్చారని తమ గదిలో తనకోసం వెయిట్ చేస్తున్నారని, వెంటనే రావలసిందిగా చెప్పమన్నారని చెప్పాడు.

విశ్వనాథం గుండె దడ దడ కొట్టుకోసాగింది. ఏమని చెప్పాలి? ఎలా ప్రారంభించాలి? చెబితే ఆయనేమంటారు? నమ్ముతారా? లేక తనపై విరుచుకుపడతారా? జరగబోయే ప్రమాదాన్ని పసిగట్టి విశాలే తనమీద ఆయనకి చాడీలు చెప్పివుండదు కదా?

నడుస్తోన్నా, మెట్లెక్కుతోన్నా అవే ఆలోచనలు

విశ్వనాథం మనసులో.

తటపటాయిస్తూనే తలుపుతోశాడు.

ఎదురుగా చిరునవ్వుతో విశాలి!

ఎదురుచూడని సంఘటన! కాస్త తడబడ్డాడు.

"కూర్చోండి..." ఆ స్వరంలో అధికారం లేదు. అభ్యర్థన లేదు. కోపంలేదు. గాంభీర్యం లేదు. మార్దవమూ లేదు.

మామూలుగా వుంది!

యిబ్బందిగా కూర్చున్నాడు విశ్వనాథం.

"...నాయర్ మార్కెట్ కెళ్ళాడు. వాచ్ మెన్ యింటికెళ్ళాడు. సుందరమ్మకి జ్వరమట. ఉదయమేవచ్చి ఈరోజు వంట చెయ్యలేనని చెప్పింది. 'రెస్టు తీసుకోపో' అన్నాను. మనతోటలో 'నైట్ క్వీన్' ఒక్కటే తక్కువగా వుంది. యిది వర్షాకాలం. అంటు మొక్కలు అమ్ముతారు. ఎక్కడేనా సరే-ఓ మొక్క పట్టుకురా అని చెప్పి తోటమాలిని పంపాను. ఈరోజు ఎక్కడికీ వెళ్ళాలని లేదు. డ్రైవర్ని రావద్దన్నాను..."

ఇదంతా తనతో ఎందుకు చెబుతుంతో అర్థంకాలేదు విశ్వనాథంకి. "అయ్యగారు ఎందుకో రమ్మన్నారుట. వచ్చాను, వార్ని పిలవండి..." అన్నాడు క్లుప్తంగా.

"ఏదీ...అయ్యగారింకా ఊర్నుండి రానేలేదుగా! యిప్పుడు ఢిల్లీలో వున్నారు."

"మరి నాయర్ అలా చెప్పాడే!" అప్రయత్నంగా అన్నాడు.

"నేనే అలా చెప్పమన్నాను."

"దేనికి?"

"నాకో సందేహంవుంది. మీరు తీర్చగలరా?"

"చెప్పండి..."

"మీ వయసెంత...?"

అర్థమైంది విశ్వనాథానికి. తను క్రితంరాత్రే ఆ సంఘటన చూశాడు. విశ్వేశ్వరరావుగారితో చెప్పొచ్చు. అందుకే తనని పన్లోంచి తీసేయాలని చూస్తోంది. 'నువ్వు ముసలాడి వయ్యావు—యిక నువ్వీ పనికి తగవు' అని గుర్తుచేస్తోందన్నమాట.

ఇదీ ఒకందుకు మంచిదే అయ్యింది. తను కళ్ళారా చూసిన ఆ కఠోరసత్యాన్ని యజమానికి చెప్పలేడు—చెప్పకుండా వుండలేడు... చెబితే ఆయన తప్పు అర్థం తీసుకోవచ్చు. చెప్పకపోతే ఆయన ప్రాణాలకే ప్రమాదం వాటిల్లవచ్చు. ఈధర్మ సంకటంనుండి తనని తప్పించే మార్గం ఒక్కటే! అది తనీ వుద్యోగంనుండి తప్పుకోవటమే!

"ఏమిటి ఆలోచిస్తున్నారు? మీ వయసంతో మీకు తెలీదా? లెక్క పెడుతున్నారా?" నవ్వింది విశాలి.

"లేదు. ఉద్యోగరంగంలో నాపాత్ర అయిపోవచ్చింది సాగర కెరటాల్లాంటి ఈ వుద్యోగ బాధ్యతలకి ఎదురీదలేక పోతున్నాను. వయోభారంతో డస్సిన శరీరం విశ్రాంతిని కోరుతుంది... ఈ విషయం గురించికూడా అయ్యాగారితో మాట్లాడుదామని అనుకున్నాను."

"ఎవరు చెప్పారు మీకు వయసు చెల్లిపోయిందని? నలభైకి మించివుండదు. మావారికన్నా చయమే! ఆయనకి మూడోంతుల తల తెల్లబడింది! ఆఁ... మీ కూతురు పుట్టినరోజు దగ్గర్లోనే వుందికదూ! డబ్బై మైనాశావాలా" బెడ్ మీదనుంచి లేచింది విశాలి.

ఆరోజు శనివారమనేమో, తలంటు పోసుకుంది విశాలి. పొడుగాటి కురులని వదులుగా జడ వేసింది. తెల్లని మల్లెపూలదండ తలనిండుగా వుంది. మెడలో డైమండ్ నెక్లెస్ ఆమె అందానికి మెరుగులు దిద్దుతోంది. మల్లెల తెల్లదనంతో పోటీ పడుతోన్నట్టున్న తెల్లనిచీర, జాకెట్ లో ఆమె దేవకన్యలా మెరిసిపోతోంది!

కాని విశ్వనాధానికి మాత్రం ఆమె తలలోని మల్లెల దండని చూస్తే పవిత్రభావం కలుగలేదు. విటులను కవ్వించి రెచ్చగొట్టే పతిత కన్పించిందామెలో.

నిజంగా ఎంత జాణతనం చూపిస్తోంది? నిన్నటిరోజు పరాయిమగాడి పక్కలో దొర్లుతుండగా చూశాడన్న భయమూ తన భర్తతో ఎక్కడ చెబుతాడోనన్న భీతి ఆమెలో మచ్చుకైనా కన్పించడంలేదు. పైగా దర్జాగా కబుర్లు పెట్టుకుంది. డబ్బుకావాలా అని అడుగుతోంది. లంచమా...?

“...ఏమిటో ఇవ్వాళ పరధ్యానంగా వున్నట్టున్నారు మీ శ్రీమతి వూళ్ళోలేరా?”

“ఆఁ...?” ఆలోచిస్తున్న విశ్వనాథం వులిక్కిపడ్డాడు.

అతను అవునన్నట్టుగా అర్థం చేసుకుంది విశాలి.

“ఓస్...అయితే ఇద్దరం ఒంటరివాళ్ళమే నన్నమాట. ఎంతయినా మీ శ్రీమతి నాకంటే ఎంతో అదృష్టవంతురాలు. తను వూళ్ళోలేకపోతే తనకోసం బెంగెట్టుకొనే భర్త వున్నాడు. కాని నేను...?! ఆయన యెప్పుడు వస్తారో యెప్పుడు వెడతారో ఆయనకే తెలీదు!” గట్టిగా నిట్టూర్చింది విశాలి.

'అందుకే పక్కదార్లు తొక్కావు...?' ఆ మాట అనలేకపోయాడు విశ్వనాథం.

"...విశ్వనాథంగారూ! ఈరోజు నాకెలాగో వుంది. ప్లీజ్...ఈరోజంతా యిక్కడే వుండండి..." మళ్ళీ ఆమే అంది.

"లేదు. అవతల ద్రాక్షకొమ్మలు కత్తిరిస్తున్నారు. నేనుండకపోతే సరిగా పని చెయ్యరు."

"నేను ఫోను చేస్తాను. రేపటినుండి ఆపని చూసుకోండి. ఈ రోజుమాత్రం నాపని చూడండి" చటుక్కున విశ్వనాథాన్ని కౌగలించుకుంది విశాలి.

ప్రక్కలో ఆటంబాంబు పడినట్లు ఫీలయ్యాడు విశ్వనాథం.

"క్షమించండి. నా యజమానికి ద్రోహం తలపెట్టలేను మీలా నేను ధైర్యస్థుణ్ని కాను..."

"నాకు పిరికివాళ్ళంటే చాలా యిష్టం. అయితే ప్రస్తుతానికి నా కోరిక తీర్చండి. మిమ్మల్ని పిలిపించుకోవడానికి కారణంకూడా అదే! నా విషయంలో సౌఖ్యం కల్గించుకోకండి. మీకెంత డబ్బు కావాలన్నా ఇస్తాను. ఆయనకే అనుమానమూ రాకుండా చూసుకునే బాధ్యత నాది..." గట్టిగా అతన్ని చుట్టుకుపోయింది విశాలి.

పురుగును దులిపినట్టు దులిపేశాడు విశ్వనాథం.

"మీ వయసు ఎక్కువైనా మా వారికంటే చిన్నవారే మీరు. అందులోనూ మీస్వామిభక్తి, పనులపట్ల మీరు కనబరచే శ్రద్ధ, మీ మంచితనం నా మనసు నాకట్టుకున్నాయి. మీ వయసుకూడా మర్చిపోయాను.... కమాన్" మీద పడబోయింది విశాలి.

"క్షమించండి. మీరనుకున్నంత నీచుణ్ని కాను నేను. మిమ్మల్నింతవరకు విశ్వేశ్వరరావుగారి భార్యగా, నా యజమానురాలిగా గౌరవించాను. కాని యిప్పుడు మామూలు స్త్రీగాకూడ చూడలేకపోతున్నాను. యూ వారె డర్టీ బిచ్ ఇన్ మైవ్యూ...మీరన్న ఆ స్వామిభక్తి మంచితనమే మీ కోరికను తిరస్కరిస్తోంది సెలవు!"

ఆమెని విసురుగా తోసేసి బయటపడ్డాడు విశ్వనాథం.

మర్నాడు విశ్వేశ్వరరావు గారు ఢిల్లీనుండి తిరిగొచ్చారు.

"విశ్వనాథం ఇన్నేళ్ళుగా నాదగ్గర పనిచేస్తోన్నావు. నీకే విషయంలో నేనా లోపం చేశానా?" కరకుగా ప్రశ్నించాడు విశ్వేశ్వరరావు.

విశ్వనాథంకేమీ అర్థం కాలేదు.

"నిన్నే. మాట్లాడవేం?" మరోసారి గర్జించింది అతని కంఠం.

"బాబుగారూ! మీరేం మాట్లాడుతున్నారో నాకర్థం కావటంలేదు..." అన్నాడు.

"అవును. ఎలా అర్థమవుతుంది? నీలోని విశ్వాసమంతా స్వార్థంగా మారిపోయింది. మంచితనమంతా విషంగా మారిపోయింది. తిన్నయింటి వాసాలు లెక్కపెడతావని కల్లోకూడ అనుకోలేదు."

"అసలు విషయం చెప్పండి బాబుగారూ!" ఆ మాటలు వినలేనట్టుగా అన్నాడు విశ్వనాథం. అతని మస్తిష్కంలో ఎన్నో ప్రశ్నలూ సందేహాలు తలెత్తనారంభించాయి.

"ఎప్పుడూ నీ భుజం పైనుండే కండువా మా బంగళాకెలా వచ్చింది? ఎప్పుడూ విశాలి మెడలో వుండే డైమండ్ నెక్లెస్ సేఠ్ కాంతాలాల్ పోకర్ చంద్ షాపులో ఎలా చేరింది."

అవాక్కయి పోయాడు విశ్వనాథం! నిన్న విశాలిని విసురుగా తోసేసినప్పుడు కండువాకూడా క్రింద పడి పోయింది. తను చూడకుండా వచ్చేశాడు మరి...

"...విశ్వనాథం, నువ్వు నా మేనేజరువైనా అలా ఎప్పుడూ చూడలేదు నిన్ను. నా భార్యక్కూడా యివ్వనంత స్వేచ్ఛని నీకిస్తూవచ్చాను మొదట్నుండీ! నా తర్వాత నా అంతటి వాడుగా నీకు స్థానాన్ని ఏర్పరచాను. ఎందుకు? నాకు నీపట్లగల గౌరవం, నమ్మకం అంతే! ఆ మాత్రం నువ్వాలోచించలేక పోయావ్. దొంగతనం నీచమని నీకు తెలీదూ! నీకు డబ్బుకావాలని చెబితే నేనివ్వనా? జీతం చాలలేదని చెబితే పెంచనా? దొంగతనం చెయ్యాల్సినంత ఖర్మం పట్టింది నీకు!"

ఆలా నిలబెట్టి ఒక్కొక్క ప్రశ్నా వేస్తోంటే సూదుల్తో గుచ్చినంత బాధననుభవించాడు విశ్వనాథం. "ఇప్పుడు నేనేం చెప్పినా మీరు నమ్మలేరు బాబూ! అది నా దురదృష్టం!" అని మాత్రం అనగలిగాడు.

"అవును. నమ్మలేక పోయాను. మెడలో నెక్లెస్ బదులు గదిలో విశ్వనాథం కండువా కన్పించిందని విశాలి ట్రంకాల్ చేస్తే నిజంగా నమ్మలేక పోయాను. కాని ఇంటికొచ్చాక విశాలి బోసి మెడ నీ కండువా నన్ను వెక్కిరించాయ్.

అంతేకాదు. గంటక్రితమే కాంతాలాల్ పోకర్

చంద్ నాకు ఫోన్ చేశాడు. ఎవరో వ్యక్తి తనకు ఓ డైమండ్ నెక్లెస్ అమ్మజూపాడనీ, దాన్ని తనవద్దే వుంచుకొని రశీదిచ్చి పంపానని, వెలకట్టి సాయంత్రం డబ్బిస్తానని చెప్పానని చెప్పాడు. అనుమానం కలిగి ఆ నెక్లెస్ తెప్పించాను. ఇదుగో...! ఇప్పుడు చెప్పు. సేఠ్ దగ్గర కెవర్ని పంపావ్?" జేబులోంచి నెక్లెస్ తీశాడు విశ్వేశ్వరరావు.

"నేను దొంగనంటే మీరుకూడ నమ్ముతున్నారా బాబూ!" విశ్వనాథం గొంతు గాద్గదికమైంది.

"మరి నీకెందుకు వా మా బంగళాలోకెందు కొచ్చింది? నెక్లెస్ సేఠ్ గారికెలా చేరింది? రెంటికీ కాళ్ళొచ్చాయా?"

ఈయనకి నిజం ఎలా చెప్పాలి? నమ్ముతారా? ఊహూం నమ్మరు. పైగా తనకే ప్రమాదం రావచ్చు...

"చూశావా! నీ మౌనమే సమాధానం చెబుతోంది. ప్లీజ్ గెటవుట్ విశ్వనాథం ..అంతేకాదు. ఇకపై నీ ముఖం ఎప్పుడూ నాకు చూపించకు. నిన్ను పోలీసులకి పట్టివ్వటానికి ఒక్క నిమిషం చాలు. కాని ఆపని నా చేతుల్తో చెయ్యలేక పోతున్నాను. వెళ్ళు... కాసేపట్లో నేనెలా ప్రవర్తిస్తానో నాకే తెలీదు. తక్షణం యిక్కడ నుండి వెళ్ళిపో..."

బాధగా లోపలకు వెళ్ళిపోయాడు విశ్వేశ్వరరావు...

## 4

...మైకులో మసీదులోంచి వినవస్తోన్న నమాజ్ చెవులబడటంతో ఆలోచిస్తున్న విశ్వనాథం తృళ్ళిపడ్డాడు చుట్టూ చూశాడు. మాణిక్యమ్మ అటుతిరిగి పడుకుంటుంది. మాలతి, లత అలాగే నిద్రపోతున్నారు. చంద్రం మంచం ఖాళీగానే వుంది.

"టైం అయిదైందన్నమాట..." స్వగతంలా అనుకున్నాడు విశ్వనాథం. రాత్రంతా ఆలోచనల్తో గడపటంతో కళ్ళు బరువెక్కి మంటలు పుడుతోన్నాయి.

హుఁ...అనాడు తన హృదయం పరాభవాగ్నిలో కాలిపోయింది. దానిముందు ఈ కళ్ళమంటలెంత?

అంత అభాండం తనమీద వేశాడు విశ్వేశ్వరరావు. బరువెక్కిన గుండెతో యిల్లు చేరాడు తను.

దీనికి కారణం విశాలి!

ఆమె గుట్టు తను తెల్సుకున్నాడు. విశ్వేశ్వరరావుతో తను ఈ విషయం చెప్పొచ్చు. అందుకే తనని వల్లో వేసుకోటానికి ప్రయత్నించింది. తను లొంగకపొయ్యేసరికి ఈ కథ అల్లింది.

అంతేకాదు. ఆ మరురోజు ఈ వార్త తన ఫోటోతో సహా పత్రికల్లో వేయించింది. దాంతో తన పరువు పూర్తిగా పోయింది. తను ఎన్నిచోట్ల ప్రయత్నించినా వుద్యోగం దొరకలేదు. అందరూ తనని దొంగగానే చూశారు.

తర్వాత జీవితంలో కుటుంబంతో పాటు నరకమే చూశాడతను.

అసలు నిజం విశ్వేశ్వరరావుకి తెలియపరచాలని ఎంతో ప్రయత్నించాడు. కాని లాభంలేకపోయింది. యింటిదగ్గరకెడితే గూర్ఖా లోనికి వెళ్ళనిచ్చేవాడు కాదు.

ఎక్కడైనా విశ్వేశ్వరరావు కన్పిస్తే చెప్పాలని తను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. తనని చూసినా కారాపేవాడు కాడతను.

ఆ తర్వాత తెలిసింది_తన స్థానంలో రవీంద్ర_విశాలి పాత్ర ప్రియుడు చేరాడని. కాదు. విశాలే రెకమెండు చేయించి అతనికా వుద్యోగం యిప్పించింది.

ఆర్నెల్లు గడిచాయి. ఓరోజు హఠాత్తుగా విశ్వేశ్వర రావు గారు ప్రమాదంలో మరణించాడు.

కారణం తనకి తెల్సు...తను తన యజమానిని రక్షించుకోలేకపోయాడు. విశాలి బారినుండి ఆయన్ని కాపాడుకోలేకపోయాడు.

ఆ సంఘటన గుర్తురాగానే వెక్కి వెక్కి ఏడ్చాడు విశ్వనాథం.

కాసేపయ్యాక మాణిక్యమ్మ లేవటంతో గబగబా కళ్లు తుడుచుకున్నాడు.

# 5

మరోసారి చిలిపిగా చూసిందామె.

"ప్రతి విడుదలైన మొదటి సినిమా మార్నింగ్ షో చూసే అలవాటు నాకు. కాని...ఈరోజు సినిమా నా జీవితంలో మరచిపోలేను..." ఆమె నల్లని కురులవేపు చూస్తూ అన్నాడు చంద్రం.

"ఎందుకని?"

"ఈ దేవతా సందర్శనభాగ్యమూ పరిచయభాగ్యమూ ఆపైన..." ఆమె బుగ్గపై చిలిపిగా చిటికేశాడు చంద్రం.

బెడ్ పై వెల్లకిలా పడుకొనుంది సౌజన్య. ఆమె ముఖంలో అలసటతోపాటు కొత్త కాంతులు కూడ తళుక్కుమంటోన్నాయ్.

ఆమెనే పరిశీలనగా చూశాడు చంద్రం.

వయసు తనకంటే ఓ సంవత్సరం తక్కువుండొచ్చు. నల్లని పొడుగాటి తల వెంట్రుకలు, తెల్లని దేహ ఛాయ. గుండ్రని ముఖం. నుదుట చెరిగిపోయిన తిలకం. మత్తుగా చూస్తోన్న చేపపిల్లల్లాంటి కనులు. అక్కడక్కడ చిన్న చిన్న గాట్లతో నున్నటి అందమైన గుండ్రని లేత బుగ్గలు. గులాబిరంగు దుస్తులు. అచ్చం శోభనం జరిగిన మర్నాటి పెళ్ళికూతురి కళ ఆమెలో తాండవిస్తోంది.

"చంద్రం..." మృదువుగా మత్తుగా పిలిచింది సౌజన్య.

"ఊఁ"

"కేవలం సినిమా పరిచయం మన మధ్య యింతటి అనుబంధాన్ని పెనవేస్తుందని నువ్వు కల్లోకూడ అనుకో లేదు కదూ!"

"అవును..."

"నేనూ అనుకోలేదు. నువ్వు టికెట్టు తెమ్మని డబ్బులిస్తూ నావేపు చూసిన చూపు నన్ను నీ ఆకర్షణ లోకి లాగింది. అందుకే నాకై నేను కవ్వించాను సినిమాలో."

"అది నా అదృష్టం..."

"దేవుడి దృష్టిలో మనిద్దరం ఈరోజునుండి భార్యా భర్తలం. నన్ను పెళ్ళిచేసుకోటానికి నీకేమైనా అభ్యం తరమా చంద్రం?"

"లేదు. నువ్వే అభ్యంతరం చెప్పొచ్చు..." ఆమె పైనుండి చెయ్యి తీసేశాడు చంద్రం.

"అదేం?"

"అవును సౌజన్యా! మాది పేద కుటుంబం. మా

నాన్న తాగుబోతు. పైసా ఆదాయం లేదు. మా అమ్మ చెల్లాయి ఆడపిల్లలకి కుట్టుపని నేర్పుతారు. దానిపై వచ్చే ఆదాయమే మా కుటుంబాని కాధారం. నన్ను చేసుకొని నువ్వు సుఖపడలేవు.''

''మీ కుటుంబ పరిస్థితులన్నీ నాకు తెల్సు. మీ నాన్నని చూసి చెడిపోతున్నావు నువ్వు.''

ఆశ్చర్యపోయాడు చంద్రం. ''మా కుటుంబ పరిస్థితులు నీకెలా తెలుసు?''

''తెలుసుకున్నాను గాబట్టి.''

''అంటే?''

''నిన్ను మొదటిసారి ఎక్కడ చూశానో నాకే తెలీదు. ఆ తర్వాత మూణ్ణెల్లనుండీ నిన్నే గమనిస్తొన్నాను. ఒక్క తుంటరితనంతప్ప నీలో ఏ దుర్గుణమూ లేదని గ్రహించాను. అదైనా నీకై నువ్వు అలవాటు చేసుకోలేదని, నీ తండ్రిలోని మార్పు నిన్నూ మార్చేసిందని తెల్సుకున్నాను. నువ్వంటే సరే మీ నాన్నని చూసి నేర్చుకున్నావు. మీ నాన్న అలా మారిపోటానికి కారణమేమిటి?...నీ సొంత విషయాల్లో జోక్యం కల్గించుకుంటున్నాను. మరోలా అనుకోకు.''

''ఫర్వాలేదు. నా స్వంతమనిషివి కావాలనుకున్నపుడు నాగురించీ మా కుటుంబం గురించీ తెల్సుకోటంలో తప్పు లేదు. కాని మానాన్న ఎందుకలా మారిపోయాడో నాకూ తెలీదు.''

''తెల్సుకోటానికి ప్రయత్నం చెయ్యలేదా నువ్వు?''

''లేదు.''

''లేదంటే సరిపోదు. తెల్సుకోటానికి ప్రయత్నిం

చాలి నువ్వు. చేతనైతే ఆయన్ని మార్చు..."

"మా అమ్మే మార్చలేకపోయిందాయన్ని. యిక నావల్లేమవుతుంది? ఈ మధ్య ఆయనంటే రోజు రోజుకీ అసహ్యం పెరుగుతోంది...యిలాంటప్పుడు ఆయన గొడవెందుకు? సౌజన్యా! నువ్వు నన్ను నిజంగా వివాహం చేసుకుంటావా?"

"ఏం నమ్మకంలేదా?"

"ఏమో! అంతా కలలా తోస్తోంది."

"నిజానికీ కలకీ భేదం తెల్సుకోలేనివాడివి జీవితంలో ఎలా రాణిస్తావ్?"

"నిజంగా ఒక్కోసారి నిజంకూడ కలలాగే వుంటుంది సౌజన్యా! నవ్విస్తుంది. కవ్విస్తుంది. ఊరిస్తుంది. ఉడికిస్తుంది. కాని అంతలోనే ఏమారుస్తుంది. కాని యిది మాత్రం కల కాకూడదు..." ఆమె కోమలమైన చేతి వ్రేళ్ళని మృదువుగా ముద్దుపెట్టుకున్నాడు చంద్రం.

"నువ్వు నిన్నమాత్రమే నన్ను చూశావు. పరిచయం చేసుకున్నావు. కాని నేను...? మూణ్ణెల్లనుండీ మూగగా నిన్నే ఆరాధిస్తోన్నాను. మరి నాకెలా వుండాలంటావ్?"

"నాతో యిన్నాళ్ళుగా ఎందుకు పరిచయం చేసుకోలేదు?"

"భయం..."

"భయమా!" ఆశ్చర్యపోయాడు చంద్రం.

"నువ్వంటే కాదు. నాగరాజంటే..."

"నాగరాజా! వాడెవడు?"

"సార్థక నామధేయుడు. వాడిపగ నాగుపాము పగ

కన్నా ఘోరమైంది. మీ నాన్నంత వయసుంటుంది దాదాపు. వెనకనుండి మా నేస్తే అచ్చం మీ నాన్నలాగే వుంటాడు. నేను వాడికి భయపడుతున్నాను చంద్రం!"

"కారణం?"

"అనారోగ్య కారణంగా మా అమ్మనోసారి హాస్పిటల్లో చేర్చాల్సి వచ్చింది. రోజూ వెళ్ళి ఆమెని పలకరించి వస్తూండేదాన్ని. ఎక్కువకాలం మా అమ్మతోనే గడిపి వస్తూండేదాన్ని.

ఓరోజు మా అమ్మ ప్రక్క బెడ్ పైవున్న ఓ ముసలాయన నన్ను పిలిచి ఓ సూట్ కేసు యిచ్చాడు. మధ్యాహ్నం తన కుమారుడు తనకోసంవచ్చి దాన్ని మరచివెళ్ళాడని దాన్ని దయచేసి అతనికందించమని అర్థించాడు. టాక్సీ డబ్బుకూడా బలవంతంగా చేతిలో పెట్టాడు. ముసలాడి అభ్యర్థనని కాదనలేకపోయాను.

సూట్ కేసు తీసుకువస్తోన్న నన్ను పోలీసులు వెంబడించ సాగారు. అప్పుడు తెలిసింది. అదేదో స్మగుల్డు వస్తువులున్న సూటుకేసని, ముసలాడికి తెలీకుండా అతని కొడుకు స్మగ్లింగ్ బిజినెస్ చేస్తోన్నాడని.

నాకేమీ పాలుపోలేదు. అనవసరంగా నేనీ గందరగోళంలో ఇరుక్కుంటూ నేమోనని చాల భయపడ్డాను. కాని ఆపద్బాంధవుడులా టాక్సీడ్రయివర్ నన్ను రక్షించాడు. సందులు, గొందులు తిప్పి పోలీసుల్ని యేమార్చి నన్నోచోట దింపి వెళ్ళిపోయాడు.

అయినా పోలీసుల భయం నన్ను వదల్లేదు. వెంటనే కన్పించిన ఇంట్లోకి పరుగుతీశాను. ఆయింటి యజమానితో నా అవస్థ చెప్పుకొని కాపాడమని అర్థించాను. సరే నన్నాడు.

కాసేపటికి పోలీసులు రానేవచ్చారు. కాని అతడు అబద్ధాలు చెప్పి వారిని పంపేశాడు. మనసు కుదుటపడి కృతజ్ఞతలు తెలియజేసాను.

కాని తర్వాత తెల్సింది నేను పులినోట్లోంచి జారి సింహం నోట్లో పడ్డానని!

ఆ యజమాని మరురోజు నన్ను కల్సి తన కొడుకుని వివాహం చేసుకోవలసిందిగా కోరాడు. నా ఆస్తి కాజెయ్యాలని అతడి ఎత్తు. నేను నిరాకరించాను. దాంతో కోపం తెచ్చుకొని తన కొడుకుని పెళ్ళాడక పోతే పోలీసులకి నాసంగతి తెలియజేస్తానని బెదిరించాడు ఇంకా బెదిరిస్తూనే వున్నాడు. వాడే నాగరాజని వేరే చెప్పనక్కర్లేదు. ఇలా ఎన్నాళ్ళు సాకులుచెప్పితప్పించు కోగలను? చివరిసారిగా హెచ్చరిస్తూ పదిహేనురోజులు గడువిచ్చాడు.''

''వాడి కొడుకు పేరేమిటి?''

''ఎవడో పోతురాజు. ఎవడైతే మనకేం? నేనువాణ్ని చచ్చినా చేసుకోను. వాణ్నేకాదు, ఇంకెవర్నీ చేసు కోను.''

''ఓసారి ఆ నాగరాజుగాణ్ని చూపించు. గట్టిగా బుద్ధి చెబుతాను.''

''కుక్క తోకకీ వాడికీ చాల దగ్గరి పోలికలున్నాయి చంద్రం...ఎన్నోసార్లు ట్రై చేశాను. బట్ యిన్ వెయిన్! వాణ్ని చంపితేగాని నా పగ తీరదు. ఈ బెడదా తప్పదు. మనసుకి శాంతీ వుండదు...'' ఆవేశంతో సౌజన్య ముక్కుపుటాలదిరాయ్. ముఖం ఎర్రగా కంది పోయింది.

ఆలోచనలో పడ్డాడు చంద్రం. '...తననీ వనిత తనంతట తానే వలచింది. తనకి తానే కోరుకుంది. తను కోరకముందే తన సర్వస్వమూ అర్పించింది. అలాంటిది తనని జీవితంలో మరువలేదు. విడువలేదు. సౌజన్య సహచర్యం తన జీవితంలో నిత్య వసంతాన్ని స్థిరంగా వుంచుతుంది..,ఈ హత్య తానే చేస్తే...?'

ఒక్కసారి గుండె ఝల్లుమంది చంద్రానికి. అయినా తమాయించుకున్నాడు.

తనెన్నడో డిటెక్టివ్ పుస్తకాలు చదివాడు. తల్చుకుంటే ఓ డిటెక్టివ్ నవల కూడ రాయగలడు. పట్టుబడడానికి వీల్లేకుండా హత్య చెయ్యలేడా?...ఆతర్వాత యిద్దరూ ఎంచక్కా పెళ్ళిచేసుకోవచ్చు. ఎవరి పీడా లేకుండా సుఖంగా కాపురం చేసుకోవచ్చు. తనుకూడ ఈ జులాయి వేషాలు మానేసి బుధ్ధిగా ఉంటాడు. యింతటి సౌందర్యరాశి, ప్రేమపిసాసి తనస్వంతం కాబోతోన్నప్పుడు ఆమెలోని భయాన్ని తొలగించటానికి... హత్యచేస్తే ఏం?

"ఏమిటి చంద్రం ఆలోచిస్తోన్నావు? నేను నిన్ను చేసుకోనని అనుమానమా?"

"అబ్బె...అదేంలేదు."

"...కొన్నాళ్ళు ఓపిక పట్టు. నాగరాజుని అంతం చేసి నీ సొంతమవుతాను. లేకపోతే వాడు నీకేదేనా ముప్పు తలపెట్టొచ్చు, నన్ను చేసుకున్నందుకు. నువ్వు రొంపిలో దిగటం నాకిష్టంలేదు."

"సౌజన్యా! వాడెలాగుంటాడో ఒక్కసారి చూపెట్టు. వాడి పీక నేనే నొక్కేస్తాను."

"చంద్రం...!" నమ్మలేనట్టు చూసింది సౌజన్య. "నాకోసం నువ్వు హంతకుడివవుతావా? వద్దు చంద్రం..."

"లేదు సౌజన్యా! నీ అందం నన్ను పిచ్చివాణ్ని చేస్తోంది. నువ్వు లేనిదే బ్రతకలేననిపిస్తోంది. యిన్నాళ్లూ ఆకతాయిగా తిరిగాను. ఆ తిరుగుళ్ళన్నిటికీ ఈ హత్యతో ఫుల్‌స్టాప్ పెట్టేస్తాను. ఆ తర్వాత నీకోసం బ్రతుకుతాను."

"చంద్రం, నాకోసం ఎంత త్యాగానికి సిద్ధమయ్యావ్? నిన్ను జీవితంలో మరువలేను. చచ్చినా విడువలేను..." చంద్రం పెదవుల్ని గాఢంగా చుంబించింది సౌజన్య.

"నీకోసం కాదు మనకోసం! ఆఁ యిప్పుడు మనం జాగ్రత్తగా ఆలోచించి ఓ పథకం రూపొందించాలి. చట్టం దృష్టిలో పడకుండా ఈ హత్యచేసే బాధ్యత నాది."

"నాలో ఎన్నాళ్ళబట్టో ఓ ఆయిడియా వుంది. చెప్పనా?"

"ఏమిటది?"

"ఈ రోజురాత్రి సెకెండ్ షోకి నాగరాజు సర్కస్‌కొస్తాడు. మా అన్నయ్య డాక్టరని చెప్పాగా। అతన్నడిగి కాస్త పొటాసియం సైనేడ్ పట్టుకొస్తాను. ఎలా చంపాలో నువ్వు పుస్తకాల్లో చదివేవుంటావ్. యిలా అయితే నిన్నెవరూ చూసే అవకాశం వుండదు. ఒకవేళ నాగరాజు చావుని తప్పించుకున్నా నిన్ను కనుక్కోలేడు. ఏమంటావ్?"

"బ్రహ్మాండంగా వుంది. కాని నాగరాజు సర్కస్ కి రావాలిగా!"

"అదంతా నేను ఏర్పాటు చేస్తాను."

"అయితే యింకేం?"

"రెండు చేతులు కలిస్తే చప్పుడవుతుందని పెద్దలు వూరకే అనలేదు చంద్రం. నాగరాజు యిప్పుడే వచ్చినంత సంబరంగా ఉంది నాకు. నాగరాజు బెడద తీరిపోయి త్వరలో మనం భార్యాభర్తలం కాబోతున్నందుకు చాలా సంతోషంగా వుంది" మరోసారి అతన్నాక్రమించుకుంది సౌజన్య!

# 6

"మీ నాన్నకి అసలు కొంపంటూ ఒకటుందని ఆయనకి గుర్తే వుండదు. మీ నాన్న ఆ శ్యామలరావింట్లో వుంటాడు. తెల్లారిందని గుర్తుచేసి పేకాట ఆపించి మరీ పిల్చుకురా ఏమిటో ఈ సంసారం. చివర కేమవుతుందో. నాకేమీ అంతుబట్టకుండా వుంది" మాణిక్యమ్మ మరీ నీరస పడిపోయింది.

గబగబా మొహం కడుక్కున్నానన్పించుకొని, కాస్త కాఫీ గొంతులో పోసుకొని, శ్యామలరావు యింటికి వెళ్ళాడు.

శ్యామలరావు యిల్లు తాళం వేసుంది. గత మూడు మాసాలుగా శ్యామలరావు భార్య వూళ్ళో లేదు. పురుటికి పుట్టింటి కెళ్ళింది. అందుకే తన తండ్రికది పేకాట కేంద్రం.

నిట్టూరుస్తూ ప్రాకుతున్నట్టుగా నడుస్తూ యింటి ముఖం పట్టాడు చంద్రం. అతని మస్తిష్కాన్ని ఎన్నెన్నో

ప్రశ్నలు తొలుస్తోన్నాయి.

గతరాత్రి...గతరాత్రి తను ఓ మనిషిని—నాగ రాజుని హత్యచేశాడు! తను, సౌజన్య కలిసి వేసిన పథకం పారింది.

సైనేడ్‌లో ముంచిన గ్రామఫోన్ పిన్‌ని సౌజన్య తన చేతికిచ్చింది. దాన్ని జాగ్రత్తగా దాచుకున్నాడు. ఇద్దరూ సర్కస్ కెళ్ళారు. నాగరాజు ఆకారాన్ని కళ్ళతోనే చూపించి అవతలిక్క ప్రక్క కెళ్ళి కూర్చుంది.

అది యాదృచ్ఛికమో లేక సౌజన్య చేసిన ఏర్పాటో గాని నాగరాజు వెనకసీటు ఖాళీగావుంది. సర్కస్ సర్కిల్ తాము కూర్చున్న చోటికి కాస్త దూరంగా వుండడంతో ఆ ప్రాంతం కాస్త చీకటిగావుంది!

తెల్లటి గ్లాస్కో జుబ్బా తొడుక్కున్న నాగరాజు తనముందుసీట్లో కూర్చొని సర్కస్ చూడటంలో నిమగ్నుడై వున్నాడు. సమయంకోసం కాచుకున్నాడు తను.

దాదాపు చివరి అంశంగా గ్లోబులో మోటర్ సైకిల్ నడిపే ఘట్టంవచ్చింది. మిగతా లైట్లన్నీ ఆరిపోయాయి.

ఆ సమయంలో మెల్లిగా నాగరాజు వీపు పైపిన్‌తో గుచ్చాడు తను. అంతే అరనిముషంలోగానే నాగరాజు కిక్కురుమనకుండా తలప్రక్కకి వాల్చటం చీకట్లోనే లీలగా గమనించాడు.

మెల్లగా తప్పుకొని సౌజన్యతో సహా బయటికొచ్చే శాడు. మళ్ళీ కలుద్దామని చెప్పి సౌజన్య వెళ్ళిపోయింది. తను ఇంట్లోకొచ్చి పడ్డాడు.

హత్య చెయ్యడం చాలా తేలికనుకున్నాడు తను. తను పట్టుబడేందుకు సహాకరించే ఏచిన్న ఆధారమూ వద లేదు. ఆఖరికి తను నాగరాజుపై ప్రయోగించిన గ్రామ

ఫోన్ పిన్ నికూడా తనతోనే తెచ్చుకొని యింటికొచ్చే ప్పుడు దూరంగా రోడ్డుపై ఆగిన వర్షపు నీటిలో విసి రేశాడు.

అయినా ఏదో భయం...మనసునిండా ఏదో గుబులు పోలీసులు...డిటెక్టివ్ లు...వాళ్ళు వేసే యక్ష ప్రశ్నలు. చేసే శల్యపరీక్షలు...భగవాన్! ఈ అపాయం నుండి తప్పించుకుంటే చాలు. సౌజన్య తనదవుతుంది. తండ్రి ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా తను ఆమెను పెళ్ళి చేసుకుంటాడు.

అయినా తనింటికెందు కొస్తారు పోలీసులు? తనే ఈ హత్య చేశాడని ఆధారం? గేటుకీపరుక్కూడా అనుమానం రాకుండా ప్రవర్తించాడక్కడ. తను అనవసరంగా భయపడుతున్నాడు. ఎందుకు భయపడాలి?

అమాయకురాలయిన సౌజన్య భయాందోళనలని పోగొట్టి ఆమె హృదయంలో శాంతినింపాడు. అందుకు సంతోషించాలి. గర్వపడాలి. ఈపని చట్టం చెయ్య గలదా?

ఆలోచిస్తూ మలుపు తిరిగిన చంద్రం గుండె గుభేల్ మంది.

ఆమలుపు తిరిగితే చంద్రం యిల్లు పదిగజాల దూర ముంటుంది. తన ఇంటిముందు పోలీసుజీపు...నలుగురైదు గురు పోలీసులు...ఇన్ స్పెక్టర్ ... తను యెన్నోసార్లు పత్రికల్లో ఫోటోల్లో చూసిన డిటెక్టివ్ జలంధర్ ఎత్తుగా, బలిష్టంగా.

# 7

"నాన్నా" భీకరంగా అరిచాడు చంద్రం.

ఎదురుగా తెల్లని గ్లాస్కోజుబ్బాలో విశ్వనాథం

పడుకో బెట్టబడి వున్నాడు. అతనిలో ప్రాణం లేదు!

శవంపైబడి మాణిక్యమ్మ కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తోంది! ఆ మెని కరుచుకుపోయి మాలతి, లత కూడా బావురుమంటోన్నారు.

"సార్, ఏమిటిది?" అయోమయంగా ఇన్‌స్పెక్టర్ వేపు చూశాడు చంద్రం.

"నిన్న రాత్రి సెకండ్ షో సర్కస్ చూస్తోండగా యితన్నెవరో హత్యచేశారు. జుబ్బా జేబులో మీ యింటి అడ్రసుగల స్లిప్ వుంది" సానుభూతిగా చంద్రంకేసి చూస్తూ అన్నాడు చక్రవర్తి.

"ఆఁ...?" స్తంభించిపోయాడు చంద్రం. అతని మెదడుని లక్ష ప్రశ్నలు చుట్టుముట్టాయి. దేనికీ సమాధానం చెప్పుకోలేక పోయాడు. కళ్ళకి పైర్లుకమ్ముకోన్నాయి. 'తను నిన్నరాత్రి హత్య జేసింది...?' ఆపైన ఆలోచించలేక పోయాడు. స్పృహ తప్పింది. మొదలు నరికిన చెట్టులా కూలిపోయాడు!

ప్రక్కనేవున్న డిటెక్టివ్ జలంధర్ మెరుపులా అతనికి అడ్డు నిలిచాడు. పడిపోకుండా పట్టుకొని ఇద్దరు కానిస్టేబుల్స్ సాయంతో అతన్ని మంచంమీదికి చేర్చాడు.

"అమ్మా! మీరే ఇలా ఏడుస్తోంటే పిల్లల్ని ఓదార్చే దెవరు?" నెమ్మదిగా మాణిక్యమ్మ దగ్గరికి వస్తూ ప్రశ్నించాడు జలంధర్.

"నన్ను ఓదార్చేదెవరు డిటెక్టివ్ గారు! ఆయన సంపాదించినా సంపాదించక పోయినా బాధపడలేదు. సంసారం గురించి పట్టించుకోకపోయినా నేను పట్టించుకోలేదు. ఇంటికి వచ్చినా రాకపోయినా నాకు దిగులు లేదు. ఆయన చల్లగావుంటే చాలుననుకున్నాను. కాని

ఇంత ఘోరం జరిగాకకూడా ధైర్యంగా ఎలా వుండ మంటారు? మీరే చెప్పండి."

పిల్లల్నిద్దర్నీ గట్టిగా హత్తుకొని పిచ్చిగా చంద్రంకేసి చూస్తూ మళ్ళీ బావురుమంది మాణిక్యమ్మ.

"మీ అబ్బాయికేమీ కాలేదు. స్పృహతప్పిందంతే. కాసేపట్లో కోలుకుంటాడు."

"చీమకైనా హాని తలపెట్టే మనిషి కాదాయన. ఇంత కిరాతకం చెయ్యటానికి ఏరాక్షసుడికి మనసొప్పింది? నా పసుపుకుంకుమని తుడిచెయ్యటానికే కఠినాత్ముడికి చేతులొచ్చాయ్? నా పిల్లల్ని తండ్రిలేని వాళ్ళని చెయ్యటానికే కిరాతకుడు కంకణం కట్టుకున్నాడు?" శవంపై బడి తలబాదుకుంటూ విలపిస్తోంది మాణిక్యమ్మ.

ఇలాంటి సంఘటనలు తన వృత్తిలో ఎన్నో చూశాడు జలంధర్. కాని యెన్ని అనునయ వాక్యాలు చెప్పికూడ ఆమెనోదార్చలేక పోయాడు.

"చూడమ్మా! మీరు చాల బాధలో వున్నారు. ఈ స్థితిలో మిమ్మల్ని మీరే ఓదార్చుకోవాలి. పిల్లల్నీ మీరే ఓదార్చాలి. మీ అబ్బాయికి స్పృహొచ్చాక అతన్నీ మీరే ఓదార్చాలి. అతని లేత హృదయం ఈ సంఘటనకి తట్టుకోలేకపోయింది. నేను మళ్ళీ కలుస్తాను."

చక్రవర్తికి శవాన్ని పోస్ట్‌మార్టమ్‌కి పంపవలసిందిగా సూచించి వెళ్ళిపోయాడు డిటెక్టివ్ జలంధర్.

# 8

నడుస్తోన్నాడు చంద్రం. ఆవేశంతో అతని పిడికిళ్ళు బిగుసుకుపోతున్నాయి. ముఖం కందగడ్డలా మారి పోయింది.

'సౌజన్య ఎంతపని చేసింది? తన తండ్రిని...తనతోనే హత్య చేయించింది. ఎంత నయవంచకి? ఎన్ని మాయ మాటలు చెప్పింది? నాగరాజునిగూర్చి ఎంత కథ కల్పించింది? ఎంత త్వరగా తనని బుట్టలో వేసుకుంది? ఎంత అమాయకురాలిలా నటించింది?'

ఏదో సూటుకేసు దాటవేయబోయి వాడి బెదిరింపులకి లొంగిపోయిందిట. వాడిమీద పగట. వాణ్ని చంపితే గాని చల్లారదట...! ఎంత నమ్మకంగా చెప్పింది!

అల్పమైన సుఖాన్నందించి అమూల్యమైన తన తండ్రి ప్రాణాలని పొట్టన బెట్టుకుంది. తన తల్లి అయిదో తనాన్ని మింగేసింది. అది ప్రేయసి కాదు_పిశాచి! తన తండ్రి ప్రాణాలని తనద్వారా హరించిన మృత్యుదేవత!

విశ్వనాథం తన తండ్రని సౌజన్యకి తెలీదా? తెలిసే యింత నాటకం ఆడిందా? అంత అవసరం? 'నాగరాజు మీ నాన్నలాగే వుంటాడు...' అని ఎందుకు చెప్పింది? తెలిసే చేయించింది!

తనపై ఆమెకెందుకింత పగ? తన తండ్రిపై మాత్రం ఎందుకుంటుంది? ఈపని సౌజన్య చేసిందా? లేక యెవరేనా చేయించారా? ఎవరు చేయించి వుంటారు?

ఎవరు చేసినా చేయించినా వాళ్ళకి తన తండ్రిపై ఏదో కక్షవుండాలి. తనపైవుంటే తననే హతమార్చేవారు. తనద్వారా యింతటి శిక్ష ఆయనకి విధించి వుండరు. అందుకు తననే ఉపయోగించి తెలివిగా తప్పుకున్నారు. తన వ్రేలితో తన కన్నే పొడిచారు.

తనిప్పుడు మేల్కొ_నాలి. ఒళ్ళంతా కళ్ళుంచుకోవాలి_ఒకవేపు శత్రువులు తననికూడ కాటు వెయ్యటా

నికి కాలనాగుల్లా మాటువేసివుంటారు. మరో వేపు డిటెక్టివ్ జలంధర్ కాలయముడిలా తనకోసం వేట ప్రారంభిస్తాడు తన బృందంతో. అటు వాళ్ళనుండీ యిటు వీళ్ళనుండీ తప్పించుకోవాలి. అందరి కండ్లూ గప్పి తన తండ్రిని చంపినవాళ్లెవరో ఆరాతియ్యాలి. తనని మాయచేసి తన తండ్రిపై వాళ్లెలా పగ తీర్చుకున్నారో తనూ...

అవును! తనుకూడ తన తండ్రి అనుభవించిన శిక్షే వాళ్ళకి విధించి తన కక్ష తీర్చుకోవాలి! అంతవరకూ తను నిద్రపోడు! విశ్రాంతికూడ తీసుకోడు!

అదే తన ధ్యేయం! అదే తన లక్ష్యం! అదే తన గమ్యంకూడ!

చంద్రం కాళ్ళు శ్యామలరావు యింటికేసి గబగబా నడిచాయ్.

తలుపు తట్టాడు. కాసేపయ్యాక తెర్చుకున్నాయ్.

శ్యామలరావు ఎం. జి. బ్రదర్స్‌వారి సర్వీసులో పార్సెలు గుమస్తాగా పనిచేస్తోన్నాడు. పాతిక-ముప్ఫై మధ్య వుంటుంది వయసు.

"ఏమిటి చంద్రం యిలా వచ్చావ్?" అడిగాడు.

"నిన్నరాత్రి మానాన్న ఎన్నిగంటలవరకు వున్నారిక్కడ?"

"అసలు నిన్న నేను లేందే! నిన్నటినుండే నాకు నైట్ డ్యూటీ ప్రారంభం. రాత్రి ఎనిమిది గంటలకి పనిమీద బైటికి వెళ్ళినవాణ్ని డ్యూటీ ముగించుకొని ఉదయం ఎనిమిదికొచ్చి పడుకున్నాను. ఇప్పుడునువ్వొచ్చి లేపావ్."

"రాత్రి ఎనిమిది లోపల మీదగ్గరికి రాలేదా?"

"లేదు. నిన్న మధ్యాహ్నంనుండీ చూడనేలేదు. వాళ్ళింట్లో వున్నాడేమో చూడు...ఏం? యింటికి రానే లేదా?" చార్మినార్ వెలిగించుకున్నాడు శ్యామల రావు.

"మా నాన్న హత్య చెయ్యబడ్డాడు."

అదిరిపడ్డాడు శ్యామలరావు. పీల్చిన సిగరెట్ పొగ నోట్లోనే వుండిపోయింది.

ఉదయమే తను వాళ్ళింటికి రావటమూ, తలుపు తాళంవేసి వుండటమూ యింటికెళ్ళేసరికి యింటిముందు కన్పించిన సంఘటన, చెప్పాడు చంద్రం.

"బాబూ చంద్రం...ఒక్క నిముషం వుండు" గబగబా లోపలికెళ్ళాడు శ్యామలరావు. ఓ నిముషం తర్వాత ఓ వుత్తరంతో బయటికొచ్చాడు.

"ఈ వుత్తరం యింత త్వరగా నీకివ్వాల్సొస్తుందని కల్లోకూడా వూహించలేదు చంద్రం" బాధగా అన్నాడు శ్యామలరావు.

అయోమయంగా అతనివేపు చూశాడు చంద్రం.

కళ్ళజోడుతీసి చెమ్మగిల్లిన కళ్ళని లుంగీ కొసతో అద్దుకున్నాడు శ్యామలరావు.

"చంద్రం...నిన్న వుదయం మీనాన్న మా యింటికి వచ్చాడు. నేను టిఫిన్ చేద్దామని హోటలుకు బయలుదేరుతున్నాను. ఇద్దరం కలసి బయల్దేరాం. దారిలో నాకీ ఉత్తరం ఇచ్చాడు. నువ్వు చెడిపోతున్నావని చెబుతూ తండ్రిగా వాణ్ణి దారిలోకి తీసుకురాలేకపోయానని, వాణ్ణి మందలించటానికి తగనని, తనెందుకిలా మారిపోయాడో వాడికి తెలీదని, తెల్సుకునే వయసూకాదని, తనుఇలాగే

తాగితాగి వున్నట్టుండి గుటుక్కుమంటే అసలు నిజం వాడికి తెలీదనీ, కొడుగ్గా వాడు తనని అసహ్యించుకుంటే తను భరించలేడని, తను చనిపోయింతర్వాతే ఈవుత్తరం వాడికివ్వమని నాతో మరీ మరీ చెప్పాడు."

"దాన్ని నాకు ముందుగానే ఎందుకివ్వలేక పోయారు."

"తను చనిపోయింతర్వాతే యిమ్మన్నాడు. అలాగని ఒట్టేయించుకున్నాడు కూడా."

ఆ వుత్తరాన్ని అందుకొని చించి ఆత్రంగా మడతలు విప్పాడు చంద్రం.

పేజీలు తిప్పేకొద్దీ అతని ముఖంలో రంగులు మారజొచ్చాయి. ఉత్తరం పూర్తిగా చదివేసరికి చంద్రం ముఖం అస్తమిస్తోన్న సూర్య బింబంలా ఎర్రబడిపోయింది చివరి రెండుమూడు పేజీలపై అతని దృష్టి నిలిచిపోయింది వాటిని మాత్రం మళ్ళీ వెనక్కి తిప్పాడు.

"బాబూ చంద్రం! అదీకథ! ఆనాడు విశాలి రంకుతనాన్ని చూశానని, దాన్నెక్కడ బయట పెడతానోనని అంతటి అభాండాన్ని నాపై వేసింది.

చెయ్యని దొంగతనాన్ని నాపై మోపింది. భర్తతో చెప్పి నన్ను పన్లోంచి తీసేయించింది. నా పరువు, మర్యాద మంట గలిపింది. నన్ను నట్టేట ముంచింది. అది ఆడదికాదు బాబు! ఆడపుక్క!! ఆడపిమ్మగం!!!

తీరని పరాభవాగ్నిలో మండిపోతూ ఇల్లుచేరుకున్నాను. ఆ తర్వాత మళ్ళీ ఓసారి నన్ను పిలిపించి వూరువదలి వెళ్ళిపొమ్మని బెదిరించింది. నేనక్కడేవుంటే భర్తతో చెబుతానేమోనని భయం!

కాని నేను వూరువదలి వెళ్ళిపోలేదు. ఎందుకో తెలుసా బాబూ! మీ కోసమే! మీరందరూ చదువుతున్నారు. మీ చదువుని భగ్నం చెయ్యటం ఇష్టంలేక పోయింది నాకు. అందుకే ఈవూళ్లోనే తలదాచుకున్నాను.

ఆ తర్వాత విశ్వేశ్వరరావుగారు చనిపోయారు కాదు, చంపబడ్డారు. ఈవిషయం నాకుమాత్రమే తెలుసు. రవీంద్ర, విశాలి కల్సి నా యజమానిని పొట్టన బెట్టుకున్నారు.

చంద్రం! విశ్వేశ్వరరావుగారు పూజ్యులు. నా యజమానులు. ఇన్నేళ్ళూ ఆయన ఉప్పు తిన్నాను. ఆ ఉప్పుతోనే మిమ్మల్నందర్ని పెంచాను. మనప్రతి రక్తకణంలోనూ విశ్వేశ్వర రావుగారు తొంగిచూస్తూనే వుంటారు.

ఆనాటి సంఘటనతో నేను పూర్తిగా మారి పోయాను. ఫలితంగా తాగుబోతు నయ్యాను. ఉద్యోగం దొరక్కపోవటంతో జూదరినయ్యాను. సంపాదించబోయి వరుసగా అన్నీ పోగొట్టు కున్నాను.

దీనికంతా కారణం విశాలి!

వాళ్ళని తెలిసికూడా వాళ్ళమీద పగ తీర్చు కోలేక పోయాను. ఆపని చెయ్యాల్సింది నువ్వు బాబూ...నువ్వే!

మంచికి మారుపేరయిన విశ్వేశ్వరరావుగార్ని వాళ్ళు హత్యచేశారు. మనసంసారాన్ని పతనాని కీడ్చారు. విశ్వేశ్వరరావుగార్ని హత్య చేసింది

ఎవరో కనుక్కో. ఋజువు చెయ్యి. వాళ్ళని పురి కంబాని కప్పగించు.

విశ్వేశ్వరరావుగారు నాకేకాదు. నీకూ యజమానే! నీస్వామి భక్తిని నిరూపించుకో! ఆయన ఆత్మకిశాంతి చేకూర్చు. ఇదే నా చివరికోరిక. ఈ నా చివరి కోరిక తీరుస్తావా చంద్రం...?

నీ తండ్రి
విశ్వనాథం.

"నాన్నా!" దాదాపు గర్జించాడు చంద్రం.

అదిరి పడ్డాడు శ్యామలరావు...

"ఇన్నాళ్లూ విషయాలన్నీ నాతో ఎందుకు చెప్పలేదు నాన్నా! జులాయి వెధవలా తిరుగుతుంటే ఎందుకు మందలించలేదు? నీలో యింతటి అగ్నిపర్వతాన్ని దాచుకున్నావా? అర్థమైంది నాన్నా! మీ ఇద్దరి ఆత్మలకీ శాంతి చేకూరుస్తాను. నన్నాశీర్వదించు నాన్నా!"

"చంద్రం, ఏమిటీ ఆవేశం? ఏమైంది నీకు? ఏముందందులో?" శ్యామలరావు గాభరాగా ప్రశ్నించాడు.

"అవన్నీ తర్వాత చెబుతాను" అంటూ బయటికి నడిచాడు చంద్రం.

# 9

చౌదరి షాహుకారు. నలభైపైన వుంటుంది వయసు. కంట్రాక్టరుగా బాగా సంపాదించాడు. ప్రస్తుతం ఆ డబ్బుని ఖర్చుపెడుతూ విశ్రాంతి తీసుకుంటున్నాడు. విశ్వనాథమూ అతనూ పేకాట మిత్రులు.

తననెవరేనా వెంబడిస్తున్నారేమోనని వెనకాముందూ ప్రక్కలా చూసి ఆ బంగళా కాంపౌండ్‌లో అడుగు పెట్టాడు చంద్రం.

తోటలో కుర్చీలు వేయించుకొని కూర్చుని టీపాయ్‌పై పేక పరచి ఒక్కడే పేకాడుకుంటూ కూర్చొనివున్నాడు చౌదరి.

"నమస్కారం సార్" అన్నాడు చంద్రం.

"ఎవర్నువ్వు?" తలతిప్పి చూశాడు చౌదరి.

"నేను విశ్వనాథంగారబ్బాయినండీ!"

"ఓ... నువ్వటోయ్! రారా ... ఏమిటివ్వాళ మీ నాన్న నిన్ను పంపించాడు?"

"మా నాన్న మీ దగ్గరకి ఇకమీదెప్పుడూ రాలేడు సార్!"

"అదేమిటి? కొంపదీసి ఒక్కసారిగా పేకాటమానేసి మంచివాడయి పోయాడేమిటి?"

"లేదండీ. చచ్చిపోయాడు. ఎవరో హత్యచేశారు."

"వాట్!" అదిరిపడ్డాడు చౌదరి.

"అవునండి, మీరు నాకో సాయం చెయ్యాలి."

ఇంకా తేరుకోలేదు చౌదరి.

"మా నాన్న చివరి సారిగా మీదగ్గరికెప్పుడొచ్చాడు. ఎంత సేపున్నాడు? ఆ తర్వాత ఎక్కడికి వెళ్ళాడు?... వివరాలు కావాలి."

"నిన్న ఉదయమైతే నన్ను కలిశాడు గదయ్యా! అరెరే...ఎంతఘోరం జరిగిపోయింది? నిన్న ఉదయం శ్యామలరావుతో కలసి హోటలుకొచ్చాడు. అప్పుడు నేనూ హోటల్లోనే వున్నాను. శ్యామలరావుని పంపించి మేమిద్దరం క్లబ్బుకెళ్ళాం. సాయంత్రం దాకా పేకాడుతూ అక్కడే కూచున్నాం."

"ఇంకో విషయం. మా నాన్న యెప్పుడూ జూబ్బా వేసుకోరు. అలాంటిది చనిపోయేప్పుడు గ్లాస్కో జూబ్బా

వేసుకున్నారు. దాన్ని మార్చిచ్చారా?" చౌదరి ధరించిన జుబ్బావేపు చూస్తూ అన్నాడు చంద్రం.

"జుబ్బా! నేనివ్వలేదే? ఆఁ...గుర్తొచ్చింది. క్లబ్బులో పేకాటాడుతుండగా ఓ అపరిచితుడు పరిచయమయ్యాడోయ్!"

ఆత్రంగా ముందుకి వంగాడు చంద్రం.

"మేం ఆడుకుంటున్నాం. ఎవరో టక్ చేసుకొని టై కట్టుకున్నాడు. అతను మా దగ్గరకొచ్చి తన్నుతాను పరిచయం చేసుకొని ఆటలో భాగం కోరాడు.

క్లబ్బున్నది అందుకేగా! ఆహ్వానించాం. అతనో విచిత్రమైన పందెం పెట్టాడు. తను ఓడిపోతే తన చేతిలో వున్న అట్టపెట్టిని గెలిచిన వారికిస్తానన్నాడు.

అందులో కుట్టించిన కొత్త జుబ్బావుంది. అదేమిటని అడిగితే తనకి జుబ్బా అంటే చాలా ఇష్టమని అది ధరించిన వాళ్ళని ఎక్కువగా ఇష్టపడతానని చెప్పాడు. మరి నువ్వెందుకు వేసుకోలేదని అడిగితే, ఇష్టమైనది అరుదుగా అనుభవిస్తేనే ఆనందమన్నాడు!

అతని విచిత్ర నైజానికి ఆశ్చర్యపోతూ ఆట మొదలు పెట్టాము. అదృష్టవశాత్తు మీ నాన్న గెలిచాడు. అన్న మాట ప్రకారం అతడు ఆ పాకెట్ ని మీ నాన్నకిస్తూ ఆటలో ప్రదర్శించిన నైపుణ్యానికి ప్రత్యేక బహుమతిగా రెండు సర్కస్ టికెట్లుకూడా యిచ్చాడు."

ఉలిక్కిపడ్డాడు చంద్రం. "సర్కస్ టికెట్లా?" అన్నాడు అప్రయత్నంగా.

"అవును సెకండ్ షోవి. మీ నాన్న నన్నూ రమ్మని బలవంతం చేశాడు. కాని సెకండ్ షోకి నేను రాలే

నన్నాను. అతనుమాత్రం మీ నాన్న చేత అప్పటికప్పుడే ఆ జుబ్బాను తొడిగించి తృప్తిపడి వెళ్ళిపోయాడు."

"అతడిపేరు తెల్సా మీకు?"

"ఏదో చెప్పాడోయ్... అంతగా గుర్తులేదు."

చంద్రం కన్నులు చెమ్మగిల్లాయ్.

"మా నాన్నతో బాటు మీరూ సర్కస్‌కు వెళ్ళి వుంటే బాగుండేది" అన్నాడు.

"అంటే...?"

"సర్కస్‌లోనే హత్య జరిగింది. వాడెవడో గానీ వాడే మా నాన్నని చంపించాలనే పథకంతో ముందు చూపుగా సర్కస్ టికెట్టిచ్చాడు. అంతేకాదు. జుబ్బా కూడా" అనబోయి ఆపేశాడు చంద్రం.

"ముఖపరిచయమైనా లేదే? వాడికి మీ నాన్నపై ఎందుకుంటుంది పగ? క్లబ్బులోనే మా తొలిపరిచయం."

"అదే తెల్సుకోటానికి ప్రయత్నిస్తున్నాను. మా నాన్న చావుకి కారకులైన వాళ్ళని మృత్యు దేవత కౌగిట్లోకి పంపిస్తాను. అంతవరకూ నిద్రపోను" ఆవేశాన్ని దిగమింగుతూ "అన్నట్టు ఇంకో టికెట్ ఏం చేశాడు?" అని అడిగాడు చంద్రం.

"ఏమో! నాకు తెలీదు. అక్కడనుండి తిన్నగా పార్కువరకూ నడిచాం. అక్కడే వున్నాం ఏడువరకు. మా ఇంటికి నడుస్తూ వచ్చాం. ఎనమిదయింది. మా ఇంట్లోనే భోజనం చేశాం. సర్కస్ కెళ్ళొస్తానని బయల్దేరాడు."

ఏదో ఆలోచిస్తూ మౌనంగా తలూపాడు చంద్రం.

"అదే చివరిసారి చూడ్డం. ఆ తర్వాత మళ్ళీ కన్పించ లేదు. ఎవరేనా ఫ్రెండు కనపడితే తీసుకొని వెళ్లుండచ్చు

లేదా తాగటానికి పనికొస్తాయి లెమ్మని అమ్మివుండచ్చు"
అన్నాడు చౌదరి.

# 10

ఎండ మండిపోతుంది. ముఖం జిడ్డోడి శరీరమంతా చెమటలు కారుతోంది. అయినా లెక్క చేయకుండా గబగబా నడుస్తూన్నాడు చంద్రం. అప్పుడప్పుడూ కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటున్నాడు. గంటపైగా నడిచి 'హోటల్ తిలోత్తమ' చేరుకున్నాడు.

నేరుగా లిఫ్ట్ వేపు నడిచాడు.

'సిక్స్తు ఫ్లోర్' లిఫ్ట్‌బోయ్‌తో చెప్పాడు.

ఆరవఫ్లోరు చేరుకున్నాక రెండు నిమిషాలు అటుయిటు తిరిగాడు. తన నెవరూ చూడకుండా చూసుకొని గబ గబా పరిగెత్తి మెట్లు దిగుతూ అయిదవఫ్లోర్ చేరుకున్నాడు. సరాసరి అయిదువందలా ముప్ఫయ్యొకటో నంబరు గదివేపు నడిచాడు. తలుపుతట్టాడు. తెరవగానే చొరవగా లోపలకు దూసుకువెళ్ళి తలుపు గడియవేశాడు.

లోపల సౌజన్య ఎండుటాకులా వణక సాగింది చంద్రాన్ని చూడగానే!

"...ను...నువ్వు ఎప్పుడొచ్చావ్ పూర్ణం...డి?"

"నన్ను రేపురమ్మన్నది నువ్వీరోజు ఉడాయించడానికన్నమాట. నీ ప్రశ్నకు జవాబు తర్వాత చెబుతాను. ముందు నాగరాజెవరు చెప్పు" ప్రళయకాల రుద్రుడిలా గర్జించాడు చంద్రం.

లేడిపిల్లలా వణికిపోతూంది సౌజన్య.

"నువ్వు నన్ను ప్రేమించావు. నీ గుండెల్లో నా రూపాన్నే నింపుకున్నావు. మూణ్ణెళ్ళనుండీ మూగగా నన్నే ఆరాధిస్తున్నావు. అందుకే నీకై నువ్వు నన్ను

కప్పించి శరీరాన్ని అర్పించావు. వెనకనుండి చూస్తే నా తండ్రిలావుండే నాగరాజుకి భయపడుతున్నావు. వాడు చచ్చాక నన్ను పెళ్ళాడుతావు, కదూ!" వ్యంగ్యంగా అన్నాడు చంద్రం.

"చంద్రం...నువ్వు..."

"ఆఁ...అవును. నేను నేనే! నాగరాజు నాగరాజేనా అని అడుగుతున్నాను. చెబుతావా ఛస్తావా?" చంద్రం కళ్ళు నిప్పుకణికల్లా వర్షిస్తోన్నాయి. భయంకరంగా ఆమెవేపు అడుగులు వేశాడు.

"లేదు చంద్రం, నాగరాజు మీ నాన్నే!"

"మరి ఎందుకింత నాటకమాడావ్? ఎవరు చెయ్యమన్నారీపని?" ఆమె పీక పట్టుకున్నాడు.

"చంద్రం నన్ను చంపొద్దు. అంతా నిజమే చెబుతాను. అబద్ధం చెప్పను."

"ఇది కోర్టుకాదు, యమపురికి రోడ్డు! నేను నిన్ను పెళ్ళాట్టానికి వచ్చిన చంద్రాన్ని కాను. నిన్ను యమనగరానికి పంపడానికివచ్చిన యమదూతని!" చంద్రం చేతులు సౌజన్య గొంతుపై బిగుసుకోసాగాయ్.

"నన్ను చంపొద్దు... నేను...రవీంద్ర పాత ప్రియురాల్ని. మీ నాన్నని చంపమని అతనే నన్ను ప్రోత్సహించాడు. ఈ అయిడియా చెప్పిందికూడ అతనే. మీ నాన్నకి కొత్తజుబ్బా పంపిందికూడ రవీంద్రే!"

"ఎవరితో పంపాడు?"

"నాకు తెలీదు. అతనికి నూర్రూపాయ లిచ్చాడు. నాకు పదివేలిచ్చాడు."

"హుఁ...ముష్టి పదివేలు. కలకాలం దాచుకోగలవా

వాటిని? వెధవ కాగితాలకోసం జీవితాలు నాశనం చేస్తావా?"

"జీవితాలు మటుకు శాశ్వతమా చంద్రం?"

"యూ...డర్టీ డెవిల్! డర్టీ బిచ్! అందుకని జీవితాలని పణంగా పెట్టి డబ్బు సంపాదిస్తావా? కడుపు కోసం ఇంత నీచానికి పాల్పడకపోతే పడుపు వృత్తి చేసుకోరాదూ! దీనికంటె అదే నయం.

పాపిష్టి డబ్బుకోసం ఓ నిండుప్రాణాన్ని బలితీసుకుంటావా? అదే రవీంద్ర నిన్ను చంపితే లక్షరూపాయలిస్తానన్నాడు నాకు. ప్రాణాలిచ్చేసేయ్.

ఏం మాట్లాడవు? ఎవడి స్వార్థంతోనో నీ స్వార్థం కలిపి పవిత్రమైన తండ్రీకొడుకుల బంధాన్ని రూపుమాపుతావా? తండ్రిని కొడుకుచేతనే హత్య చేయిస్తావా? నీలాంటి నీచురాలు ప్రాణాల్తో ఉండటానికి వీల్లేదు.

నాలో పెరుగుతోన్న కక్ష, రగులుతున్న హృదయఘోష ఈ రెండింటి సౌజన్యంతో నిన్ను హతమారుస్తాను. చచ్చేముందు ఆ రవీంద్ర విశాలి ఇప్పుడేయే పథకాల్లో వున్నారో చెప్పు" ఆమెనలాగే మంచం దగ్గరకి ఈడ్చుకుపోయాడు చంద్రం.

"అది చెబితే నన్ను చంపేస్తాడు రవీంద్ర."

"చెప్పకపోతే ఇప్పుడు నిన్ను చిత్రవధ చేస్తాను."

"వద్దు, చెబుతాను. నాగరాజుని_అదే మీ నాన్నని నీలోనే చంపించితే ఈ కేసులో నువ్వే ఇరుక్కుంటావని తాము సులభంగా తప్పించుకోవచ్చని తలపోశారు. హత్య నీతోనే చేయిస్తే నన్ను రెండో పెళ్ళి చేసుకుంటానని ఆశ చూపాడు రవీంద్ర. విశాలి, రవీంద్ర మొదటి భార్య."

"రవీంద్ర విశాలి రెండవభర్త. ఆ విషయం నీకు తెల్సా?"

"తెల్సు. విశ్వేశ్వరరావునుకూడా వాళ్ళే హత్య చేశారు. బయటపడకుండా కారాక్సిడెంటని నమ్మించారు హత్య చేయగానే నిన్ను ఊరికి వెళ్ళమన్నాను. నువ్వెళ్ళి పోయివుంటావని వాళ్లూ అనుకుంటుంటారు. నన్నిప్పుడు నువ్వు చంపితే నువ్వు వూళ్ళోనే ఉన్నావని లేదా వచ్చి వుంటావని తెల్సుకుని నిన్ను చంపడానికి ప్రయత్నిస్తారు."

"అందుకని నన్ను చంపొద్దూ అంటావ్. వీల్లేదు సౌజన్యా. ఛ...ఆ పేరుకీ నీకూ పోలికే లేదు. నేను చచ్చినా నిన్ను వదల్ను. నిన్నేకాదు వాళ్ళిద్దర్నీకూడ వదల్ను. మీరంతా పైకివెళ్ళి మా నాన్నతో క్షమార్పణ చెప్పుకోవాలి. అం" కసిగా ఆమెని మంచంమీదకు తోసి వేశాడు చంద్రం.

దభాలున మంచంపైబడి బంతిలా పైకీ క్రిందికీ ఎగి రింది సౌజన్య. ఆమె కళ్ళలో మృత్యుభయం తాండవ మాడుతూంది!

చుట్టూ చూశాడు చంద్రం. టీపాయ్‌పై సూట్ కేసూ ప్రక్కనే ప్లేటులో ఆపిల్‌పళ్లూ కత్తీ వున్నాయ్. ఓ ఆపిల్ సగంవరకు కోయబడివుంది.

కత్తిని చూడగానే చంద్రం కళ్ళు మెరిశాయ్. మెరుపులా వెళ్ళి దాన్నందుకున్నాడు.

"చంద్రం, ఆ కత్తితో చంపుతావా నన్ను? అది పళ్ళుకోసే కత్తి."

"మరెలా, రివాల్వర్ లేదే! అయినా పళ్ళుకోసేకత్తి గొంతు కొయ్యదా చూదాం" ఒక్కసారి వికటాట్టహాసం

చేశాడు చంద్రం. అతనిలో కనిపిస్తోన్న యమధర్మ రాజుని చూడలేక గట్టిగా కళ్ళుమూసుకుంది సౌజన్య.

"కళ్ళు తెరువ్. పదివేలూ లెక్కపెట్టుకుంటూ ఆపిలుపళ్లు తింటూ సంతోషంగా కులుకుతున్నావ్ కదూ? ఈ ఆపిల్సు ఎరుపో నీ రక్తం ఎరుపో ఏది యెక్కువ చూడాలి.

అమాయకంగా నిద్రపోతున్న నాలోని మన్మథుణ్ని నన్ను కవ్వించి నాకు తొలిసారిగా స్వ...ర్గ...లో... కా...న్ని చూపినందుకు ఒకటి, డబ్బుకోసం బాంధవ్యాన్ని, రక్తసంబంధాన్నికూడా లెక్కచెయ్యక నా తండ్రి శాశ్వతనిద్రకు నన్నే కారణం చేసినందుకు ఒకటి, కల్మష పాషాణ హృదయాన్ని మరుగుపరచి లేతహృదయమని నమ్మించి నాగుండె నిండుగా నీ రూపమే వుందని మాయమాటలు చెప్పి ద్రోహం చేసినందుకు ఒకటి మొత్తం కలసి మూడే మూడుపోట్లు... మూడే మూడు చోట్లు! నాపగ చల్లారేలా...నాకసి తీరేలా..."

మూడుసార్లు కత్తియెత్తి దించాడు చంద్రం. మరొక్కసారి భయంకరంగా నవ్వాడు.

ఆ నవ్వులో సౌజన్య చావుకేక కల్సిపోయింది. మల్లెపుప్వులాంటి పరుపు మందారపూవులా మారిపోయింది. సౌజన్య తల నిర్జీవంగా ప్రక్కకు వాలిపోయింది.

రక్తపు వాసన రూమంతా గుప్పుమంది!

## 11

"నన్ను చంపుతావా?" భయంగా కోపంగా అంది పిశాలి.

వికటంగా నవ్వాడు రవీంద్ర.

"ఇదే నేనూ అంటున్నాను. ఆ ఆస్తికోసం విశ్వేశ్వర రావుని చంపించావ్. అందుకు సహాయంకోసం, నీ తాత్కాలిక శారీరక వాంఛలు తీర్చుకోటం కోసం నన్ను చేరదీశావ్. ఆ ఆస్తికోసం తాళికట్టిన భర్తనే హత్య చేయించిన నీచురాలివి నువ్వు. స్వప్రయోజనం కోసం నన్ను చేరదీశావ్. అది నీ నాశనానికి దారి తీసింది. ఇందులో నాతప్పేమీ లేదు!"

"రవీంద్రా! నువ్వు నాకు చేసిన సహాయానికి సగం ఆస్తి నీపేర రాశాను. అంటే దాదాపు నలభైలక్షలు! నా భాగంకూడా కోరటం దురాశ అవుతుంది."

"నీ శరీరంలోనే నాకు భాగం ఇస్తున్నావు. నీ శరీరం నాది! నీ భాగం ఆస్తి నాదికాదా?"

"మన ఒప్పందం ప్రకారం సగం ఆస్తి నీది—సగం నాది. అంతకుమించి మార్పు జరగదు."

"ఎలా జరగదు? సగం ఆస్తికోసం విశ్వేశ్వరరావుని చంపి హంతకున్నయ్యాను. మిగతా సగంకోసం యిప్పుడు నిన్ను చంపుతాను. ఓహత్యచేశాక ఎన్నయినా ఒకటే" వికటంగా నవ్వుతూ తలెత్తాడు రవీంద్ర.

"హుఁ యిన్నాళ్ళూ ఓ పాముకి పాలుపోసి పెంచానని గ్రహించలేకపోయాను."

"నువ్వే ఓ పామువి! అందుకే నన్ను ఎంచుకున్నావ్ ఏనాటి కయినా నాకూ విశ్వేశ్వరరావు గతే పట్టించవచ్చు. అందుకే ఆస్తి మొత్తం నా హస్తగతమైతే కుక్కలా పడివుంటావ్. మర్యాదగా సంతకం పెట్టు."

"ఆస్తిమొత్తం నాపేర రాశాక ఆయనేమయ్యారో, నాకు బాగా తెల్సు. నీపేర రాస్తే నేనూ...ఊహూఁ..

సంతకం మాత్రం చచ్చినా పెట్టను."

"చచ్చాక ఎలాగూ పెట్టలేవు. అందుకే కొద్దికొద్దిగా చంపుతాను. భూలోక నరకం చూపిస్తాను. ముక్కు, చెవులు, పెదవులు, చెంపలు, పరువాల బరువులు ఒకొక్కటిగా కోసేస్తాను! ఇన్నాళ్ళూ నాకు సుఖాన్ని చ్చావ్ నాలోని రాక్షసుడు విజృంభించకముందే మర్యాదగా సంతకం చెయ్!" అంటూ రవీంద్ర కత్తిని ఆమె బుగ్గపై ఆనించాడు.

# 12

శక్తికొద్దీ తలుపుల్ని బలంగా తన్నాడు చంద్రం. భళ్లున తెరుచుకున్నాయి.

ఎదురుగా సింహాన్ని చూసినట్టుగా అదిరి పడ్డాడు రవీంద్ర. విశాలి మంచాని కంటుకుపోయింది.

చంద్రం, రవీంద్ర గదిలోనుండి దొంగిలించి తెచ్చిన రివాల్వర్ ను వాళ్ళకు గురిపెట్టాడు.

"నువ్వు...నువ్వు...ఎలా?"

"ఎలా వచ్చాననేగా నీ ఏడుపు? మిస్టర్ రవీంద్రా నా చేతిలో నీ ఆయువు మూడింది.

ఎన్నడూ తొడగని జుబ్బాను మా నాన్నచే తొడిగించి నేనాయన్ని గుర్తు పట్టకుండా చేశావ్! సౌజన్యను పంపించి నాచేత ఆయన్ని తెలివిగా చంపించావ్! పెద్ద మనిషిగా చెలామణి అవుతున్నావ్. ధర్మరాజులాంటి విశ్వేశ్వరరావుగార్ని ఆస్తికోసం, ఆడదానికోసం మట్టు పెట్టావ్. నువ్వు సంపాదించిన ఆస్తిని కాదురా...నువ్వు చేసిన పాపానికి ద్రోహానికి శిక్ష అనుభవించు" మూడు సార్లు ట్రిగ్గర్ నొక్కాడు చంద్రం.

నిశ్శబ్దంగా ప్రయాణించిన మూడు బుల్లెట్లూ రవీంద్ర గుండెల్లో తిష్టవేశాయి!

రవీంద్ర ఎత్తినచెయ్యి ఎత్తినట్లే వుండిపోయింది అతని చేతిలోని కత్తి ఖంగుమని చప్పుడుచేస్తూ క్రింద పడి పోయింది. రవీంద్ర నిర్జీవ శరీరం 'దబ్' మని నేల కూలింది!

తృప్తిగా శవంవేపు చూశాడు చంద్రం!

"చంద్రం శత్రువువయినా నిన్నభినందిస్తున్నాను. రవీంద్ర బారినుండి నా ప్రాణాన్ని రక్షించావు. నీఋణం తీర్చుకోలేను. నీకు నేను చేసిన అన్యాయానికి నష్ట పరిహారంగా రవీంద్ర ఆస్తిని నీపేర వ్రాస్తాను. ఇద్దరం అనుభవిద్దాం" అప్పటికి తేరుకుంది విశాలి.

"విశాలీ! రవీంద్ర నిన్ను చంపకుండా ఎందుకు రక్షించానో తెల్సా? ఆ ఛాన్స్ నాకు దక్కాలని!" మృదువుగా అన్నాడు చంద్రం.

"చంద్రం...?"

"అవును. ఆ స్తినిచూసి ఆశలు రేపుకోటానికి నేను మీకమల్లే కుక్కనికాను. ఇందులో మిగిలిన మూడు బుల్లెట్లూ నీకోసం! చివరి కోరికగా భగవంతుడిని తలుచుకో!"

"చంద్రం! ఆపద్బాంధవుడిలా ఆదుకొని నాప్రాణాల్ని నిలబెట్టావు. ప్రాణదాతవైనా నువ్వే..."

"విశాలీ, ఛీ! నువ్వు ఆడదానివా? నువ్వాడదానిగా పుట్టడం ఆడజాతికి శాపం. అది వారుచేసుకున్న పాపం. నీలాంటిదాన్ని చంపితే నాకు పుణ్యమేకాని పాపంరాదు. మహిళాలోకం నన్ను పొగడుతుందేకాని దూషించదు. నన్ను పుట్టించినందుకు భగవంతుడు కూడా గర్విస్తాడేకాని గర్హించడు!

భర్తని మోసంచేసి రవీంద్రని వల్లో వేసుకున్నావ్. మీ ఇద్దర్నీ 'ఆ' సమయంలో చూశాడని నీ తండ్రిలాంటి నా తండ్రిని వల్లో వేసుకోవాలని ప్రయత్నించావ్. అది నెరవేరక పోయేసరికి ఆయనపై కక్షగట్టి దొంగతనం నేరం మోపి పన్లోంచి తీయించేశావ్. ఆయన పతనానికీ మరణానికీ కారణమయ్యావ్. నిజమా కాదా?'' గర్జించాడు చంద్రం.

''నిజమే చంద్రం. డైమండ్ నెక్లెస్ నేనే దాచాను. సేఠ్ కాంతాలాల్ పోకర్ చంద్‌తో అబద్ధం చెప్పించాను. నన్ను క్షమించు.''

''క్షమించినా ప్రాణాల్తో మాత్రం వదల్ను. నీ మూలాన్నే మా నాన్న విశ్వేశ్వరరావు దగ్గర నమ్మకం పోగొట్టుకున్నాడు. నీ మూలాన్నే ఆయన జూదరి, తాగుబోతయ్యాడు. మీమీద కక్ష తీర్చుకోమని చివరి కోరికగా కోరాడు.

అందుకే ఈ యజ్ఞం తలపెట్టాను. అందులో నువ్వే చివరి సమిధవి! నిన్ను చంపి మా నాన్న ఆత్మకు శాంతి కలిగిస్తాను. ప్రాణదాతనైనా నీ ప్రాణాలు తీస్తున్నానంటే అది నీ తలరాత! ఇంతటితో ముగుస్తుంది నీకథ!'' చంద్రం చేతిలోని రివాల్వర్ మూడుసార్లు పొగలు గ్రక్కింది!

విశాలి అపవిత్ర శరీరంనుంచి ఎప్పుడు బయట పడదామా ఎదురుచూస్తూన్న ప్రాణవాయువులు స్వేచ్ఛావాయువుల్ని పీల్చుకొని అనంత వాయువుల్లో ఐక్యమయ్యాయి.

చంద్రం మనసిపుడు తుఫానుతర్వాత ప్రకృతి నావరించిన ప్రశాంతతలావుంది. హాయిగా ఊపిరి పీల్చుకుని పోలీస్ స్టేషన్ వైపు బయలుదేరాడు చంద్రం.

—: ఐపోయింది :—

సీరియల్




[పదమూడవ భాగము]

శాన్యోరా కళ్ళు మూతలుపడుతుండడం గమనించి వణికిపోయాను.

ఆతృతగా చెంపలు తడుతూ "శాన్యోరా!" అంటూ పిల్చాను.

అర్ధ స్పృహలో ఉందామె.

శరీరం చల్లగా, నా చేతికి తగిలింది.

కంగారులో ఎంత అలస్యం చేసాను.

నా వెన్నులోంచి చలిపుట్టుకొచ్చింది. ఇక ఆలస్యం అయితే నా శాన్‌డ్యోరా—దక్కదు.

వణుకుతున్న చేతుల్తో, శాన్‌డ్యోరాను పసిపాపలా రెండు చేతుల్లోకీ ఎత్తుకొని పిచ్చివాడిలా పరిగెత్తసాగాను కారవాన్ వేపు. సగం దారిలో నాకోసం వెతుకుతున్న పాల్ మాన్, బార్బరా సుసాన్ మొదలైన వాళ్ళు కన బడ్డారు.

"భయంకర్! శాన్‌డ్యోరా కేమయింది" అన్నాడు పాల్ మాన్ గాభరాగా చూస్తూ.

"ప్లీజ్! ముందు శాంపైన్ దగ్గరికి పదండి!" అన్నాను పరిగెత్తుతూనే.

నా వెనుకే వాళ్ళంతా పరుగెత్తసాగారు.

ఓ జీపు సీటులో అడ్డంగా పడుకోబెట్టాను శాన్‌డ్యోరాని! "మిస్టర్ పాల్ మాన్! వేరీజ్ ది డాక్టర్? వెంటనే 'కోరమీన్' లోడ్ చేసి ఇంజెక్షన్ పట్టుకురమ్మని చెప్పండి. ఐ వాంట్ క్విక్ యాక్షన్ ప్లీజ్!"

అరిచాను ఆయాసంగా.

"వచ్చేస్తున్నాడు భయంకర్! లోడ్ చెయ్యడం పూర్తి.." అన్నాడు పరిగెట్టుకుంటూవచ్చి పాల్ మాన్.

అతని మాటలు పూర్తవకుండానే డాక్టర్ వచ్చాడు చేతిలోని లావుపాటి హైపోడెర్మిక్ సిరెంజితో.

"డాక్టర్ క్విక్!" అన్నాను. శాన్‌డ్యోరా గౌనుపైకి తొలగించి కుడితొడవేపు చూపిస్తూ.

డాక్టర్ వెనువెంటనే పొడవాటి సూది ఆమెతొడలో గుచ్చాడు.

మెల్లిగా సిరెంజి నొక్కాడు డాక్టర్. మందు ఖాళీ అయింది. సిరెంజి సూది నెమ్మదిగా బయటికి వచ్చింది.

"అందరూ తప్పుకోండి. ఆమెకు కాస్త గాలి తగల నివ్వండి" కేకలు పెడుతున్నాడు పాల్ మోవ్, జీపు చుట్టూ మూగిన పరివారాన్ని తరుముతూ.

డెట్టాల్ దూదితో-ఇంజెక్షన్ చేయబడిన ప్రాంతాన్ని రుద్దుతూ మౌనంగా ఉండిపోయేను.

డాక్టర్ శాన్యోరా చేతిని తన చేతిలోకి తీసుకొని పల్స్ చూస్తూన్నాడు.

క్షణాలు భారంగా దొర్లుతున్నాయి.

పదినిమిషాలు అయిపోయింది. "డాక్టర్" అన్నాను బొంగురు కంఠంతో.

"భయంకర్! గుండె నీరసంగా కొట్టుకుంటోంది" అన్నాడు డాక్టర్ ఎడంచేత్తో నుదుటిమీద చమటను తుడుచుకుంటూ.

"డాక్టర్! దయచేసి సరిగ్గా చూడండి! ఆమె బ్రతికి తీరాలి" అన్నాను నీరసంగా, ఆదుర్దాగా.

డాక్టర్ కొన్నిక్షణాలు వెయిట్ చేసి మళ్ళీ స్టెత స్కోపు అందుకున్నాడు.

శాన్యోరా ముఖంలోకి చూస్తూ—అలిసిపోయిన హృదయంతో పిచ్చాడిలా కూర్చుండిపోయాను. పాల్ మోవ్ గైడ్ జైరీ నా భుజాలు రాస్తూ ఏవో ధైర్య వచనాలు చెబుతున్నారు. అవి నాకు వినపట్టంలేదు.

"మిస్టర్ భయంకర్! యిప్పుడు హార్ట్ బీట్ లో మార్పు వచ్చింది. అయితే గుండె విపరీతంగా కొట్టు కుంటోంది. ఇది మంచి లక్షణం కాదు" చెప్పాడు డాక్టర్ యింకా పరీక్ష కొనసాగిస్తూ.

నాకు పిచ్చెక్కిపోతోంది.

"డాక్టర్! యింతకీ కరెక్ట్ డోస్ యిచ్చారా? అసలు అది కోరమిన్ ఏనా?" అడిగాను బెంగగా, అతని వేపు చూస్తూ.

ఏ భావం లేకుండా, మౌనంగా నా వేపు చూసి, మళ్ళీ పరీక్షలో మునిగిపోయాడు డాక్టర్!

మరో పది నిముషాలు గడిచాయ్!

ఇప్పుడు డాక్టర్ కళ్ళు మెరుస్తున్నాయ్.

"మిస్టర్ భయంకర్! ఐ యామ్ వెరీ హాపీ! యిప్పుడు ఆమె హార్ట్‌బీట్ నార్మల్‌లో వుంది. కొద్దిసేపట్లో కళ్ళు తెరుస్తుందామె. ఇక గాభరా పడనక్కరలేదు" చెప్పాడు ఉత్సాహంగా పైకిచూస్తూ.

నా కళ్ళలో ఆనంద బాష్పాలు నిల్చాయి. "థాంక్యూ వెరీ మచ్ డాక్టర్! మీ ఋణం తీర్చుకోలేను. పైగా రూడ్‌గా మాట్లాడాను క్షమించండి."

"ఇట్సాల్ రైట్ భయంకర్! మీకు పేషెంట్‌పై వున్న ఆత్రుత అప్యాయత-ఆవేదన మిమ్మల్నలా మాట్లాడించాయ్. నేను పట్టించుకోలేదు. గుడ్‌లక్!" అంటూ వంగి జీపులోంచి బయటకి కదిలాడు డాక్టర్.

శాన్యోరాకింకా స్పృహ రాలేదు.

అసలు ఎందుకు అన్నిసార్లు పిస్తోలు పేల్చిందామె? ఎవరిమీద...? తప్పించుకొన్న ఆటవికుడు ఒకడే కదా? అతను ఏమయ్యాడు...?? కోరమిన్ ఫలితం యిచ్చింది...

శాన్యోరా కళ్ళు నులుముకుంటూ లేచి కూర్చుంది...

ఎందుకో ఛాతీమీద చెయ్యి వేసుకొని ఊపిరి బిగించింది...

నేను ఏవో అడగబోతుండగా—ఆమె భళ్ళున వాంతి చేసుకుంది.

ఆమెను బలంగా పట్టుకుని, ఎవరో అందిచ్చిన మంచి నీళ్ళ గ్లాసు అందుకుని ఆమెకు పట్టించాను.

"శాన్యోరా! ఆర్ యూ ఓ. కే." అన్నాను వీపు నిమురుతూ.

శాన్యోరా చిన్నగా దగ్గి, తల ఊపింది..."య్యెస్ డియర్! థాంక్యూ..."

అంతలో పాల్ మాన్ వేడివేడి కాఫీ కప్పుతో వచ్చాడు. బలవంతంగా దాన్ని శాన్యోరా చేతిలో పెట్టాను.

బాండేజీ వేయబడ్డ కుడిచేత్తో అందుకోబోయి, చెయ్యి నెప్పి పుట్టడంవల్ల—ఎడంచేత్తో తీసుకొని వేడి కాఫీని రెండు గుక్కలు తాగి యిచ్చేసిందామె. అప్పటికి కొంచెం తేరుకున్నట్లయింది.

శాన్యోరా కంఠం అర్ధనీరసంగా పలికింది.

"భయంకర్! నువ్వు వెంటాడుతున్న ఆటవికుడు ఓ వృక్షంవద్ద మాయమయ్యాడు. రక్తపు మరకలు చెట్టుమీద దాకా వెళ్లి ఆగేయి. ఎలా మాయమయ్యాడో నీకర్థం కాలేదు. అందుకే సరిగ్గా పరీక్షించడానికి నన్ను చెట్టెక్కించావ్..."

"య్యెస్ - శాన్యోరా! తర్వాత మనిద్దరి పిస్టల్స్ నుపయోగించి పదకొండు షాట్స్ పేల్చావ్. నాకేం అర్థంకాలేదు. పైగా నీ "ముంజేతికి"కి విషపుబాణం గుచ్చుకోవటమేమిటి? తీరిగ్గా పరిశోధిద్దామంటే నువ్వు ప్రమాదంలో పడ్డావ్. గైడ్ జైకీ ఉదహరించిన కోరమిన్—అమృతంలా పనిచేసి నిన్ను బ్రతికించింది. థాంక్ గాడ్ యు బోర్న్ ఎగైన్."

కాన్స్యేరా మెల్లిగా—బాండేజ్ వేయబడిన కుడి చేత్తో బాబ్డ్ హెయిర్ వెనక్కి తోసుకుంది. తల ఊపుతూ మెల్లిగా పలికింది. "అవును భయంకర్! నువ్వు ఊహించని విషయం—నువ్వేకాదు ఎవ్వరూ ఊహించలేని సంఘటన అక్కడ జరిగింది."

"ఏమిటమ్మా అది?" ఉత్సుకతను చంపుకోలేక ఆసక్తిగా ముందుకు వంగి అడిగాడు డాక్టరు.

అందరూ కళ్ళప్పగించి చూస్తున్నారు...

"వినండి" కొద్దిపాటి ఉత్తేజస్వరంతో అన్నది.

"రెండో ఆటవికుడు దాకున్నది ఎక్కడో కాదు. ఆ చెట్టు తొర్రలో!! దాన్ని తొర్ర అంటే సరిపోదు... అది చెట్టులో ఏర్పర్చిన ఓ గుహ!! లేకపోతే—ఇల్లు. అలా—ఆ మహావృక్షంలో-మధ్యభాగాన్ని-లోపలికంతా దొల్చి-డొల్లలా చేసి, నివాసయోగ్యంగా మార్చడానికి-ఎంతో నైపుణ్యం కావాలి.

అంతేకాదు. మరో భయంగొలిపే రహస్యం...!

ఆ చెట్టులోపల వున్నది-గాయపడ్డ రెండో ఆటవికుడొక్కడే కాదు!!

మొత్తం పదిమంది బాసుంటో ఆటవికులు విల్లంబులతో విడిదిచేసివున్నారు. ఆ కన్నంలోంచి - నేను లోపలికి వరుసగా షూట్ చేసాను ముందిగా.

ముదట—ప్రవేశకన్నం కప్పెట్టి చెట్టును మంటలతో నాశనం చేసి—ఆ బాసుంటో దుర్మార్గుల్ని సజీవదహనం చేద్దామనిపించింది—కాని ఆ వృక్షం కాలితే ఈ అడివి అంతా అగ్నికి ఆహుతి అయ్యే అవకాశంవుంది. అందుచేత తప్పనిసరిగా చెయ్యి తొర్రలో పెట్టి కాల్చవలసివచ్చింది

ఆ సందర్భంలో ఎదురైన ఎదురు దెబ్బ యిది'' అంది కానో్యరా శుష్కహాసం చేసి—బాందేజి చెయ్యి మూపుతూ—

''మిస్టర్ భయంకర్! మీరిద్దరూ దేవుళ్ళలా మా కారవాన్‌లో చేరి మమ్మల్ని కాపాడేరు. జీమా స్ప్రింగ్స్ లోంచి నీరు టాంకర్‌లోకి నింపబోతున్నప్పుడు— అపాయాన్ని గుర్తించి నువ్వు బార్బరానూ, కానో్యరానూ చటుక్కున తోసి కాపాడకపోతే వారిద్దరూ మరణించి వుండేవారు. తర్వాత మనమూ చంపబడేవాళ్ళం. నీకు కృతజ్ఞత లెలా చెప్పాలో తెలియటంలేదు'' అన్నాడు పాల్‌మాన్ ఆర్ద్రకంఠంతో.

''డియర్ ప్రొఫెస్సర్! అప్పుడే శత్రువులను మనం జయించలేదు. పూర్తిగా వాళ్ళను మనం చంపలేదు. అస్సలు వాళ్ళ కేంద్రనివాసం ఎక్కడో మనకు తెలియదు. అంతేకాదు. కొంతమంది బానుంటోలను మనం చంపాం. ఆటవికులది పాముపగ. మిగతావారు కక్షగట్టి మనల్ని పిచ్చిగా తరిమే అవకాశం లేకపోలేదు. సో, ముందున్నది మరింత ప్రమాదం.

నేను మీలో మనిషిని. మనం క్షేమంగా మాసమ్ తెగవారిని చేరుకున్నప్పుడు మీరే కృతజ్ఞతలు చెప్పినా స్వీకరిస్తాను. దయచేసి ప్రయాణం ప్రారంభించండి. మరో అరగంట జర్నీ చేసి ఈ ప్రాంతాలకు బాగా దూరంగా వెళ్ళాలి. ఇప్పటికే చీకటి పడింది'' అన్నాను.

తల ఊపుతూ అక్కడ్నించి పాల్‌మాన్, ప్రయాణ సన్నద్ధాలు చేయడాన్కి కదిలాడు.

  

వాటర్ టాంకర్ ట్యూబుల్ని డిస్కనెక్ట్ చేస్తున్నారు పని వర్రాళ్ళు. వాహనాలన్నీ సిద్ధమౌతున్నాయ్.

ఎక్కడ్నించో—నటి బార్బరా హడావుడిగా వచ్చి, నన్ను రాసుకుంటూ వెళ్ళిపోయింది. ఆ రాసుకోటంలో ఓ చీటీ నా కోటుజేబులో నేర్పుగా దోపడం గమనించాను.

అంతా క్షణంలో జరిగిపోయింది.

బార్బరా చర్య—నాకర్థం కాలేదు.

ఏమిటా చీటీ?

ఏముందందులో?

అటూఇటూ చూసేను.

అందరూ పనుల్లో వున్నారు.

శాన్యోరా, పాల్ మావ్‌తో నవ్వుతూ మాట్లాడుతోంది...

'కాల్ ఆఫ్ నేచర్' కోసం వెళ్ళినట్లు ఓ చెట్టు వెనక్కి వెళ్ళాను.

మెల్లిగా జేబులోంచి బార్బరా — దోపిన చీటీ బైటికి తీసాను.

మడతలు విప్పాను.

"మెడియర్ భయంకర్! నీ దగ్గిర పాల్ మావ్ యిచ్చిన వాచీవుంది. రాత్రి నైట్ కాంప్‌లో 'సరిగ్గా' ఒంటిగంటకు నా గుడారానికి రా. చక్కని బహుమతి నీ కోసం ఎదురుచూస్తోంది."

అంతే వుందా చీటీలో. చీటి చింపకుండా, మడతపెట్టి కోటుజేబులోకి తోసాను.

ఎవరూ నన్ను గమనించలేదని నిర్ధారించుకొని వాహనాల వేపు నడిచేను.

మరుక్షణం తర్వాత పాల్ మావ్ పొలికేక వినబడింది.

"గెట్ రెడీ ఎవ్వరీ బడీ!"

* * *

అర్ధరాత్రి దాటుతోంది...

గుడారాలు వరుసగా వృత్తాకారంలో వేయబడ్డాయి.

నా కోరికమీదట—కాంప్ మధ్యగా జనరేటర్ లైటు వెలగడంలేదు. కారణం ఆ లైటు వేసివుంచడంవల్ల అటవికులను ఆకర్షించడమౌతుంది. అందుకే పాల్ మావ్ ని కోరాను రాత్రివేళ లైటు వెయ్యవద్దని. ప్రతి గుడారం లోపలా అవసరమైనంతవరకూ గుడ్డిలాంతరు దీపాలు వెలిగించుకోవచ్చు. ప్రతి ఒక్కరి ప్రక్కమీదా తలగడ క్రిందా టార్చిలైటు వుంటుంది. గుడారంలో ఎంతమంది వున్నా, ఒక్కొక్కరికీ ఒకొక్క పిస్తోలు లేక రైఫిల్ సప్లయి చేయబడింది.

పద్మంలా ఉన్న ఆ గుడారాల బయట సాయుధులైన నలుగురు గార్డులు చక్కర్లు కొడుతూ ఉంటారు.

మాకు కేటాయించబడ్డ గుడారంలో నేనూ శాన్యోరా కాంప్ కాట్ల మీద పడుకొని ఉన్నాం. మా మధ్యన-లాంతరు వెలుగు అర్ధ చీకటిని పారద్రోలుతోంది.

తెల్లటి నైట్ గౌన్ లో మెరిసిపోతూ శాన్యోరా తల క్రింద మోచేయి పెట్టుకొని-కబుర్లు చెప్తోంది.

(సశేషము)

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి ?

ఈ నెల ప్రచురింపబడిన నవలలు, కథలు, హాస్య రచనలలో ఏది ఉత్తమమైనవో, మాసపత్రికలో ప్రచు రించబడిన బ్యాలెట్ పత్రంలో వ్రాసి పంపండి.

ఉత్తమ నవలకు రు. 200/-లు, ఉత్తమ కథకు రు. 100/-లు, ఉత్తమ జోక్‌కు రు. 20/- బహుమతి ఇవ్వబడుతుంది. ఇలాగే యీ మూడు ఉత్తమ రచనలను సరిగ్గా ఎన్నిక చేసిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10-/లు బహుమతి వుంటుంది.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీ దులో కొంత తగ్గింపు లభిస్తుంది. సభ్యత్వము కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియూ సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.



# ప్రేమలో తమాషాలు

## అవతారం - అనారోగ్యం

ఒకాయనకి గుడ్లు వెళ్ళుకువచ్చి, చెవుల్లో ఝూంకారము మొదలయితే డాక్టర్ని కన్‌సల్ట్ చేసేడు.

డాక్టర్ అతన్ని పరీక్షించి పెదవి విరిచి అతని టాన్సిల్స్ తీసేసేడు. అయినా అతని చెవుల్లో హోరు, కనుగుడ్లు అలానే ఉన్నాయి.

ఇంకో డాక్టర్ని సంప్రదించేడు. రెండో డాక్టర్ అతని పళ్ళన్నీ పీకేయాలన్నాడు.

సరే అని అతడు ముప్ఫయిరెండు పళ్ళూ పీకేయించు కున్నాడు. అయినా గూబలు గుయ్యిమంటూనే ఉన్నాయి. పైగా పళ్ళు పీకించుకున్నందువల్ల ఇగుళ్ళు సలుపుకూడా మొదలయింది.

మూడో డాక్టర్ దగ్గరకెళితే అతను పరీక్షచేసి నిరాశగా పెదవి విరిచి, లాభంలేదు. ఇంకా ఆరు నెలలు మాత్రం బతికే అవకాశముంది అన్నాడు.

ఇక ఆరు నెలలేకదా బతికేది అని అతను జీవితాన్ని పూర్తిగా అనుభవించ దలచి విలాసాలకై ఎడాపెడా ఖర్చు పెట్టడం మొదలెట్టేడు.

ఖరీదైన కారొకటి కొన్నాడు. ఖరీదైన హోటల్లో రూమ్ బుక్ చేయించుకొన్నాడు. నాలుగు ఫుల్ సూట్లకి ఆర్డరిచ్చేడు.

ఓ రెండు కొత్త షర్టులుకూడా కుట్టించుకోదలిచేడు.

టైలర్ అతని కొలతలు తీసుకోసాగేడు.

"ఛెస్ట్ 38, మెడ 16...." అంటూ రాసుకుంటున్నాడు.

అతను ఛట్ లాభంలేదు అంటూ గద్దించి, "మెడ 15 ఉండాలి" అన్నాడు.

"కనీసం పదిహేనున్నరయినా పెట్టుకోండి" అన్నాడు టైలర్.

"ఉహుం. వీల్లేదన్నాడు. పదిహేనుకి మించి పీసంకూడా ఉండకూడదు. అసలు నేనెప్పుడూ కాలర్ 15 దాటనివ్వను. అన్నాడు.

టైలర్ నిట్టూర్చి "సరే, మీ యిష్టం! కాని అంత టైట్‌గా ఉంటే కనుగుడ్లు వెళ్ళుకొస్తాయి. చెవులు గింగుర్లెత్తుతాయి. తర్వాత నన్నని లాభంలేదు" అన్నాడు.

—ఏ. జగన్నాధరావు, నిజామాబాదు.

## "గురక?"

ఒక ఆఫీసు మేనేజరు తన రూములో గాఢంగా నిద్రపోతున్నాడు. అతని P.A వచ్చి లేపి ఇలా అన్నాడు.

P.A: అరగంట నుండి ఒకతను మిమ్మల్ని కలవాలని ప్రాణాలు తీస్తున్నాడు సార్!

మేనే: (కోపంగా) నేను బయటకెళ్ళానని చెప్పొద్దటయ్యా?

P.A: నేను అలా చెప్పినా వినడం లేదు సార్!

మేనే: ఏం, ఎందుకని?

P.A: బయటకు వినవచ్చే గురక శబ్దం మీదేనని ఖచ్చితంగా చెబుతున్నాడు.

మేనే: ........? —జి. భాస్కర్‌రావు, బెల్లంపల్లి.

# "యూ ఫూల్ !"

న్యూయార్క్ మహానగరాన్ని చూడాలని బుద్ధిపుట్టింది ఎల్లయ్యకి.

వెళ్ళి ఓ నెలరోజులుండి న్యూయార్క్‌లోని ఎంపైర్ బిల్డింగ్ మొదలైన వింతలన్నీ చూపి ఇంటిమీదికి గాలి మళ్ళి ఇండియాకి ప్లేన్‌టికెట్ బుక్ చేసుకున్నాడు.

ఎయిర్‌పోర్ట్‌లో ఒక కొత్తరకమైన వెయింగ్ మెషిన్ కనిపిస్తే, దానిమీద నిలబడి ఓ నాణెం వేసేడు. క్లిక్‌మంటూ కార్డ్ ఊడిపడింది.

దానిమీద అతని బరువుతోపాటు అతని "వయసు 42. ఎత్తు 5 అడుగుల 9 అంగుళాలు. మీరు బొంబాయి వెళ్ళే ప్లేన్‌కోసం వెయిట్ చేస్తున్నారు" అనివుంది.

చిత్రంగా వుందే, అనుకుంటూ ఎల్లయ్య దిగి, ఓ పోర్టర్‌ని పిలిచి అతన్ని వెయింగ్ మెషీన్‌మీద నిలబడ మన్నాడు.

ఈ సారి కార్డ్‌మీద "వయసు 21, ఎత్తు 5 అడుగుల 11 అంగుళాలు. ఏర్‌పోర్ట్‌లో పోర్టర్‌గా పనిచేస్తున్నావు" అని వుంది.

ఎల్లయ్యకి ఆ మెషీన్‌ని బోల్తా కొట్టించాలనిపించింది.

తన సామాను పోర్టర్‌ని చూస్తూండమని పురమాయించి, ఓ ఫ్యాన్సీ షాపుకి వెళ్ళి విగ్గు, మేకప్ సామాను కొని పెద్దగడ్డం, బొమ్మల చొక్కా, చారలపాంటు తొడుక్కుని మళ్ళీ వెయింగ్ మెషీన్‌మీద నిలబడ్డాడు.

నాణెం వెయ్యగానే కార్డ్ వచ్చింది.

దానిపై యిలావుంది. "వయసు 42 సం.లు ఎత్తు 5 అడుగుల 9 అంగుళాలు. బొంబాయికి వెళ్ళే ప్లేన్‌ని

ఇప్పుడే మిస్ చేసుకున్నావు. యూ ఫూల్!"

నోరు తెరిచేడు ఎల్లయ్య.

—ఏ. జగన్నాథరావు, నిజామాబాదు.

## ది గ్రేట్ డిటెక్షన్!

"బావిలో వెయ్యనా?" మగగొంతు.

"హుస్ నెమ్మదిగా మాట్లాడండి పిల్లలు నిద్రపోతున్నట్టున్నారు. వింటారు. చెరువులో వెయ్యండి."

"ఉదయమా, సాయంత్రమా?" మళ్ళీ మగగొంతు.

"అబ్బ, మీ కెన్నిసార్లు చెప్పాలండి! అర్ధరాత్రి అంకమ్మ శివాలన్నట్టుగా నాలుగూళ్ళకు విన్పించేటట్లు మాట్లాడతారు. ఏ పనీ గుట్టు చప్పుడు కాకుండా చెయ్యరు కదా!" స్త్రీ గొంతు విసుక్కుంది. "సాయంత్రం అయితేనే బాగుంటుంది" స్త్రీ గొంతు విన్పించింది.

సరదాగా డిటెక్టివ్ వృత్తి చేపడదామని క్రొత్తగా ఆ వాటాలో దిగినశంకరన్న చెవులునిక్కపొడుచుకొనివిన్నాడు.

శంకరన్న ఆ యింట్లో ఆ రోజే దిగాడు. ఇంకా బోర్డు కూడా కట్టలేదు. శంకరన్న పని హడావిడిలో పడి ఇంట్లో బోర్డు కట్టడం మర్చిపోయాడు. తన నిర్లక్ష్యంవల్ల ఎంత మేలు కలిగింది. శంకరన్న తనను తనే అభినందించుకున్నాడు. తనుకనక తగిలించివుంటే ప్రక్క వాటావాళ్ళు ముందే జాగ్రత్తపడేవారు.

ఇన్నాళ్ళకు తనను అదృష్టదేవత కరుణించింది. ప్రక్కవాటావాళ్ళు దంపతులు కారు. ఫేమస్ స్మగ్లర్స్ అయి వాళ్ళ స్మగ్లింగ్ బిజినెస్ గుట్టుమట్లన్ని తెలుసుకున్న ఏ ఏజెంట్‌నో వాళ్ళు చంపుతుంటారు. శవాన్ని మాయం చేయడం యెలా అని తికమక పడుతున్నారు.

మర్నాడు సాయంత్రం తమ యింటి సందుదగ్గర కాపు వేసాడు శుంఠన్న. తను నిల్చున్న ప్రదేశంనుండి తమ యిల్లు బాగా కనపడుతున్నది. నిమిషాలు గంటలు గడుస్తు న్నాయి. శుంఠన్న ఓపికగా ఎదురు చూస్తున్నాడు.

ఇంతలో ఇంటిముందు ఓ టాక్సీ ఆగింది. స్మగ్లర్ పెద్ద గోనె సంచీతో యివతలకు వచ్చాడు. సంచీని ట్యాక్సీలో పెట్టి, పోనియ్యి అన్నాడు.

తన నిరీక్షణ ఫలించినందుకు శుంఠన్న సంతోషించాడు. తను మోటర్ సైకిల్ ఎక్కి ట్యాక్సీని ఫాలో అయ్యాడు.

మూటలోవున్న శవం పాపం! ఏ ఏజంట్దో? కర్తవ్య నిర్వహణలో ప్రాణాలు పోగొట్టుకున్న ఆ ఏజంట్ ఆత్మకు శాంతి కలుగుగాక! ఏజంట్, నిన్ను హత్య చేసిన ఈ కిరాతకుడ్ని పోలీసులకు పట్టిస్తాను. మనసులో ప్రతిజ్ఞ చేసాడు.

ట్యాక్సీని కనుమరుగుకాకుండా ఫాలో అవుతున్నాడు. ట్యాక్సీ రాజేంద్రనగర్ అగ్రికల్చర్ యూనివర్సిటీమీదుగా హిమాయత్సాగర్కు వెళ్తున్నది.

ఫ్లడ్గేట్స్ దగ్గర ట్యాక్సీ ఆగింది. శుంఠన్నకూడా మోటర్సైకిల్ ఆపాడు.

స్మగ్లర్ నెమ్మదిగా టాక్సీ దిగి, గోనె సంచీని తను ఒక్కడే కష్టపడుతూ దింపాడు. మూటను నీటిలోకి విసరి వెయ్యబోయాడు.

మెరుపులా వెళ్ళి అతడ్ని పట్టుకున్నాడు శుంఠన్న.

"స్మగ్లర్! నీ పాపం పండింది. ఇన్నాళ్ళు తెర వెనక ఆడుతున్న నీ నాటకానికి నేటితో ముగింపు చెప్పు. ఆ మూటలోవున్న శవం ఎవరిది? నిన్నటినుంచీ నీ ప్రవర్తన

నీ మాటలు కనిపెడుతూనే వున్నాను. నిన్ననే నిన్ను పట్టు కుందును. కానీ రెడ్‌హాండెడ్‌గా పట్టుకోవాలని యింత వరకూ ఆగాను. చెప్పు. నీ స్థావరం ఎక్కడ. నీ పాపంతో పాలు పంచుకునే పరిచారకు లెవ్వరు? నీతో భాగస్వాము లెవ్వరు?" గర్జిస్తూ అడిగాడు.

స్మగ్లర్ చెయ్యి విదిలిస్తూ "మిష్టర్. శవం ఏమిటీ స్మగ్లింగ్ ఏమిటి? స్థావరం ఏమిటీ? పిచ్చాసుపత్రినుంచి పారిపోయి వస్తున్నావా?" అడిగాడు.

"స్మగ్లర్! ఏమీ ఎరగనట్టు బుకాయించకు. ఆ మూటలో వున్నది శవంకాదూ. నీ రహస్యాలు తెల్సుకున్నా డని అతడ్ని హత్య చేసావు. నేనంత శుంఠననుకున్నావా? అటు చూడు సైకిల్‌మీద నా అసిస్టెంటు పోలీసులతో వస్తున్నాడు."

స్మగ్లర్ బిగ్గరగ నవ్వాడు. సంచీ మూతికట్టు విప్పాడు. దానిలో వినాయకుడి విగ్రహం చాలా పెద్దది కన్పించింది. సంచీ నిండా గులాబీలు, చమేలీలు, పచ్చ చామంతులు, పత్రి కన్పించాయి.

"వినాయక చవితి అని వినాయకుడ్ని పూజించాము. బావిలో వెయ్యనా, చెఱువులో వెయ్యనా అన్నది ఈ విగ్ర హాన్నే. పూజానంతరం విగ్రహాన్ని నీటిలో వదలడం ఆచారం. శుంఠన్నగారు నన్ను యిలా చేస్తేచేసారు. మీ అమాయకత్వాన్ని నేను క్షమిస్తున్నాను. కానీ యింకెవరి నన్నా యిలా చేస్తే పరువునష్టం దావా వెయ్యగలరు. జాగ్రత్త!"

డిటెక్టివ్ శుంఠన్న అలానే కళ్ళప్పగించి చూడసాగాడు.

—మారుపాక మంజురాణి, హైద్రాబాద్.



